# భారతి—ఏకోనవింశతి సంపుటము. భా–౨ – 1962

## వ్యాసముల అకారాది సూచి

[illegible] — 12 ([illegible])

---

# ప్రకటన

---

ఈ క్రిందకనబరచిన నెంబర్ల వారికి ఈనెల (1942 సం. డిసంబరునెల) తో ఇదివరకు "భారతి"కి, చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరుచేయ గోరెదము. ఇకమీద వి. పి. లను పంపుట మానివేసినాము. కనుక సదరు చందాదారులనుండి మరుసటినెల 6-వ తేదీలోగా మా కార్యాలయమునకు చందాధనము చేరకున్న పత్రికపంపుట్ల నిల్పివేయ వలసి వచ్చునని మనవిచేస్తున్నాము.

A 4, 5, 7, B 6, 9, 10, C 4, 5, 6, 8, G 6, H 55, 56, 57, 9, 78, K 7, 8, 12, L 7, 8, 9, M 6, 10, N 11, 17, O 3, P 22, 24, 26 28, 33, R 23, 24, 25, 26, 27, 28, 30, 31, S 78, 80, 82, 83, 84, 8[illegible] 8[illegible], 88, 89, 90, 91, 92, 103, 115, 118, 119, 120, 123, 127, 128, 142, V 14, 16, 17, 19, 20, 28, 33, Z 1.

మేనేజరు
"భారతి"

---

శ్రీ



సంపుటము 19
సంచిక 7

భారతి

చిత్రభాను ఆషాఢము
1942 జూలై

# ఇంద్రియ మర్యాద

●

— శ్రీ విశ్వనాథ సత్యనారాయణ —

కన్నులోర్వంగరాని వికారఘోర
రాక్షసపుబొమ్మ చూచి విభ్రాంతదృష్టు
రాపరాభూతబుద్ధిధారావివేకుఁ
డొకఁడు కెవ్వున నఱచి మృత్యువునుబొందె.

చెవులు పట్టరాని శీర్ణశ్రవోరంధ్ర
నిబిడశక్తియైన నిష్ఠురంపు
రవము సోకి పగిలి, చెవిగూబ లదటున
నావటిల్లి బధిరుఁ డయ్యె నొకఁడు.

చివురుపట్టక తాంబూల సేవనమున
సున్న మెక్కువయై నాల్క సూడి పగిలి
రెండునాళ్లులు తిండికి నెండఁగట్టె
పలుచ కారమ్ము తగిలిన సలుపుతెచ్చి.

ఒక్కపాళముగా నున్న యుష్ణతయును
శైత్యమును దాఁటి తీవ్రప్రసారము లయి
యింతసుఖదాయియైన చర్మేంద్రియంబు
ప్రాణములను మృత్యువుసమీపమున కీడ్చు.

ఒక్కదుర్వాసనాప్రవాహోరువేగ
దీర్ఘమై మెండి యూపిరితిత్తు లెల్లఁ
జెడి క్షయవ్యాధి పుట్టుఁ గన్పడిన యింద్రి
యముల శ_త్రయు ధర్మమ్ము హద్దు పెట్టి.

మది కళాంత మనాత్మమా చదువు చదివి
మొండిచేతికి వ్రేళ్లులు మొలిచినట్లు
ఇక్లై చిల్లలువేసి బీట్లిచ్చి యొకఁడు
సర్వప్రళయాభిముఖముగా సంచరించు.



# 'జసహరచరివు'

[యశోధర చరిత్ర]

●

## = శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు =

ఏమతముగాని యెక్కువ వ్యాప్తికి రావలెనన్నచో- సాధారణముగా-దాని వాఙ్మయమంతయు సామాన్య భాషలో నుండవలెనను టొక రహస్యము. దీనిని గమనించినవి-యారంభించినవి ముఖ్యముగా జైనబౌద్ధములు రెండు. తరువాత దక్షిణమున గొంతకుగొంత వీరశైవము. బుద్ధభగవానుడు తన ధర్మములను బోధించినది పాళీభాషలోనే. ఈదృష్టి జైనులకు మరియు నెక్కువ. వారానాటి ప్రచలితభాష లన్నిటియందును జేయివేసిరి. అద్భుతముగా నిర్వహించిరి. జైనము దక్షిణాపథమునకు దిగుకొలదియు ద్రావిడ భాషలలోగూడ వారి రచనలు బయలుదేరినవి. కాగా-నేడు ప్రాకృతములను జదువవలెనన్నచో జైనకవులను మఱచుటకు వీలులేదు. వారి వాఙ్మయములోని చాలభాగము కాలగతికి లోబడి నశించిన మాట వాస్తవము. కాని మిగిలిన యాకొలదిని జూచినపుడే "యయ్యో! గతించిన వాఙ్మయమింకెంత మధురమైనదో" యను దుఃఖము గలుగును. జైనమహాకవి యగు పుష్పదంతాచార్యున కీగతియే పట్టినది. అతని గ్రంథము లెన్నియో నమమాత్రములనే నశించినవి. నేడు మిగిలినవి మూడుమాత్రమే. అవియును అపభ్రంశభాషలోనే యున్నవి. వానిలో 'జసహర చరివు' (యశోధరచరిత్ర) కవితలో సుధురము-రచనలో విలక్షణము; మార్గమున నూతనము.

పుష్పదంతుని కాలము క్రీ. శ. ౯-వ శతాబ్దము లోని యుత్తరభాగము. అతడు తొలుత శైవబ్రాహ్మణుడు. కాశ్యపగోత్రుడు. తండ్రి కేశవభట్టు; తల్లి ముగ్ధాదేవి. పుష్పదంతునకే 'ఖండు' డను నామాంతరముండెను. నాడు 'మన్యఖేటము' రాష్ట్రకూటులకు ముఖ్యపట్టణము. మూడవ కృష్ణరాయుడు రాజు. అతని మంత్రి భరతుడు.[2] పుష్పదంతు డారాజు, నీమంత్రిని గని పెట్టుకొనియుండి, వారి యాదరమున దానీ రచనములను సాగించెను.

ఆకాలమున బుష్పదంతుడు మహాప్రసిద్ధుడు. అతనికి సుమారొక పదిపదునేడు బిరుదు లుండినవి. అన్నిటికన్నను 'అభిమానమేరు'[3]వను బిరుదముపై ఆదర మెక్కువ. సమయము వచ్చినపు డంతయు దానిని సగర్వముగా దడవుకొనుచుండును. అతని జీవితమున నభిమాన మొక ముఖ్యగుణము. కనుకనే తనకు సరియగు గౌరవ మొసగని వీరరాజకవిపతిని విడచి రాష్ట్రకూటుల నాశ్రయించెను. జీవితములోని యీభావమే కవిత కెక్కినది. రచనలో నాతడు మహావశి.

'జసహరచరివు' అనగా యశోధరు డను రాజు జైనుడుగా మారిన గాథ. దీనికి జైనవాఙ్మయమున గల వ్యాప్తి చాల పెద్దది. అందుచే భరతుని 'కుతుడు నన్నయ' పుష్పదంతు నారచనకు బ్రేరేచెను. అపుడు మహాకవికి 'ప్రౌఢ నిర్భర వయఃపరిపాకము'. అనుభవములతో బాటభిప్రాయములును సానలుదీరినవి. అన్ని విషయములందును నదుపులేని యాతని కల మద్భుతనాట్యమును గావించినది. 'జసహరచరివు' అమృతభవనముగా మనకు దక్కినది

---

1. "ముగ్ధశ్రీమదనింద్యఖండ సుకవే
ర్బంధుర్గుణైకున్నతః"

2. "స్వప్నేప్యేష పరాంగనాం నభరతః
శౌచాంబుధిర్వాంఛతి"
—మహాపురాణము.

3. "జయిఅహిమాణమేరుణామంకే"
—మహాపురాణము.

"అహిమాణమేరుకయిపుప్ఫయంతు"
—జసహరచరివు.

యశోధరచరిత మొక చక్కని గేయకావ్య మనవచ్చును. ఆ గేయముల కపభ్రంశమున 'కడావకము' లని పేరు. అవి గాక కొన్ని గీతములవంటివే యగు 'దువయీ' వృత్తములును, అక్కడక్కడ 'ఘత్తా' ఛందములును నున్నవి. ఈ 'ఘత్తా' ఛందములు గీర్వాణమునందలి యార్యావృత్తములవంటివి. ఈ కావ్య మంతయు నొక పాటవలె చల్లని వెన్నెలలో హాయిగా బాడుకొనుట కనుకూలముగా నుండును.

పుష్పదంతుడు సమయానుకూల రచనయందు జాల గడుసరి. విషయమునకు దగినట్లు శైలినేకాక ఛందములనుగూడ మార్చుచుండును. ఆ విషయమును, ఆ లయయు జెనవై చికొన్నపు డెంతో మధురముగా నుండును. ఈ క్రింది 'కడావక'మున యశోధరామృతమతుల దాంపత్యసుఖ మెంత చక్కగా అదికినదో చూడుడు:

"అమయమయీయే సచ్ఛమయీయే
హంసగయీయే సుద్ధసయీయే
పియపత్తీయే మ్యఝంతీయే
సిఢిలవిలాసో గరుఅపవాసో
ణ్యయణణి మేసో విరహాకిలేసో"4 (౨-౧)

ఇట్టి రచనలనుబట్టి జైనకవులు సామాన్యమానవుల హృదయములలోని కెంతగా జొచ్చుకొనిపోయిరో యూహింపవచ్చును. అట్లే యశోధరుని యుద్యానవనమును వర్ణించుచు—

"జత్థచూయకుసుమమంజరియా
సుయచంచూచుంబణ జజ్జరియా
వాయం దోయణ లీలాసారో
తరుసాహాయే హల్లయి మోరో
సోహాయి ఘోలిర పింఛసహాసో
ణం వణలచ్ఛీ చమరవిలాసో
ఖరకంటయ ణహణిబ్భిణ్ణంగో
ణచలయి జత్థ ఖణంపి భుయంగో"5 (౧-౧౨)

అని రచన సాగినపు డెక్కడో పున్నమనాటి వెన్నెల పొరలపై పలికిన గాలిపాటవలె మనోహరముగా వినదించును. సామాన్యజీవితమునకు సంబంధించిన ప్రాకృతములు నశించుటతోబా టిట్టి మనోహరకావ్యములును మాయమైనవి. వానితోగూడ మధుర కోమలములగు నీసంప్రదాయములును నంతమొందినవి.

## గుణాతిశయములు :

పుష్పదంతునిలో గానబడు మహాశ్చర్యకరమగు గుణము సంకుచీకరణము (Brevity). "అల్పశబ్దముల ననల్పార్థరచన గల్పించుట" యాకవి కిష్టమైనది. ఒక్కపదము వ్యర్థముగా వాడకుండు టటుండగా, నొక వాక్యమే సుమా రొకఘట్టమునకంతకు దీప్తి నిచ్చును.

అమృతమతి పండుకొన్నది. యశోధరుడు ప్రవేశించినాడు — 'సర్వాంగపులకకంచుకితుడై', అపుడు "ణం సవిససప్ప దట్ఠుఉచలయి" 6యని వర్ణించినాడు. ఆయుపమాన మొకటే పైని జరుగబోవు దుష్పరిణామమునకంతకును వెలుగుజల్లుచున్నది. అట్లే చంద్రికాదీపితమగు రాజభవనమును "ణం తుసారహారావలి ఛయియం"7యను టెంతో మధురముగా నున్నది.

ఈ క్రిందివర్ణనమును జూచినచో నాతని సంకోచశక్తి యెట్టిదో తేటపడగలదు. ఒకనాటి చంద్రుడు—

"ణంచక్కెతమోహ విహండణ థ్రా
ణం సురకరిసియ ముహామండణ ఉ

4. "అమృతమత్యా సత్యమత్యా
హంసగత్యా శుద్ధసత్యా
ప్రియపత్న్యా మజ్జంత్యా
శిథిలవిలాసః గురుప్రవాసః
నయననిమేషః విరహక్లేశః"

5. "యత్ర చూతకుసుమమంజర్యః
శుకచంచూపుటజర్జరితాః
వాతాందోళన లీలాసారః
తరుశాఖాసు నృత్యతి మయూరః.
శోభతే భ్రమత్పింఛసహాసః
నను వనలక్ష్మీచమరవిలాసః
ఖరకంటక నఖ నిర్భిన్నాంగః
నచలతి యత్ర క్షణమపి భుజంగః."

6. "నను సవిషసర్పో దష్టుం చలతి."

7. "నను తుషారహారావళీచ్ఛాదితం."

ణం కిత్తియే దావియణియయ ముహు
ణం అమయభవణు జణదిణ్ణ సుహు
ణం జసపుంజిఉ పరమేసరహో
ణం పండురఛత్తు సురేసరహో
ణం రయణీవహు హి ణిడాల తిల ఉ
ఉగ్గఉససిణం సయిరిణి విల ఉ"[8]

ఇట్లున్నాడు. పైగేయమున నేపాదమున కాపాదము సుందరముగా దునిగినది. ఉత్ప్రేక్ష లుపమానము లనిపించునంత సరసములుగా నున్నవి. సౌందర్యపిపాసలో, స్వాతంత్ర్యములో కాళిదాసు జ్ఞప్తికి వచ్చుచున్నాడు. ఈసంకోచము ఈమహాకవికి జీవనధర్మము.

భావస్వాతంత్ర్యము ప్రాకృతకవులకే ముఖ్యముగా నంటివచ్చిన విద్య. గీర్వాణసాహిత్యముతో, నాసాంకేతికములతో నలవాటుపడిన మనకు ప్రాకృతభాషాప్రగతియే యొక క్రొత్తప్రపంచముగా గానుపించును. వారి వస్తువులే వేరు. వారు దిద్దు రంగులే వేరు. పుష్పదంతునియందును ఆసంప్రదాయమే నిండుకొన్నది. తీర్థంకరుసుద్దేశించి "జయణోమిధమ్మరహచక్కణేమి[9]"యన్నాడు. చంద్రు 'నమృతభవనము' గా వర్ణించినాడు. ఇట్టి వెన్నియో కలవు. ఆమూలాగ్రము భావస్వాతంత్ర్యమే చిందులుద్రొక్కు గ్రంథమున నొకటి రెండు ముక్కలుమాత్ర ముదాహరించుట హాస్యాస్పదముగాదా!

'యశోధరచరిత' లో గనపడు నింకొక మహత్తరగుణము మితి. సామాన్యకవులకు స్వప్రతిభను వెల్లడింపవలె నను చాపల్యము మెండు. ఆ యూళనణచుకొనజాలువాడు మహాకవి యొకడే. అనేక గ్రంథములను జూచినపుడు వాని తెగబారెడు వర్ణనములకు మనకు విసుగును, అసహ్యమును గలుగుచుండును. పుష్పదంతుడు మహాకవి. అతని కీచాపల్యము లేదు. దేనిని వర్ణించినను పది పదునైదుపంక్తులకు మించిపోవదు. ఆ కొంసంతయు నమృతఖండమువలె ముగ్ధమధురము. సందర్భశుద్ధితో 'సెలవివార' నవ్వు చుండును. నిజముగా వేరొక కవియైనచో ద్వితీయాశ్వాసములోని సంధ్యావర్ణనమునకు పదివృత్తముల నైనను ఖర్చుపెట్టియుండును.

అలంకారములలో స్వభావోక్తి మణిదీపము వంటిది. దానిని వర్ణించుట కొకాళమున జెంగించు భావనమాత్రమే చాలదు. అనుభవము, సహృదయత మొదలగు నన్ని గుణములును పరిణతి గావలెను. ప్రాచీను లందులకే దాని కసాధారణ గౌరవము నొసగి మన్నించిరి. తన యన్ని చాపల్యములను భస్మముగావించిన మహాపురుషుడే స్వభావమును జెప్పగలడు. సుందరముగా జెప్పగలడు. పుష్పదంతునకు స్వభావోక్తి యన్న ప్రాణము. అతని వస్తువులన్నియు సర్వసామాన్యములు. మన కనుభవములో నుండి లెక్కపెట్టక విడచిన సజీవచిత్రములు. ఎన్నడును మఱపునకు రానివి. యశోధరచరితములోని 'చండమారి' వర్ణనమును చూడుడు:

"ఉరయలివిలులియణరరుండమాల
సిసుససిసమముహదాఢాకరాల
ఫణిబద్ధదీహాలంబిరథణాల
తయియచ్ఛివిణిగ్గయజలణజాల
లలలాయియజీహరుహిరోలమాల
వసకద్దమచచ్చిక్కియకవోల
ఘోణసకడిసుత్తయలిహియపాయ
పిఉవణధూలీధూసరియకాయ
ణిమ్మంసభీమచమ్మట్ఠిసేస
సిహిసిహాసంణిహపరిసుద్ధకేస"[10]

పైదానిలో బీభత్సరసము తీడిరించినది. చండమారియే యెదుట నిలచి మాటలాడిన ట్లున్నది. భయ

8. "నను చక్రతమాఘవిఖండనం
నను సురకరిసితముఖమండనం
నను కీర్త్యాః దర్శితనిజకముఖం
నన్వమృతభవనం జనదత్తసుఖం
నను యశఃపుంజః పరమేశ్వరస్య
నను పాండురఛత్రం సురేశ్వరస్య
నను రజనీవధ్వా నిటాలతిలకః
ఉదితశ్శశీ నను స్వైరిణీవిలాసః"

9. 'జయనేమిధర్మరథచక్రనేమి.'

10. "ఉరస్థలే విలులితనరరుండమాలా
శిశుశశిసమముఖదంష్ట్రాకరాలా
ఫణిబద్ధదేహాలంబమాన స్తనవతీ
తృతీయాక్షివినిర్గతజ్వలనజ్వాలా

మగుచున్నది. ఉపమానములు రెండును దమయంత నడుమకొన్నవి. ప్రకృతోపస్కారకములై జాజ్వల్యమానములుగా నున్నవి. రసవత్కవికి జీవధర్మమగు తన్మయీభావన యొక పెద్ద ప్రవాహమువలె వర్ణనమునంతయు ముంచుకొన్నది. ఇట్టిదే మరియొక స్మశాన వర్ణనము.—

"సివసియాలదారియమయోయరం
కరయరంతకాయఉలసంకులం
ఘంఖరుక్ఖ సుక్కేహి ణిప్ఫలం
రక్ఖసీముహాముక్కణిసణం
సూలభిణ్ణచోరఉలభీసణం
పక్ఖిపక్ఖలక్కేహి ఛాయిఉయం
కిలకిలంతణి సియరణిణాయియం
భీయరం చియా చిచ్చిజాలయం
ధూమగంధ ధావంత సాణయం
భగ్గభాణ విక్ఖిత్తఖప్పరం"11

ఇట్లు 'పవనప్రేరణోల్లలిత భస్మ'మగు దృశ్యము కండ్లయెదుట నిలిచినపు డేపాఠకుడు చలింపడు! ఇట్టి సర్వాంగసకలితమగు స్వభావవర్ణనయే తెనుగున నాచనసోమునియం దపుడపుడు ప్రత్యక్షమై మనల నాశ్చర్యచకితుల గావించుచుండును. తాను వర్ణించు దృశ్యమును సర్వాంగసుందరముగా భావించు శక్తియు, దానిని పాఠకుల కటులే యందివ్వవలె నను నాసయు పుష్పదంతునియందు ప్రధానగుణములు.

## సౌందర్యోపాసన:

పుష్పదంతుడు మహాసౌందర్యోపాసి. ప్రతివస్తువునందును రామణీయకతను జూచి యారాధింపవలెనని యాతని యాశ. దానికి దగిన నిశితమగు పరీక్షణాదృష్టి నలవరచుకొన్నాడు. పైరుపచ్చలన్నను, పల్లీజీవితమన్నను ఆ'మహాకవి'కి ప్రాణము. అతడు వర్ణించిన 'యాధేయక' దేశమున బంగారుమేడలు, రతనాలవాడలు లేవు. మరి-మహీకామిని యౌవనమును బోలిన యుపవనములు. వాని ఫలములను రాలగొట్టు క్రీడాపరవశులగు ముగ్ధగోపాలురు. రోమంథనచలితగండములగు నాబోతులు. జీవితములలో మోసమే యను నెరుగని యమాయకులగు జనులు. యశోధర చరితమున కవితాకన్య గోపసుందరివలె ముగ్ధమధురముగా నటించినది. నదీసుందరివలె నమాయకముగా కుచ్చెళ్లు జార్చినది.

అపభ్రంశము మధురము. పుష్పదంతుని రచన మధురతరము.

'పుష్పయంతుడు' మహాకవి. అపభ్రంశము — ముఖ్యముగా ప్రాకృతములు ప్రచలితభాషలు గా వను నేరమున మన మా రచనలను వదలరాదు. వదలుట ఖండితముగా మన దౌర్భాగ్యమే. నూతనమగు 'జాగృతి' వెలిగిన—వెలుగుచున్న యీకాలమున మన మనుసరింపదగిన యెన్నిగుణములో ప్రాకృతకవనముల యం దున్నవి. ఇది నిస్సంశయము.

కాన నికమీదనైనను మన మా'విస్మృతకవుల' నాదరింపవలెనని నావిన్నపము. ప్రసిద్ధులగు తెల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారివంటి 'గేయకవు' లెవరైనను 'యశోధరచరితము'ను జక్కగా తెనుగులోని కనువదింపవలెను. అట్టి యత్నములు త్వరలో జరుగునని యాశించుచున్నాను.

---

లలలల జిహ్వాగ్ర ధిరార్ద్రార్ద్రా
వసాకర్దమచర్చితకపోలా
గోనస (సర్పవిశేషః) కటిసూత్ర లీఢపాదా
పితృవనధూళిధూసరితకాయా
నిర్మాంసభీమచర్మాస్థిశేషా
శిఖిశిఖాసన్నిభ పరిశుద్ధకేశా" (౧-౯)

11. "సితసృగాలదారితమృగోదరం
కరకరత్కాకకులసంకులం
శుష్కవృక్షాః శుష్యంతి నిష్ఫలం
రాక్షసీముఖాముక్తనిస్వనం
శూలభిన్న చోరకులభీషణం
పక్షిపక్షాః లక్ష్యంతే ఛాదితాః
కిలకిలన్నిశిచరనినాదం
భీకరం చితాగ్నిజాలకం
ధూమగంధధావచ్ఛ్వానం
భగ్నభాజన విక్షిప్తకర్పరం" (౨-౧౪)



# వీరు

శ్రీ మట్నూరు సంగమేశము

వీరె-నన్ జూచి నవ్వెదువారె-నాడు
తీవ్రమై దాఘతీక్ష్ణాంశుదీప్తిలోన
కాయమెల్లను గరగించి కడుపుకొరకు
కూలిపని జేయ కూలీయ కొసరినారు!

వీరె-న న్నేవగించెదువారె-నాడు
తిరిపెమెత్తుచు నాకటి తీవ్రబాధ
నలసి, నాలుక తడిపొడి యారి, పడిన
నీరమేనియు పోసినవారు గారు!

వీరె-నను వెక్కిరించెదువారె- నాడు
బ్రతుకు గడవక దొరగారి బానిసనయి
కూడు గుడిచిన గని, యిది కులట యనుచు
కూసినా రపనిందలు గూర్చినారు!

వీరు న న్నింత దూషించువారె కాని
బ్రతుకలేకున్న సాహాయ్యపడరు నేడు
బ్రతికినప్పుడు నొకరీతి బ్రతుకనీయ
రేలనో వీరి కింతటి ఏవగింపు ?

---

# విష్ణుమాయావిలాస నాటకములు

●

= శ్రీ నేలటూరు వెంకటరమణయ్య =

౧

ఆంధ్రమున విష్ణుమాయావిలాసము అను పేరు గల గ్రంథములు నాలుగు గలవు. ఇందు రాధామాధవబిరుదాంకిత చింతలపూడి యెల్లయార్య కృత విష్ణుమాయావిలాసనాటకము ప్రాచీనతమము; కృష్ణరాయల యుగమునకుఁ జెందినది. ఆనాఁడు విరచితమైన రసవత్తరాంధ్రపద్యకావ్యములలో నిది యొకటి. ౧౯౩౩-వ సంవత్సరమున నిది మదరాసువిశ్వవిద్యాలయమువారిచేఁ బ్రకటింపఁబడెను. తరువాత క్రీ. శ. ౧౭-వ శతాబ్దాంతమున రోసనూరి * వెంకటపతి యను కవి 'విష్ణుమాయావిలాస' మను మూఁడాశ్వాసముల పద్యకావ్యము నొకదానిని రచించి వెంకటగిరి ప్రభువైన బంగారు యాచమనాయుని కంకితమొసఁగెను. ఇది వెంకటగిరిమహారాజు వెలుగోటి రాజగోపాలకృష్ణయాచేంద్రులవారిచే ౧౯౦౦-వ సంవత్సరమున ముద్రింపఁబడెను.

పైరెండుగ్రంథములు గాక ఉత్తరరామాయణ కృతికర్తయగు కంకంటి పాపరాజు దా నొక విష్ణుమాయావిలాసయక్షగానమును రచించినట్లు ఉత్తర రామాయణపీఠికయందును, ఆశ్వాసాంతగద్యలందును జెప్పుకొనియున్నాఁడు:

"శ్రీవెలయ మున్ను విష్ణుమాయావిలాస
యక్షగానంబు మాకె సమర్పణముగఁ
జేసి తద్ది యాదిగా మేము నీసుధాను
సారివాక్కులఁ జొక్కియున్నార మనఘ"
(౧-౨౨)

"విష్ణుమాయావిలాసాభిధానయక్షగాన నిర్మాణ ప్రవీణతానిధానపాపరాజప్రధానప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణం బను మహాకావ్యంబునందు"
(౧-౩౩౪)

ఇది యముద్రితము. "ఈకవియొక్క విష్ణుమాయావిలాసము నేఁడు విష్ణుమాయావిలాసమునకే ఆఁకరమైనది" అని మిత్రులు బ్ర. శ్రీ. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలవారు తాము పరిష్కరించిన యుత్తరరామాయణపీఠికలో వగచిరి. కాని. శాస్త్రిలవారు తలఁచినట్లు ఈయక్షగానము నష్టము గాలేదు. తంజావూరు సరస్వతీమహాలుపుస్తకభాండాగారమున నొక ప్రతి కలదు. (చూ: డిస్క్రిప్టివ్ క్యాటలాగు - ఆంధ్రవిశ్వవిద్యాలయప్రచురణలు సంఖ్య ౧౧, పుట ౧౯౩). ఈక్యాటలాగును తయారుచేసినవారీగ్రంథమునుగూర్చి యిట్లు చెప్పియున్నారు:

"విష్ణుమాయావిలాసము—ఇందు కృష్ణభగవానుని మాయలు వర్ణింపఁబడియె. సంపూర్ణము. వ్రాఁత మంచిది.-గ్రంథపాతము లేదు. శైథిల్యము గానరాదు. తప్పులు గలవు." (పుట ౧౯౩)

ఇందువలన పాపరాజకృత విష్ణుమాయావిలాసయక్షగానము నశించిపోలే దని తెలియుచున్నది. నేఁటికిని లభ్యపడు ప్రాచీనయక్షగానములయం దిది యొకటి.

---

* నెల్లూరు జిల్లా వెంకటగిరిసంస్థానమునకుఁ జెందిన పసుటూరుసీమయం దీగ్రామము గలదు. వెంకటపతియో, యాతని పూర్వీకులో సదరుగ్రామవాస్తవ్యులై యుండవలయును.

కవి దొడ్డవాఁడు; నాటకము రసవంతమైయుండు ననుటలంపు నైజమే.

విష్ణుమాయావిలాసమును పాపరాజు యక్షగానముగ రచింపఁగా దానినే కంకంటి నారసింహకవి ద్విపదకావ్యముగఁజేసెను. నారసింహకవికృతద్విపద విష్ణుమాయావిలాసము క్రీ. శ. ౧౯౨౫లో మదరాసు నందలి విద్వన్మనోరంజనీముద్రాక్షరశాలయందు బ్ర. శ్రీ. పాలపర్తి నాగేశ్వరశాస్త్రులుగారిచే లేఖకప్రమాదాదిజనితదోషంబులు లేకుండునటులు పరిష్కరింపఁబడి ముద్రితమై ప్రచురింపఁబడెను. ఈగ్రంథముగాని, తద్రచయితగాని యాంధ్రకవుల చరిత్రకారులగు వీరేశలింగం పంతులుగారి దృష్టి కెక్కకపోయినను ఆనాఁటి పండితుల కిది కేవల మపరిచితము గాదు. శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు ద్విపదవిష్ణుమాయావిలాసమును జక్కఁగ నెఱుఁగుదురు. శబ్దరత్నాకరమునం దీగ్రంథము నుదాహరించుటయేకాక తన్నిఘంటుపీఠికయందు కంకంటి నారసింహకవిని బేర్కొనియున్నారు. అముద్రితగ్రంథచింతామణ్యధిపతులగు పూండ్ల రామకృష్ణయ్యగారును నెఱుఁగుదురు. వారీ గ్రంథము నొకానొక సందర్భమున నుదాహరించి యున్నారు.

౨

ఇంతవఱకు ఆంధ్రవిష్ణుమాయావిలాసముల విచారము. ఇఁకమీఁద ద్విపద విష్ణుమాయావిలాసమునకు సంబంధించిన చర్చ. మొదట నీతద్గ్రంథకర్త చరిత్రను గనఁగొనవలసియున్నది. స్వవిరచిత ద్విపద ప్రబంధమునఁ గంకంటి నరసింహకవి యిట్లు చెప్పకొని యున్నాఁడు:

"ఆర్వేల వంశాబ్ధిహరిణలాంఛనుఁడు
గర్వితరిపుమంత్రిగర్వభంజనుఁడు
గురుతరశ్రీవత్సగోత్రపావనుఁడు
పరిలబ్ధ మదనగోపాలభావనుఁడు

* * *

ప్రపితామహుని వల్లభప్రభుఁబోలి
యెపుడు బంధులఁ బ్రోచు హితకీర్తిశాలి
యగణితమతిధాత యైన తమతాత
యగు నయ్యఘనఁ బోలు నఖిలైకదాత
కంకంటి యప్పయాగ్రణికుమారుండు
పంకజాస్త్రసమప్రభావిహారుండు
మాయన్న నరసమాంబాగర్భశుక్తి
జాయతమౌక్తికంబగు శుభవ్యక్తి
నరవర్ణ్య వేంకటనరసింహుఁగన్న
సరసుండు పాపరాజప్రధానుండు."

పై ద్విపదలవల్ల ద్విపదవిష్ణుమాయావిలాసగ్రంథకర్తయగు నారసింహకవి విష్ణుమాయావిలాస యక్షగానోత్తరరామాయణరచయితయగు కంకంటి పాపరాజునకుఁ దమ్ముఁ డని తెలియవచ్చుచున్నది. నారసింహకవి చెప్పిన స్వవంశచరిత్ర సరియైన దని కంకంటి పాపరాజకృతగ్రంథములు రుజువుసేయుచున్నవి. పాపరాజు విష్ణుమాయావిలాస యక్షగానమున స్వవంశము నిట్లు ప్రశంసించియున్నాఁడు :

"వరుస మీముత్తాత వల్లభామాత్యుండు
గృతకృత్యుఁడై మించెఁ గృష్ణుఁ గొలిచి
ఘనుఁడు మీతాత అయ్యనమంత్రి మదనగో
పాలమంత్రోపాస్తి ప్రతిభఁ జెందెఁ
కరుణాబ్ధి మీతండ్రి కంకంటి అప్పయ్య
ప్రభుఁడు తాదృశకీర్తి బాగుమీఱె
శ్రీవత్సగోత్రవారిధి కౌస్తుభమురీతి
వారికంటెను నీవు మీఱినావు
నరసమాగర్భజలధి రత్నంబు నీకు
తమ్ముఁడను నారసింహ్వంబు చిదంబు (?) నిదియె
భక్తిఁ గృతియిమ్ము మదనగోపాలునకును
సద్గుణనివాస పాపరాజప్రధాన !" *

ఈ విషయమునే యుత్తరరామాయణ గ్రంథావతారికయం దిట్లు చెప్పియున్నాఁడు:

---

* తంజావూరి సరస్వతీమహాలు లైబ్రరీలోని తెలుఁగు వ్రాఁతపుస్తకములపట్టీ (ఆంధ్రవిశ్వ విద్యాలయ ప్రచురణములు సంఖ్య ౧౪, పుట ౧౯-3.)

"విమతగర్వాపహారు లార్వేలవారు
అట్టియార్వేలవారిలో నలఘుకీర్తి
వెలయు శ్రీవత్సగోత్రారవిందహేళి
మహితగుణశాలి వల్లభామాత్యమౌళి.

*  *  *

శ్రీవల్లభుండు లక్ష్మీ
దేవిని మును పెండ్లియైన తెఱఁగునఁ దనకున్
దేవేరిగ లక్ష్మాంబిక
నావల్లభమంత్రి పెండ్లియాడెన్ వేడ్కన్.

*  *  *

అల్లక్ష్మమాంబయం దా
వల్లభనామప్రధానవర్యుఁడు గనియెన్
పల్లవబాణాకారున్
హల్లకహితకీర్తిహారు నయ్యనధీరున్.

*  *  *

అయ్యనవద్యగుణావని
యయ్యనమంత్రిమణి నరసమాంబ వివాహం
బయ్యె నవార్యకుమారిని
నెయ్యంబునఁ బెండ్లియైన నెలతాల్పు రహిన్.

*  *  *

ఆనరసమాంబగర్భాం
భోనిధి నమృతాంశుచందమున దానయశో
నూనవిభావిభవైకని
ధానంబగు నప్పయప్రధానుఁడు వొడమెన్.

*  *  *

జనమతుఁ డయ్యప్పనఘునఁ
డనఘుఁడు బిదురూరి నరసయకుఁ దిమ్మమకున్
దనుజామణియై గుణముల
ఘనుఁ బొందెడి నరసమాంబ పెండిలియయ్యెన్.

*  *  *

అన్నరసమాంబయందు స
మున్నతగుణుఁ డప్పనార్యముఖ్యుఁడు గనియెన్
సన్నుతుని పాపరాజా
ఖ్యున్నరసింహాభిధానుఁ గులము వెలయఁగన్."

(౧:౨ ౭–౮౦)

పైనుదాహరించిన గ్రంథములయందు వర్ణింపఁబడిన కంకంటివారి వంశపరంపర ఇది:




## 3

## కవియొక్క సమకాలికులు

నారసింహకవి తన సమకాలికులగు ఆంధ్రకవుల నిద్దరిని పేర్కొనియున్నాఁడు. వీరియందు మొదటివాఁడు ఇతని యన్నయగు పాపరాజు. రెండవవాఁడు పుష్పగిరి తిమ్మన.

"అనఘుని పుష్పగిర్యప్పన్నతనయు
ఘను సంస్కృతాంధ్రైకకవనాతిదక్షు
మా యన్నసఖుని తిమ్మనకవిఁ గృతిస
హాయునిఁ బిలిపించి యమ్మేటితోడ."

పుష్పగిరి తిమ్మన కృతిసహాయుఁడఁట. అనఁగా ద్విపద విష్ణుమాయావిలాసరచనయం దతఁడు కంకంటి నారసింహరాజునకుఁ దోడ్పడె నని దీని భావము. ఇతఁడు పాపరాజునకుఁ గూడ నుత్తరరామాయణ రచనయందుఁ దోడ్పడినట్లు ఉత్తరరామాయణములోని "అనిఁ గిరీటికి శౌరి తోడైనయటులు" (౧-౨౬)అను పద్యము వల్లఁ దెల్లమగుచున్నది. విష్ణుమాయా విలాసయక్షగాన రచనయందుఁగూడఁ గొంత సంబంధ ముండినట్లుతలఁచుట కవకాశము కలదు. దీని కాధారము విష్ణుమాయావిలాస యక్షగానములోని యీ క్రింది వచనము:

"విష్ణుమాయావిలాసం బను యక్షగానంబు రచియింప యీకృతికి నేవేల్పు నధిపతిఁ జేయుదు నని తలంచుచున్న మదీయకార్యఘటనాభిముఖులైన కవి తిమ్మనార్యప్రముఖు లేమని నుతింపుచున్నారు"*

ఈ వచనమునఁ బేర్కొనఁబడిన కవి తిమ్మ నార్యుఁడు పుష్పగిరి తిమ్మనార్యుఁడేకాని యన్యుఁడు గాఁడు. ఇతఁడు కంకంటి సోదరుల కిరువురకును గ్రంథరచనకుఁ దోడ్పడుట చిత్రము. ఈ తోడ్పాటు విష్ణుమాయావిలాసయక్షగానముతో ప్రారంభమాయెను. ఉత్తరరామాయణరచనయందు క్షీరనీరన్యాయమున పాపరాజుకవనముతోఁ గలసి దానికి వన్నె దెచ్చినది. పాపరాజుమరణానంతరము గ్రంథరచనకుఁ గడఁగిన యతని తమ్ముని కవితకు రూపొసఁగినది. నారసింహ రాజు ద్విపదవిష్ణుమాయావిలాసమును దప్ప నన్య గ్రంథములను రచించినట్లు చెప్పకొనలేరు. మఱియు పాపరాజు జీవదశయం దుండఁగా నీతఁడు గ్రంథరచనఁ దలపెట్టలేదు. తా రచించిన ద్విపదకావ్యము నెవ్వని కంకితము సేతునా యని చింతించుచుండఁగా పాప రాజు స్వప్నమున సాక్షాత్కరించి శ్రీరామచంద్రుని కంకితము సేయుమని చెప్పెనఁట.

"అతులమౌ విష్ణుమాయానాటకంబు
వితతవాగ్వైఖరి ద్విపదగావించి
యీవిశ్వహితకృతి కేవేల్పు నధిపు
గావింతు నని యాత్మ గణియించునపుడు

* * * *

దురితసరోరుహతుహినభానుండు
పరనుండు పాపరాజప్రధానుండు
నాకలలో నొక్కనాఁడు గాన్పించి
యేకతంబునఁ గూర్మి యొసఁగ నిట్లనియె
నాకూర్మిసోదర నరసింహ నీవు
చేకొని ద్విపదగాఁ జేసినయట్టి
అనుపమవిష్ణుమాయానాటకమున
కనురూపవిభుఁ డెవ్వఁ డని తలంచెదవు
దానికి విభుఁడు సీతామనోహరుఁడె
కాని తదన్యుండు గలఁడె లోకమున"

కావున కంకంటి నారసింహకవి ద్విపదవిష్ణు మాయావిలాసము రచించునప్పటికి అతని యన్నయగు పాపరాజు స్వర్గస్థుఁ డాయె ననుట నిశ్చయము. పుష్ప గిరితిమ్మనార్యుఁడు దన సహశ్రోతయగు పాపరాజు యొక్క మరణానంతరముగూడ నాతనియందలి వాత్స ల్యముచేతనో, మఱి యేకారణముచేతనో అతని తమ్ముఁడు గ్రంథరచనకుఁ గడఁగఁగా నతనికిఁ 'గృతి సహాయుఁడై' తోడ్పడెను. ఈసందర్భమున గమనించఁ దగిన యంశ మొకటి కలదు. "పుష్పగిరి తిమ్మనార్యుఁడు కంకంటి పాపరాజు వ్రాసినట్టు ఉత్తరరామాయణ మొక టియు, కంకంటి నారసింహరాజు వ్రాసినట్టు విష్ణు మాయావిలాసద్విపదకావ్య మొకటియు రచించినాఁ" డనునైతిహ్యము కలదని బహుజనపల్లి సీతారామా చార్యులవారు తెలిపియున్నారు. † ఉత్తరరామాయణ కర్తృత్వమునుగూర్చి యభిప్రాయభేదములు గలవు. కావ్యరచనయందుఁ బుష్పగిరి తిమ్మన కంకంటి పాప రాజునకుఁ గొంతతోడ్పడియుండినను, వీరిరువురి కవిత్వ మునకును భేదమున్నందున, ఈలోకప్రవాదము సరియైన దిగా నుండదని వీరేశలింగంపంతులుగారు నుడివిరి. ‡ "తిమ్మకవి సమీరకుమారవిజయశైలికిని, దీని శైలికిని, పదప్రయోగాదులకును ప్రాక్పశ్చిమముల యంతరము కల"దని పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రులవారు వక్కాణించిరి. ¶ ఈవిషయమై కొంత పరిశోధన సాగించిన మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు పైవారితో నేకీభవించక "కవితాశైలినిబట్టి . చూడ నుత్తరరామాయణమునందు ఆదిశ్రీకారమునుండి యం త్యాక్షరమువఱకును బదగుంఫనముననేమి, సమాసజాటి ల్యముననేమి, నేర్పుకూర్పువలననేమి, యూహాపోహల నేమి, పద్యముల యెత్తుగడలనేమి, యతిప్రాసప్రయోగ ములనేమి పుష్పగిరి తిమ్మన్నయే సమీరకుమార విజ

---

* తంజావూరు సరస్వతీమహలు లైబ్రరీయాంధ్రాముద్రితగ్రంథములపట్టిక, పుట ౧౯౩.

† శబ్దరత్నాకరము, పీఠిక, పుట ౧౬.

‡ ఆంధ్రకవులచరిత్రము, పుట ౪౫౯.

¶ ఆనందముద్రాక్షరశాలవారి యుత్తరరామాయణపీఠిక, పుట ౨.

యము వ్రాసినతరువాత వ్రాసినట్లుగాఁ దోఁపకపోదు." "రెండు గ్రంథములను సవిమర్శముగా సాంతము చూచినచో నొక్క ముఖమునుండి వెలువడిన వాక్కుగనే కన్పట్టకపోదు. అతిద్రాఘిష్ఠంబులగు సమాసములును, వచనంబులును, అచ్చతెనుఁగుమార్పులును, లోకోక్తులును, అర్థాంతరన్యాసముక్తపదగ్రస్తాదులును రెండింటను గలవు. మొత్తముపైని సమీరకుమారవిజయముకంటె నుత్తర రామాయణములో మెఱుఁగుపెట్టఁబడిన దని చెప్పకతప్పదు. పైని గనపఱిచిన యేకదేశసామ్యమునుబట్టియే కాదు, సాంగముగాఁ దిలకించినచోఁ దిమ్మకవియే సమీరకుమారవిజయమును రచియించిన తరువాతఁ గంకంటి పాపరాజుకు సాహాయ్యమొనరించు పేరిటనేమి, ఋణమీఁగుటకో అకేమి యుత్తరరామాయణమును రచించెనని చెప్పుట కనువుగ నున్న" దని చెప్పిరి. * ఇట్లు విమర్శకపండితులు ఉత్తరరామాయణకర్తృత్వమును గూర్చి రెండుతెగలై చీలుటచేత, నిశ్చయమును నిర్ణయించి చెప్పుట సులభసాధ్యము గాదు.

ఇఁక ద్విపదవిష్ణుమాయావిలాసనాటకముగూడ పుష్పగిరి తిమ్మనయే కంకంటి నారసింహరాజు పేరిట రచించెనేమో విచారించవలసియున్నది. ఈ సందర్భమునఁ జింతనీయములైన యంశములు మూఁడు గలవు: ౧. నారసింహరాజు దన యన్న మరణానంతరము గ్రంథరచనకుఁ గడంగుట. ౨. ఇతఁడు దన యన్న పాపరాజును బోలి 'చతుర్విధానవద్య కవిత్వ విద్యావధానాధునాతన భోజరాజ' 'విష్ణుమాయా విలాసాభిధాన యక్షగాన నిర్మాణ ప్రవీణ్యైతాదృశ బిరుదావళివల్ల స్వకవితానైపుణ్యమును దెల్పుకొనక, కేవలము 'సరసవిద్వత్కవిజనశరణ్యుండ' నని చెప్పుకొనుట. ౩. పుష్పగిరి తిమ్మన కృతిసహాయుఁ డగుట. ఈ విషయముల నన్నిటిని సమాలోచనముచేసి చూడ పుష్పగిరి తిమ్మనకు విష్ణుమాయావిలాసరచనయందుఁ గూడ కొంతయేని సంబంధము గలదని తోఁచుచున్నది.

భావిపరిశోధకుల పరిశ్రమవల్ల దీనియందలి నిజము వెలువడవలసియున్నది.

## ౪

## కవికాలము

నారసింహరాజు కంకంటి పాపరాజుతమ్ముఁ డనియుఁ, బుష్పగిరితిమ్మనార్యునికి సమకాలికుఁ డనియు పైన వ్రాసినదానివల్ల వ్యక్తపడుచున్నది. కాని వీ రేకాలమువా రైనదియుఁ దెలిసికొనుటకుఁ దగిన యాధారము లెవ్వియు వీరి గ్రంథములలోఁ గానరావు. కవిత్వశయ్యయు, శబ్దజాలమును జూడ వీరు ౧౭-వ శతాబ్దమువారు కావచ్చు ననునూహ పొడముచున్నది. వీరి కాలమును నిర్ణయించఁదగు నాధారములు లేకున్నను, ఆంధ్రకవులచరిత్రకారులు వీరు ౧౮-వ శతాబ్దాంతమున నుండిరని వ్రాసియున్నారు. "కంకంటిపాపరాజు ప్రళయకావేరిపట్టణములో నవీనుగా లౌక్యాధికారమునం దుండినవాఁడు. ఆకాలమునందే పుష్పగిరితిమ్మన్న కొంత ఋణముచేసి యాయప్పు తీర్పలేక యీపుస్తకము (ఉత్తరరామాయణము)ను దానిక్రిందఁ జేసి యియ్యఁగా ౧౭౯౦-వ సంవత్సరప్రాంతమున నుత్తరరామాయణమును పాపరాజు తనపేరితోఁ బ్రచురించెనని చెప్పుచున్నారు. కవి యిప్పటికి (ఆంధ్రకవులచరిత్ర తృతీయభాగ రచనాకాలమునాఁటికి) నూఱుసంవత్సరముల క్రిందట నుండినవాఁడు." "కంకంటివారి యుత్తరరామాయణమువలెనే (ధరణిదేవుల రామమంత్రికృత) దశావతారచరిత్రమును పుష్పగిరితిమ్మన్నచే రచియింపఁబడిన దని కొందఱు చెప్పుచున్నారు గాని కవులిద్దఱు నేకకాలములో నొక్క దేశములో నుండుటదక్క వారి మాట కాధారలేశమును గానరాదు" † ఇందువల్ల కంకంటి పాపరాజును, పుష్పగిరి తిమ్మనార్యుఁడును, ధరణిదేవుల రామమంత్రియు సమకాలికు లనియును, వీరందఱు క్రీ. శ. ౧౭౯౦-వ సంవత్సరప్రాంతము వారనియు నాంధ్రకవుల చరిత్రకారుల యభిప్రాయమని తెల్లమగుచున్నది. కాని ధరణిదేవుల రామమంత్రి కంకంటి పాపరాజునకును, బుష్పగిరి తిమ్మన్నకును సమకాలీనుఁ డని ఋజువుసేయఁగల సాక్ష్య మెందును

* వావిళ్లవారి సమీరకుమారవిజయ పీఠిక, పుటలు ౧౦, ౧౫.

† ఆంధ్రకవులచరిత్ర, పుట ౪౬౪.

గావరాదు. ఒకవేళ సమకాలీనుఁడని తాత్కాలికముగ నంగీకరించినను ధరణిదేవుల రామమంత్రి ౧౭-వ శతాబ్దాంతమువాఁడుగాఁడు. అతఁడు క్రీ. శ. ౧౬-వ శతాబ్దోత్తరార్ధమున నుండె ననుటకుఁ బ్రబలమైన సాక్ష్యమతని గ్రంథముననే కానవచ్చుచున్నది. దశావతార చరిత్రకృతిపతియగు మగదల కృష్ణామాత్యుని ముగ్గురు పెదతండ్రులలో జ్యేష్ఠుఁడగు తిమ్మన "వీర వేంకటపతి రాయవిభువతంస–భావితోభయచామరభద్రదంతి- దంత పల్యంకికాది సన్మానఘనుఁ"డని తెలియవచ్చుచున్నది.* ఈవీర వెంకటపతిరాయలు క్రీ.శ. ౧౬౩౦ మొదలు ౧౬౪౨ వఱకును వేలూరు నిజరాజధానిగ కర్ణాటక సామ్రాజ్యమును పాలించెను. ఇతఁడు తన పూర్వీకులగు విజయనగరచక్రవర్తులవలె నాంధ్రభాషాభిమానియై యాంధ్రకవులఁ బోషించెను. వెంకటపతిరాయదండకమున కితఁడే నాయకుఁడు. చంపూరామాయణ కృతికర్తయగు ఋగ్వేదివెంకటాచలపతికవియొక్క తండ్రియగు తిరువెంగళార్యకవిని 'గొలఁకులాయపుఁ దేజిబలు' రాతని సత్కరించెను.† పెరియన్న యను కవివర్యునిచే నొక యాంధ్రప్రబంధమును గృతినందెను. ఇట్టి భాషాపోషకునిచే మన్ననవడసిన మగదల తిమ్మన యతని సమకాలికుఁ డని చెప్పకతప్పదు. మఱియు నీతిమ్మనార్యుని కడగొట్టుతమ్ముఁడును, మగదలకృష్ణుని పినతండ్రియైన నారణపుత్రుఁడైన ఆదినారాయణుఁడు 'నవాబుసాహిబూ వితీర్ణ సువర్ణజాఁబూనదాంబ రాస మగ్రామ బహుమానభాసమాన నవ్యవిభుఁ'డఁట. ‡ ఇందుఁ బేర్కొనఁబడిన నవాబుసాహెబు సయ్యద్ మహమ్మదుమీర్ జుమ్లా. ఇతఁడు మొదట క్రీ. శ. ౧౬౩౭-వ సంవత్సరములో కర్ణాటకముపై నెత్తివచ్చి పులికాటు అనఁబడు ప్రళయకావేరిపట్టణమును ముట్టడించెను. కాని వెనుదిరిగి పోవలసివచ్చెను. క్రీ. శ. ౧౬౪౯ లో రెండవపర్యాయము దాడివెట్టి తూర్పు సముద్రతీరభూముల నాక్రమించుకొని ప్రళయకావేరి కధిపతులైన యొలందావారి నడిమి కప్పముగొనెను. కావున మగదల కృష్ణుఁడును, ధరణిదేవుల రామమంత్రియు క్రీ. శ. ౧౬౫౦-వ సంవత్సరప్రాంతమువారనుట నిశ్చయము.

ధరణిదేవుల రామమంత్రి క్రీ. శ. ౧౬-వ శతాబ్దమధ్యమున నుండెనని పైనుదాహరించిన యాధారముల మూలమున స్పష్టపడినది. కంకంటి పాపరాజును, పుష్పగిరి తిమ్మనార్యుఁడును రామమంత్రికి సమకాలమువారగుట నిశ్చయమేని వారును నప్పటివా రనియే చెప్పవలయును. పాపరాజుతమ్ముఁడును, గ్రంథరచన యందుఁబుష్పగిరితిమ్మనార్యునిసాయమునందినకంకంటి నారసింహరాజును వీరివలెనే క్రీ. శ. ౧౬-వ శతాబ్దమధ్యమున వర్ధిల్లె ననుటకు సంశయింపఁ బనిలేదుకదా.

## విష్ణుమాయావిలాసముల యన్యోన్యసంబంధము

ఈ వ్యాసారంభమునఁ బేర్కొనఁబడిన విష్ణుమాయావిలాసముల కన్యోన్య సంబంధ మెద్దియేని కలదేమో విచారించవలసియున్నది. వీని కన్నిటికిని నామ మొక్కటియే సామాన్యమా, లేక ఇతివృత్తము నందుఁగూడ సంబంధము గలదా యను విషయములు విమర్శనీయములు. కాని ఈ కార్యమును సాగించుట కిప్పుడు సామగ్రి చాలదు. పైనాలుగు విష్ణుమాయావిలాసములలోను మూఁడు ముద్రితములైనను రోసనూరి వెంకటపతికృతగ్రంథ మిప్పు డెచ్చటను లభ్యముగాక యున్నది. పాపరాజవిరచిత యక్షగాన మింకను నముద్రితము. కాని విష్ణుమాయావిలాసముల కన్నిటికిని నామసామాన్యతయే కాక ఇతివృత్త సాదృశ్యమును గల దనుటకుఁ గొంత యవకాశ మున్నది. రోసనూరి వెంకటపతికృతవిష్ణుమాయావిలాసమునుండి వీరేశలింగం పంతులగారి యాంధ్రకవుల చరిత్రలో నీక్రిందిపద్య ముదాహరింపఁబడి యున్నది: §

* వావిళ్లవారి దశావతార చరిత్ర, ౧- ౩౫

† ఆంధ్రవాఙ్మయపరిషత్తువారి చంపూరామాయణము

‡ వావిళ్లవారి దశావతారచరిత్ర, ౧-౫౭

§ ఆంధ్రకవులచరిత్రము, పుట ౩౬౫

"ఇటువలెనేమి యాపయన
మిప్పుడు మీ రఖిలేశ మాయలన్
బటువగు విష్ణుఁ డంచనెడు
పల్కులు సిద్ధము సుందరీక్రియా
కుటిలశిరోజిరైన హరి
గొబ్బునఁ జూచితిరేని మీకు నొ
క్కటఁ జపలత్వమైనతతి
గౌరవ మెట్లగునో తలంపుఁడీ."

ఇది శివగర్వభంగకథయందలిది. దీనిని యెల్ల నార్యుని విష్ణుమాయావిలాసనాటకములోని ఈ క్రింది పద్యములతోఁ బోల్చి చూడుఁడు:

"దేవరవు మిక్కిలియు గాం
తావివశాత్ముఁడవు మనసుధైర్యము చలనం
బై వచ్చెనేని మఱతువు
భావింపఁగ సర్వభూప్రపంచము నెల్లన్.

"జగములు మూఁడు నాతని వ
శంబున నున్నవి మాయఁజిక్కి యీ
జగతి ప్రధానదైత్యసుర
సంయములుం గమలాసనుండు నా
దిగఁ గలవారలెల్ల విక్ర
తిం బడుచుండ్రు తదీయలీలనే
మగనోసుమీ మహాత్మ జల
జాక్షునిచేత భవత్ప్రతాపమున్" (౮: ౨౫-౬)

ఈయంశమును గంకంటి నారసింహరా జిట్లు వర్ణించియున్నాఁడు:

"మరుఁడును బగవాఁడు మటుమాయలాఁడు
హరి మీర లాతని యాఁడురూపంబు
చవ్వ సేయకఁ గన్న జగములలోన
నవ్వగుదవ్వగు నాడెమా పెంపు
జగములన్నియుఁ దద్వశమున వర్తిలెడు
జగతిప్రధానులౌ సంయముల్సురులు *

* తార్క్షాణకై యొక్క అపపాఠము నిచటఁ జూపుచున్నాను. సముద్రమథనమువల్లఁ బుట్టిన విశేష ములు వర్ణించుసందర్భమున—

కమలాసనాదు లా ఘనుని మాయలను
భ్రమగొనియున్నారు ప్రాజ్ఞతులుడిగి."

దీనిఁ జూడఁగా రోసనూరి వెంకటపతి యల్ల నార్యుఁడు చెప్పిన కథలనే తన గ్రంథమునందు వర్ణించెనేమో యను శంక గలుగుచున్నది.

విష్ణుమాయావిలాసయక్షగానమునందలి యతి వృత్తమేమో తెలియదు. ఎల్లనార్యునిబోలి పాపరాజును తన గ్రంథమును మదనగోపాలున కంకిత మొసంగియుండుటచేత నితఁ డెల్లనార్యుని గ్రంథమునే యక్షగానముగ మార్చియుండవచ్చును. కాని పాపరాజవిరచిత యక్షగానప్రబంధము వెలువడువఱకును వాస్తవస్థితి యిట్టిదని నిశ్చయించి చెప్పుటకు వీలులేదు.

ఇది యెట్లున్నను నారసింహకవికృత ద్విపద ప్రబంధమునెడ నిట్టి సంశయమున కవకాశము లేదు. ఇది యెల్లనార్యుని గ్రంథమునకుఁ బ్రతిచ్ఛాయ. ద్విపద విష్ణుమాయావిలాసము పూర్వోత్తరము లను ద్విభాగములుగ విభజింపఁబడియున్నను పద్యకావ్యమువలె నిడియు నైదాశ్వాసముల గ్రంథమే. పద్యకావ్యము నందువలె నిందును కథాప్రణాళిక శుకయోగివాగ్ఝరి నుండియే వెలువడుచున్నది. రెంటను ఉపకథకుఁడు గోవిందశర్మయే; కథానుక్రమణికయు నొక్కటియే; కథలును అవియే. పద్యద్విపద విష్ణుమాయావిలాసనాటకముల యన్యోన్యసాదృశ్య మింతటితో ముగియలేదు. నారసింహకవి సాధ్యమైనంతవఱకు యెల్లనార్యుని మాటలను, వర్ణనలను, లోకోక్తులను దన ద్విపదలయం దిమిడ్చెను. పద్యవిష్ణుమాయావిలాసనాటక పరిష్కర్తలీద్విపదకావ్యమును జదివి ముద్రితగ్రంథములో పొరలియుండు నపపాఠములను సులభముగ దిద్దుకొనియుండ వచ్చును.* పద్యద్విపదకావ్యముల యన్యోన్య సన్నిహిత సంబంధమును దెల్పుటకై రెండుమూఁడు ఉదాహరణముల నిచ్చి ఈవ్యాసమును జాలించెదను.

లక్ష్మీగర్వభంగకథలోని కొలనివర్ణన — పద్యకావ్యము:

"కనుఁగొనియె నగ్రవీథిన్
వనజాలయ యొక్క దివ్యవనజాకరమున్

దనువు సెడి వాడబారిన
వనరుహకల్హారకైరవంబులతోడఁ,

నిండారఁ జిగిరించి నిగనిగల్ చాలక
వాడిన నవపల్లవములతోడఁ
గలయంగఁ బూచి తేనెలు చిందు నెత్తావిఁ
బోరయకఁగందిన విరులతోడఁ
బరిపాకమునఁ బండి సరసమాధురి లేక
పద నింకిపోయిన పండ్లతోడఁ
* మలయుటలాఁగని కొమ్మలవిన్ననై యున్న
యళిపోతశుకపికావళులతోడఁ
చిన్నవోయిన వనము వీక్షించి లక్ష్మి
యనుఁగుఁజెలులకుఁ జూపుచు నరిదిపడుచు
నెన్నఁడును జూడ మిటువంటి హేమవనము
శూన్యమైయున్న దిది యేమిచోద్య మొక్కొ"
(౨-౨౩,౨౮)

ద్విపదకావ్యము (పుట ౩౮):
"వనజాకరముఁ జూచె వాడుకల్హార
వనరుహకైరవావళిగలదాని
నిండారఁ జిగిరించి నిగనిగల్గనక
దండిమానినవాడుతలిరులతోడఁ
గలయఁబూచి మరందగంధము ల్లేక
తెలివిగ్గి కొనకఁ గందినపూలతోడఁ
బరిపాకమునఁ బండి పద నింకి తీపు
నెఱయక ప్రుక్కియుండెడిపండ్లతోడఁ
మలయుటలాఁగని కొమ్మల విన్ననైన
యలికులశుకకోకిలాదులతోడఁ
జిన్నవోయినవనిఁ జెంత నీక్షించి
యన్నవబోఁడి లో నాశ్చర్యమంది
వనబోఁడులార యెన్నఁడు నిట్టి హేమ
వనము గన్గొన మింతవన్నెఁ జెందియును
నేల వాడినదొకొ యీతోఁట యనుచు
నాళీజనాళితో ననుచు నద్దివ్య
కమనీయవనమెల్లఁ గలయ దర్శించి
........................."

బ్రహ్మగర్వభంగకథయందలి మాయాసరస్వతి వికారవర్ణన : పద్యకావ్యము.

"వెండియుఁదనకుందానే సంకల్పదశావిశేషంబున—
కన్నీరునించు తొంగలిరెప్ప లల్లాడ
నొకమాటు ప్రియుఁడు రాకునికిఁజేసి
కంపించు నొకమాఱు కౌఁదీఁగె చెమరింప
భర్త కౌఁగిటఁ జేర్పఁ బట్టె ననుచు
నవ్వులు దేలు నానన మొప్ప నొకమాఱు
పతితోడ భావించు భావరతికిఁ
బులకించు నొకమాఱు వలపుచన్నుల క్రేవ
లదర వల్లభుకేల నాత్మ గోరి
యంగజుఁడు పెల్లగొల్పంగ నంగకముల
నెల్లకళజాఱి† ధైర్యంబు పల్లటిల్లి
బ్రహ్మదేవునిపైఁ ప్రేమఁ బాఱవిడిచి
వీణియను మీటి పాడుచు విభ్రమొప్పె"
(౩: ౨౯౯-౯)

---

'కల్పపాదప పింఛకము నప్సరస్త్రీలు
కామధేనువును జింతామణియును'

అను సీసపాదము గలదు. 'పింఛక' శబ్దము కలదేమో విచారణీయము. కలిగినను సందర్భోచితము గాదు. ద్విపదయం దిట్లున్నది :

"మఱియు దేవాసురుల్ మసల కయ్యుదధిఁ
దరవఁగాఁ గల్పకతరుపంచకంబు"

'పింఛకము' అపపాఠము. 'పంచకమే' సరియైన పాఠము. 'పంచైతే దేవతరవః' అని నామలింగాను శాసనము.

* ముద్రితప్రతి 'మెలకువల్ మాని' అని. దీనికి ప్రాఁతప్రతులలోని పాఠాంతరము 'మలయు ... కొమ్మల విన్ననై యున్న' అని యథోజ్ఞాపికయందుఁ దెల్పఁబడియున్నది. ద్విపదవిష్ణుమాయానాటకమున 'మలయుట లాఁగని' అని యున్నది. 'మలయుటలాఁగని' అనఁగా, 'సంచార ముడిగి' యని యర్థము.

† 'కళలూర' అను ద్విపదకావ్య పాఠమే యుత్తమ మని తలఁచెదను.

ద్విపదకావ్యము (పుట ౮౦):

"వెండియు నొకకొన్ని వెడమాయలూని
నిండువేడుకల నన్నీరేజగంధి
కన్నీరు నించు తొంగలిఱెప్ప లార్చు
మన్నించు పతి రాక మసలె నేఁ డనుచుఁ
గంపించు నొకమాటు కాఁదీఁగె చెమ్మ
రింపఁ గౌఁగిటను జేరిచె నాథుఁ డనుచుఁ
నవ్వులఁ దేల్చు నానన మొక్కమాటు
మవ్వంపుముచ్చట ల్మగఁ డాడె ననుచుఁ
పులకించు నొకమాటు భూరిమోహమునఁ
జెలువుని చెలువంబుఁ జింతించుకొనుచుఁ
గళలూర ధైర్యవైఖరి కడతేరఁ
గలఁగు నొక్కొకమాటు కాయజుం డెంచ
నీరీతి వీణ వాయించుచు బ్రహ్మఁ
బేరేచుకొఱకు నబ్బిత్తరియున్న."

నారసింహరా జిట్లు పద్యవిష్ణుమాయావిలాస నాటకమును మేలుబంతిగఁ గొన్నను దత్కర్తయగు నల్లనార్య నెచ్చటను బేర్కొనకపోవుట చిత్రము.

---

# కు సు మ దా మ ము

●

= శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి =

౧

రాలినపూలు కొన్ని పొదలన్ వికసించిన పూలు కొన్ని వా
తూలహతిం జలించి భువిఁదూలక కొమ్మలఁ జిక్కికొన్న యా
పూ లొక కొన్ని యేరి శ్రమఁబొందితి మాలికఁ గూర్చి తెచ్చితిన్
ఏల నిరాకరించెదవొ యీశ్వర నాహృదయంబు శోషిలన్.

౨

అతులిత కాంక్ష నేను కుసుమాపచయం బొనరించు వేళ సై
చితి నురుగ్రీష్మతాపమును స్వేదమయంబుగ దేహమెల్ల, నా
కత లెఱిఁగింపఁ బూనుటకు కాలములేదు, త్వదీయరాగలా
లిత మధురావలోకనము లెత్తి నన్ క్షమియింపఁగాఁదగున్.

3

సురభిళముల్ ప్రసూనములు శోభలు మాయవు స్వామి, నీ నిరా
దరణపుఁజేతలన్ కుసుమదామము నవ్వలఁ బారఁద్రోయ ని
ర్భరపరివేదనాప్రచురబాష్పము లొల్కఁగ, నెన్నఁడైన నా
మొఱకుదనంపుకాంక్ష ఫలమొందక పోదని దాఁచియుంచితిన్.

౪

దేవా! నీయెద శూన్యమయ్యె నను సందేహంబు బాధింప, నా
భావం బెల్ల నిరాశతోఁ గలఁగి పోవన్ భారమైతోఁచు నా
జీవంబంచుఁ దలంచితిన్ జడత, నీ సిద్ధాంతమేమో, మనీ
యావాసంబున దొంగిలించెదవో పాయంజాల కీమాలికన్.

౫

కాలవిలంబనంబునకు గాసిలలేమి నితాంతరక్తి నీ
యాలయ సీమ చెంగట విహారముసేతు, క్రుధావలోకన
భ్రూలతికావికారముల పొల్చిన నాపయి పైఁచికొందు, పూ
మాలిక వాడిపోవ నిఁక మంజులతల్ కృశియింపవే ప్రభూ!

౬

మ్లానతజెందినన్, కుసుమమాలిక కాంతులు దప్పిపోయినన్
మానఁగలేవు, నీహృదయమర్మము నే నెఱుఁగంగలేనె, స్వా
మీ, నిముసంబులోన విరమించెదు క్రమ్మఱ నవ్యరీతి ని
ర్మాణము సేయుచుందు వనురాగ రసోదయ లాంఛనంబుగన్.

౭

సుమదామంబును గూర్చువేళ నునుమోసుల్ వోయె నాకోర్కు లు
ద్యమమెల్లన్ ఫలియించునంచు, కయిసేఁతల్ గొన్న నీ కంధరం
బు మహానందముఁ గూర్చునంచు మదిలోఁ బొంగారితింగాని దై
వమ, యూహింపఁగరాని దుర్వ్యథల నవ్యాజంబుగాఁ గూర్చితే?

౮

కరములఁ దాల్చి యీ కుసుమకల్పితహారము నేఁ దపింతు, నా
దరణము నీకుఁ గల్గునని తత్పరభావము మౌనముద్రయున్
పరమసుఖానుభూతి గొలుపన్ కడద్రోయుదుఁ గాలమింక నే
తరుణము నిర్ణయించితివో తావకసేవకు నన్నుఁ బిల్వఁగన్!

---

# వి వా హ మం గ ళం

[ క థా ని క ]



= శ్రీ హనుమచ్ఛాస్త్రి =

రాత్రి. సుమారు తొమ్మిది దవుతుంది.

గృహలక్ష్మి వంటిల్లు సర్దుకుంటోంది. గిన్నెలు, చెంబులు చప్పుడుతోపాటు వర విక్రయం, వందేమాతరం పాటముక్కలు పగిలిన గ్రామొఫోన్ ప్లేటుముక్కలసంగీతంలా వినబడుతున్నాయి.

వేసంకాలం. ఆకు అల్లాడ్డంలేదు. కుర్చీ, టేబిలూ, కాగితాలూ పెట్టుకుని వీథిలో కూచున్నాను ఏదో రాద్దామని.

"ఇదిగో—ఇందాకా మీతో చెప్పడం మరిచిపోయాను. సాయంత్రం మీకోసం మా మామయ్య ఒచ్చాడు. అతని కొడుకు ప్రకాశానికి పేటలో రేపు బుధవారం పెళ్లిట. తప్పకుండా రావాలని మరీమరీ చెప్పి వెళ్లాడు."

చట్టున తలెత్తి చూశాను.

నుదుటిమీద చెమటలో తడిసి అంటుకున్న తలవెంట్రుకలను సవరించి, కట్టుకున్న పాతగళ్లచీరపైటతో చేతులు తుడుచుకుంటూ మా ఆవిడ సాక్షాత్కరించింది.

"అట్లానా—చాలా బాగుంది. ఇన్నాళ్లూ నీపెట్టెచెరలో దుఃఖించే వెండిచెంబులికీ, సిల్కుచీరలకీ మాంచి విడుదల. పోనీపాపం—ఈ విధంగానైనా రెండుమూడురోజులు వెలుగు చూస్తాయి."

"మీరుందురూ— నిత్యమల్లెపువ్వులా నిగనిగలాడుతూ—మీ ఆక్షేపణల కేంగాని ప్రయాణంమాట ఏమిటీ?

పిల్లలికి మరోనాలుగు చొక్కాలూ—నాకో రెండుచీరలూ, ఒక సబ్బుబిళ్లపెట్టీ, చిన్నపిల్లాడికి ఒక బూడ్సులజతా......"

జాబితా అట్లా పెరిగిపోతోంది. నేనందుకున్నాను: "నా కమీజులకు మరో కఫ్సులజతా, ఒక షేవింగుసెట్టూ, రెండు సిగరెట్ టిన్నులూ, ఒక అమాందస్తా......"

ఇద్దరం నవ్వేశాం.

"అమాందస్తా ఎందుకూ" నవ్వుతూనే కోపంగా అంది.

"పెళ్లివారికి పనికొస్తుంది" ధీమాగా అన్నాను.

"మీ రంతకన్నా ఎక్కువ బహుమతు లిస్తా రనుకోలేదు"

"పాత్రదానం"

గిరుక్కున తిరిగి వెళిపోతోంది ఇంటోకి.

రసశాస్త్రప్రకారం అది సరసమో, విరసమో చెప్పజాలనుగాని, ఆవిడతో అట్లా పేచీపెట్టుకోవడం, పుల్లవిరుపుమాట లనడం నాకో 'రిలీఫ్'.

నెమ్మదిగా లాలించి వెనక్కి పిలిచాను.

"నవ్వూటాల కన్నదీ నిజంగా అన్నదీ గ్రహించక, అట్లా చిందులుతొక్కుతా వేం? ఇలా రా... తప్పకుండా వెడదాం. మంగళవారం మధ్యాహ్నంరైలుకు. రేపు బజారుకు వెళ్లే టప్పుడు ఏమేం కావాలో చెప్పు... అయితే పెళ్లిఎన్నాళ్లు?"

పాపం! అల్పసంతోషి! ప్రియంగా ఒక్కమాట ఆడితే చాలు, సీదా చల్లపడి పోతుంది!

"అయిదురోజులూ చేస్తారుట. అవతలి వారు చాలా భారీమనుషులు. ముద్దుముచ్చట్లు బాగా తీరుస్తారు." చాప దగ్గిరగా లాక్కుని తృప్తిగా కూచుంది.

పాపం! ఈ ఆడవాళ్లకి పెళ్లికి వెళ్లడమంటేః ఎంత సరదా! ఈ మురికిగుడ్డల్లోంచి-అంటతప్పాలాల్లోంచి, విసుగెత్తే రోజువారీ బతుకులోంచి కొత్తలోకంలోకి వెళ్లినట్టుంటుందిగావును—హిస్టీరియావాళ్లు, కడుపునొప్పివాళ్లు, ఎప్పుడూ ధుమధుమలాడేవాళ్లు ఇట్టే మారిపోతారు పెళ్లిళ్లలో.

శుభ్రమైన బట్టలు, సెంట్లు—కలకలలాడుతూ ఉత్సాహంతో గంతులేస్తూ కనపడతారు. ఔను పాపం! వాళ్లకి క్లబ్బులా, సభలా, స్నేహితులా, షికార్లా?—దరిద్రగొట్టు వంటిల్లు, రోగిష్టి పిల్లలు, కసురుకొనే మొగుడు—ఎంత నరకం అనుభవిస్తున్నారు—తెనుగుకుటుంబాల ఆడవాళ్లు!

పెళ్లికి వెళ్లడమంటే నిజంగా నాకూ ప్రాణం లేచివచ్చింది. ఈ మధ్య సజీవమైన-రసవంతమైన పెళ్లే చూడలేదు. తిరపతి మొక్కుబడికి వెళ్లినట్టు యానాం వెళ్లి, తిండికి మొహంవాచి యెకాయెకీ బళ్లల్లో నలిగి చచ్చి—ఛా—ఏం పెళ్లిళ్లు! నిజంగా తెనుగుకుటుంబాల పెళ్లిమాధుర్యమే చచ్చింది ఈకక్కుర్తి కల్యాణాల్లో.

చిన్నప్పుడు చూసిన పెళ్ళిళ్లు తలచుకుంటే ఒళ్లు పులకరిస్తుంది.

పెళ్లిపందిట్లో అడుగు పెట్టేసరికి చల్లని కొత్త తాటాకు వాసన— ఇంట్లో అడుగు పెడితే వడివడిగా తిరిగే శృంగారవతుల జడల్లోని మరువం వాసన— నట్టింట్లో తివాసీల మీద పిల్లలు ఒలకబోసిన పన్నీటి మంచి గంధం వాసన—పెరట్లో గాడిపొయ్యిదగ్గర కొత్తచాపలమీద రాసులుగా గుమ్మరించిన ఉడికిన కూరలవాసన— కళాయిలో పడుచు హృదయంలోని ప్రేమలా తెగమరిగే తియ్యని సంతర్పణ పులుసు వాసన — మొత్తంమీద పెళ్లే ఎంత సువాసన!

పందిట్లో శుభప్రదమైన ఆ సన్నని సన్నాయి పాట—కొత్తచీరల కసకసలతో, మెడ గంధ పూతలతో — కొత్తగా కాపరానికి వెళ్లివచ్చిన మరదళ్ల, మేనగోడళ్ల హాస్యాలు—ఏవీ ఇప్పుడు? అంతా పూర్వవాసన అయిపోయింది. చట్టున వేదుల కవి పద్యం జ్ఞాపకం ఒచ్చింది.

" అలరునకుభోలె నా హృదయమ్మునకును
జన్మమున కొక్కటే వికాసమ్ము చెలియ!"

వెనువెంటనే నా పెళ్లిసంగతులు కళ్లల్లో స్ఫురణగా తిరిగాయి.

* * * *

మార్చినెల బి. ఏ. పరీక్షలు అవుతున్నాయి. మధ్యాహ్నం పేపరు రాసి, హాస్టలుకు చేరి, కోటు తీసి, కాస్త విశ్రాంతి కోసం పడకకుర్చీలో వాలుతూ ఉండగా

కిటికీలో పడివున్న ఉత్తరం కనబడింది. పరీక్షలు అయిపోవడంతోటే— మ రెక్కడికీ షికార్లు కొట్టకుండా సరాసరి ఇంటికి రమ్మని గాబోలు... మా నాన్న దస్తూరీ— పాపం— ఆయనచూపుల్లాగే ఈ అక్షరాలుగూడా నావైపు ఉరుముతూ చూస్తాయి.

ఉత్తరం తీశాను. ఎందుకో... వేళ్లు ఒణుకుతున్నాయి. చదివాను. మళ్లా చదివాను. ఎన్నిసార్లు చదివినా విషయం ఒకటే-మారడంలేదు. ఉత్తరం మడిచి చేత్తో పట్టుకుని కిటికీలోనుంచి శూన్యంగా బయటికి చూస్తున్నాను. 'అనుకున్నంతా అయింది'. మెదడు వేడెక్కి ఆందోళన పడుతోంది.

'ఈకిటికీఊచలు పళపళ విరిచి బైటికి పారిపోనా' — నవ్వొచ్చింది. ఎక్కడికి? ఎంతదూరం పోతేమాత్రం మెడమీద ఉన్న ఈ వృద్ధహస్తంపట్టు ఒదులుతుంది?

నన్ను పోషించినందుకు, ఇంతచదువు చెప్పించి ఉద్ధరించినందుకు, నామీద రెండువేలు ఆయనకు ప్రతిఫలం రావాలి. ఆ అమ్మాయి ఎవరో నే నెరగను, నే నెవరో ఆమే ఎరగదు. బ్రతికిఉన్నంతకాలం ఒకరి సంపూర్ణ బాధ్యత ఒకరు వహించే వివాహం మా ఇద్దరిమధ్య—ఆహా! ఏమి సన్నివేశం! మమ్మల్ని ఇద్దరినీ కలిపేవి రెండువేలు! ఈ చదువూ, అభిరుచులూ, విచక్షణా, ఎంతఘర్షణ తెస్తున్నాయి— లేకపోతే ఎంత బాగుండును.

కిటికీలోంచి పొడుగ్గా సాగిపోయే రోడ్డు కనబడుతోంది. అప్పుడే కాలేజీగేటు దాటి సావిత్రి, రుక్మిణి రోడ్డుమీద నడుస్తున్నారు. సావిత్రి ఆకుపచ్చ సిల్కురిబ్బనుజడ, రుక్మిణి సిమెంటురంగు చీరా దూరంగా సాగిపోతున్నాయి.

పరుగెత్తుకొని వెళ్లి నామనస్సులోని బాధంతా రుక్మిణితో చెపితే—ఎంత ఉదార హృదయం—ఒక్క చూపుతో, ఒక్క చిరునవ్వుతో ఎంత ఓదార్పు ఇస్తుంది!

తన పుట్టినరోజని ఒకనాడు 'టీ'కి పిలిచి ఎంతగా ఆదరించింది— ఆనాలుగునిమిషాలూ తనచోటిని స్వర్గం చేసుకుంది అప్సరసలా.

"కాఫీలో మీకు పంచదార ఉండగూడదుగదూ" ఎంత గొప్పగా నవ్వింది! దోసెడు పచ్చకర్పూరం, కుంకుంపువ్వూ కలిపి చల్లినట్లు!

"వద్దు—ఎంత'బిట్టర్'గా వుంటే అంత బాగుంటుంది నాకు"

"ఓహో—శర్మగారు గొప్ప వేదాంతి అవుతారు" మళ్లా నవ్వు. రాజహంస రెక్కలు కొట్టుకుంటూ పైకి లేచినట్టు. తాంబూలాలు - ఛలోక్తులు - పాటలు-నవ్వులు — అంతా కల.

అట్టి ఉత్తమస్త్రీస్నేహితులుకూడా ఉండగూడదు నాదరిద్రదేశంలో.

* * * *

హోల్డాలు, సూట్ కేసు పట్టుకున్న కూలీతో మాయింటి మెట్లెక్కాను. అమ్మా, చెల్లెలూ, తమ్ముడూ నవ్వుమొహాలతో ఎదురువచ్చారు. కొత్తముగ్గులు, తోరణాలు, పందిళ్లు తయారయిపోతున్నాయి.

"నాయనా, ఒచ్చావూ, మరి బెంగలేదు. నిన్నటినుంచి ఒకటే పాట మీనాన్న- సమయానికి ఒస్తావో రావో అని. రేపే పెళ్లి కొడుకును చెయ్యడం. ముహూర్తాని కేమీ

వ్యవధి లేదు. మీనాన్న ఒడుదుడుకుముహూర్తా లెరగవూ నువ్వు? బాజాభజంత్రీలూ, ముత్యాలపాలకీ ఈ ఉదయమే కుదిర్చారు. పాపం - జగన్నాథంమామయ్య సతమతమై పోతున్నాడు. అసలు అతడు తెచ్చాడు ఈ సంబంధం......"

"రక్షించాడు" మా అమ్మధోరణి ఆపడాని కంతకన్న మార్గం కనపడలేదు నాకు. తలవనితలంపుగా వచ్చిన ఈజవాబుకు ఆమె ముఖంలోని ఉత్సాహమంతా ఇంకి తెల్లబోయింది. ఎప్పుడూ నే నంత తుంచినట్టు ఆవిడతో మాటాడలేదు.

లోపలికి వెళ్లాను.

పనిచెయ్యడానికి సుళువుగా బిగగట్టిన పట్టుంచుశాలంపంచ, బుజంమీాద తడిఅంగా వస్త్రం, వేసంకాలంచెమటకు కరిగి ప్రవహించే గంధాక్షతలు,—నాన్నగారు వాకిట్లోని పెద్ద పందిరవగ్గర ఉండి తోరణాలు కట్టిస్తున్నారు.

"శేష్—వచ్చావూ—నీకోసమే చూస్తున్నాం. ఒరేబాబూ, ఏమేనా అంటే మీకు కోపాలుగాని—వస్తూన్నట్టు కాస్త ఉత్తరం ముక్క గాలికి పారేస్తేనేం?...తగని బద్ధకాలూ మీారూనూ!"

"మీామాటకు వ్యతిరేకంకూడానా? ఫలానానాటికి రమ్మంటే రావలసిందే—పొమ్మంటే పోవలసిందే..."

"నామాటమీాద నీ కంత గౌరవం ఉండడం వాస్తవమే—గాని నీధోరణిమాత్రం నాకవగాహనకా లేదు"

"కావడాని కేముంది? ఇంత తలవని తలంపుగా నాకు పెండ్లిచేసి సుఖపడమంటున్నారని సంతోషిస్తున్నాను."

"అదా అపరాధం? మరేంఫర్వాలేదులే. ఒకర్ని ఒకరు చూసుకుని, చిరునవ్వులు నవ్వుకుని, ఉత్తరాలు రాసుకుని... స్వయంవరాలు జరగలేదనేనా నీవిచారం? మన బ్రాహ్మణకొంపల్లో ఏనాడైనా జరిగాయా ఇలాంటి అనాచారాలు? మా పెద్ద ముండాకొడుకుల బొందెల్లో ప్రాణం ఉన్నంతకాలం అలాంటి అకార్యకరణాలికి సుతలామూ వీలుపడదు."

మెడమీాది అంగావస్త్రం నేలను కొట్టి విసురుగా పక్క—అరుగుమీాద కూచున్నారు నాన్నగారు.

సాహసించాను. "వేలకివేలు ఎదటివారిదగ్గర కట్నాలు పిండడం...పిల్లల ఇష్టానిష్టాలతో పనిలేకుండా...ముళ్లుపెట్టడం..."

"సనాతనాచారమా అనిగదూ నీ అభిప్రాయం? నానామాలకూళ్లూ తిని, కిరస్తానీ చదువులుచదివిన మీాతోటా మాకు సనాతనమతచర్చ? మీామేలు కోరి మేం ఏం చేస్తే అదీ ఆచారం. మరి నాతో వాదించకు"

లేచి ముఖం అటువైపుతిప్పి,ఒకరాటకు పచ్చికొబ్బరాకును కోపంగా చుట్టబెడుతున్నారు.

నిమిషం నిశ్శబ్దం.

"నాన్నగారూ!"

"ఏంబాబూ?"

"ఫైనల్‌గా ఒక్క—మాట చెబుతున్నాను. నాకు ఆపిల్ల... నచ్చకపోతేమాత్రం... ఏమైనా చేసుకోను."

"ముహూర్తనిశ్చయ మయిపోయింది. పెద్దమనుషులతో వ్యవహారం. మాట తిరిగితే

"చెప్పొచ్చారు కూడతారు. నోరెత్తితే మాట దక్కదు. ఆవిడగారు నచ్చకపోతే. నచ్చిన అచ్చర ఎక్కడేనా దొరికితే... లేవదీసుకు పో— ఆ బ్రహ్మసమాజంవూర్లో ప్రవేశించ గానే అనుకున్నాలే."

"పెద్దల ... ఆశీర్వచనం"

"త ... థా ... స్తు"

తల గిర్రున తిరిగింది. గదిలోకి వెళ్లి పడుకున్నాను.

* * *

ఎప్పటిమాట! సుమారు పదేళ్లవుతుంది.

తొట్టిలో పిల్లాడు కదిలి ఏడవడంతో నాభావనాచక్రం ఆగింది. చాపమీద కునికిపాట్లు పడుతూన్న మాఆవిడ ఉలికిపడి లేచి చంటిపిల్లాడి దగ్గరికి వెడుతూ "ఏమి టలాగే కూచున్నారు? దీపం కాగడాలా వెలుగుతోంది. కాగితాలు ఎగిరిపోతున్నాయి— ఇదేనా రాత? లేవండి, రేపు రాసుకుందురు గాని..." అని నవ్వి వెళిపోయింది.

* * *

ఉదయం కళ్లు నులుముకుంటూ నేను పక్కమీదనుంచి లేచేసరికి, మాఆవిడ చేసే కంజాయింపు బహు కట్టుదిట్టంగా వినబడుతోంది. పిల్లలికి ఒంటిమీద నీళ్లు పోసి, తలలు దువ్వి, చొక్కాలు తొడిగి, పువ్వుల్లా తయారుచేసింది. తుడిచిన గదులూ, మడిచిన బట్టలూ నిన్నటికన్న అతిపొందికగా కనబడుతున్నాయి. కాకులు కుయ్యకుండానే తియ్యని పొగలు కక్కే కాఫీ సిద్ధమయి పోయింది. ఇక — శుద్ధాంతంలో అడుగు పెట్టేసరికి—శుభ్రమైన ఉప్పాడచీర, ఊదా సిల్కుజాకెట్, తలనిండా పువ్వులు, ఉదయ సూర్యుడంత కుంకుంబొట్టుతో మా ఆవిడ కాఫీగ్లాసు పట్టుకొని ఎదురువస్తోంది. అప్పుడు స్ఫురించింది: ఓహో — ఈవేళ మంగళవారం, పేట పెళ్లికి వెళ్లాలి. మధ్యాహ్నం మూడుగంటల రైలుప్రయాణానికి ఉదయం ౬ గంటలనుంచి సన్నాహం. బహుదూర దృష్టిమనిషి మా ఆవిడ.

ఆఫీసుకు వెళ్లి అధికారి వేసిన యక్ష ప్రశ్నలకు జవాబులు చెప్పుకుని హిందూదేశానికి స్వరాజ్యం తెచ్చినట్టుగా నాలుగు రోజులు సెలవు సంపాదించాను. మామీద పగకొద్దీ రైలు ముందే వచ్చి రహస్యంగా వెళిపోతుందేమో అని పదింటికే భోజనాలు చేసేశాం. ఎంతకీ మూడు కావడంలేదు. మా ఆవిణ్ణీ, పిల్లల్నీ పట్ట శక్యంగాకుండా ఉంది. వాళ్లను 'ఎంగేజ్' చేసే మార్గం కనపడ్డం లేదు. పరుపుకట్టడం ఏడిసినట్టుందనీ, ట్రంకుపెట్టెలోంచి బట్టలు తొంగిచూస్తున్నాయనీ, సూట్ కేస్ తాళం కనపడ్డంలేదనీ 3 గంటలదాకా నోటితో పనిచేసి, ఎట్టకేలకు ఒక వేణ్ణీళ్ల థెర్మోఫ్లాస్కు, చన్నీళ్ల మరచెంబూ, రెండు పెట్టెలూ, నాలుగు పరుపుచుట్టలూ వగైరాతో శృంగేరిశంకరాచార్యపీఠంలా బయలుదేరి సకాలానికి రైల్లో పడి సాయంత్రం అయిదుగంటలకు పేట చేరుకున్నాం.

* * *

మొగపెళ్లివారు ఉదయమే సదరు గ్రామం దయచేసి స్నాతకం వగైరా చేసుకుని విశాలమైన విడిదిమేడలో 'కాంపు' ఖణాయించారు. పదిహేను, ఇరవై మధ్య వయస్సు గల కుర్రజాతి పేకటపాటపా కలిపి పంచుగుంటూ గోల చేస్తోంది ఒక అరుగు

మీద చేరి. కొందరు వృద్ధులు— భోజనాలు పొద్దు పోయాయి గావును—మేడకింది హాల్లో ఇంకా దొర్లుతూనే ఉన్నారు. మేం గుమ్మంలో అడుగు పెట్టేసరికి "అదుగో— శర్మా, సత్యవతీ, పిల్లలూ వచ్చా" రని పెళ్లి పెద్దలు ఆడవారూ, మగవారూకూడా మాకు స్వాగతం పలికి "మీకు బస మేడమీద ఏర్పాటు చేశాం. పైకి పదం" డన్నారు.

సామాను పట్టించుకుని సరాసరి మేడ పైకి వెళ్లి ఒక శుభ్రమైన గదిలో సర్దించాను. తిరిగి చూస్తే మా ఆవిడ 'పతా' లేదు. పోలీసుచేతులోంచి తప్పించుకు పారి పోయిన జన్మఖైదీలా స్వజనంలో కలిసి పోయింది. మళ్లా ఇంతట్లో పట్టుకోవాలంటే బోలెడంత సిబ్బందీ కావాలి.

రైలుప్రయాణంలో ఒళ్లంతా నలగ్గొట్టి నట్టుంది. దక్షిణంవైపు కిటికీలోంచి గాలి రివ్వున విసురుతోంది. బెడ్డింగు విప్పి కాస్త నడుం వాల్చాను. అనతిదూరంలో ఉన్న పెళ్ళివారి పందిట్లోంచి శ్రావ్యమైన సన్నాయి 'మరుగేలరా ఓ రాఘవా' పాడుతోంది. చిన్న కునుకు పడుతోంది. గదిలోకి ఇంకో సామాను వస్తూన్న చప్పుడు. కళ్లు విప్పి చూశాను. సామాను వెనక ఒకాయన ఒచ్చాడు. వయసు చత్వారింశత్ దాటి ఉంటుం దని నిశ్చయం. కళ్లకు ఖరీదైన కొత్తరకం ఫ్రేము కళ్లజోడు. క్లోజు కాలరు కోటు. దానిమీద సన్నని బంగారపు వాచీ గొలుసు మెరుస్తూ వేలాడుతోంది. గుమ్మటంలాంటి శరీరం. కుంఖం బొట్టు. తల తిల తండులన్యాయం. చూపుల్లో సౌజన్యంకంటె అధికారం ఏలుబడి చేస్తోంది. మీసాలు లేవు. నాకు ఎదురుగా ఉండే గోడవైపు ఎక్కడ ఏ సామాను సర్దవలసిందీ వెండికట్టు బెత్తం మొనతో చెబుతున్నాడు. అయిదు నిమిషాల వ్యత్యాసంలో ఆయనవెంటనే ఒక ఇరవై యేళ్ల చక్కని అమ్మాయి కాలి ముఖమల్ జోడు నెమ్మదిగా చప్పుడు చేసుకుంటూ లోపలికి వచ్చింది. కణ్వమహర్షి వెనకాల వచ్చిన శకుంతలలా ఉంద. ఉపమానం తప్పేమో—

కామినియాఆయిలువాసనతో గూడా ఆమెజడలోని దవనంవాసన గుప్పున కొట్టింది. చప్పున తల యెత్తి చూశాను. కనకాంబరంగుసిల్కుచీర కట్టుకుని, ఇంగ్లీషురంగు జార్జెట్ జాకెట్ తొడుక్కుంది. లేతసూర్య కిరణాలు మామిడిచిగురుమీద పడి వెలిగే వింతరంగు ఆమెశరీరానిది. ఆకళ్లెత్తి ఏవైపు చూస్తే అక్కడ ఇంద్రధనుస్సులు పండుతాయి.

మల్లిపువ్వులూ, మామిడిపండ్లూ వేసి. తెచ్చిన ఖద్దరుచేతిసంచీ సామానుపక్కను పెట్టి గదినాలుగువైపులాచూసింది. ఎందుకో—

ఆయన కోటుపగ్గెరాలు విప్పి రెండు తువాళ్లు తీసి ఒకటి కట్టుకుని, ఒకటి పైన వేసుకుని సబ్బుపెట్టెపట్టుకొని వెడుతూ "రమణయ్యగారు ఇంకా రాలేదా" అన్నారు ఉచ్చైః స్వరంగా నాటకస్వగతంలా. నేను పరధ్యానంగా ఏదో ఆలోచిస్తున్నాను. 'నిన్నే. మాటాడవేం' అన్నట్టు నావైపు చూశారు. ఆయనకు గవర్నమెంటులో ఏదైనా ఉద్యోగ మేమో—

నేను లేచి కూచుని భయభక్తులు తెచ్చుకుని అన్నాను: "చిత్తం. తెలియదండి. మీకుగాని...కనబడితే...కాస్త... దయచేసి నేనుగూడా వచ్చానని వారితో చెప్పండి...'

పుష్కరం ఈమధ్య ఆ రవణయ్యగా రెవరో నే నెరగను. నామాటలోని కొంటెతనం ఆవిడ గ్రహించిందిగాబోలు—ఒకసారి నన్ను వింతగా చూచి నవ్వాపుగుంది. ఆయన స్నానానికీ, ఆవిడ మేడకిందికీ వెళ్లారు.

చీకటిపడుతోంది. మొగపెళ్లివారి తాలూకువారు తండతండాలుగా వచ్చి మేడంతా ఆక్రమించారు. మాగదిగూడా మరికొన్ని ముతాలతో నిండిపోవలిసిందే గాని వారిదీ, మాదీ కలిపి సామాను నాలుగు కుటుంబాలకు సరిపడా ఉంది. కనక మరి ఎవరూ ఇందులో జొరబడలేదు. కొంచెం చల్లగాలిలో తిరిగి రావచ్చుగదా అని ఊరి చివరికి వెళ్లి అటూ ఇటూ తిరిగి సుమారు ఎనిమిదిగంటలకు విడిది చేరుకున్నాను.

మా ఆవిడా, ఆ కొత్తమ్మాయీ లోకాభిరామాయణం అందుకున్నారు. ఎంతో కలుపుగోలుతనంగా ఆ అమ్మాయి మాపరువులకు జేరపడి పకపక నవ్వుతూ మాటాడుతోంది.

సుముహూర్తం పదింటికేట. ఈలోపున ఊరేగింపుగూడా అయిపోవాలి. చప్పున భోజనాలు పూర్తిచేసుకు చక్కావచ్చాం.

* * *

ఊరేగింపునుంచి తిరిగివచ్చి పల్లకీ పెళ్లివారి పందిట్లో ఆగింది. సమయానికి చేతిలో ఉన్న బాకా సవరించి దూదేకులసాయబు ఆకాశంపై కత్తి పట్టేస్తున్నాడు. నిద్రపోతూన్న పిల్లలు హడిలిపడి లేచి ఏకగ్రీవంగా ఏడవడం మొదలుపెట్టారు. బాండువాళ్లు అప్పుడే 'సునోసునో' పాడి ఆపారు. సుముహూర్తానికి వెళ్లాం. లోపలికి వెళ్లే హాలులో మేజువాణీ జరుగుతోంది. నావయస్సువాళ్లంతా ఆప్రాంతంలోనే సర్దుకుంటున్నారు.

"రావోయ్ శర్మా! ఇటు ఇటు" అని అందులోంచి ఒక ఆప్తబంధువు పిలిచాడు. "శర్మ ఫోర్త్ ఏంటీనాచ్ — పిలవకురా బాబూ" అని ఒకడు.

సుమారు పదేళ్లయింది బోగంమేళంలో కూచుని. పాపం — ఈకళావతుల్లో కళ ఏనాడో పోయింది. అక్కడికి వెళ్లి ఏంబావుకోవాలి. పౌడర్లూ, రంగుచీరలూ, సిల్కురవికలూ కప్పిన రోగిష్ఠిశరీరాలను చూచి చప్పరించడంతప్ప. అథవా—ఒకసారి వెళ్లి కూచున్నా 'ఈదేహం అమ్మకానికి—వలయువారు......' అన్న వేవో జ్ఞాపకంవచ్చి కళ్లనీళ్లపర్యంతం అవుతుంది నాకు. టైలర్లు, డ్రైవర్లు, హోటలుసెర్వర్లుగదా ఈనాటి రసికులు. అణాకానీకి దిగలాగి 'ఈతపళ్ల' పాటలు పాడించి నిర్భాగ్యులంతా ఈమధురమైన సంస్థను చంపేశారు.

తలవంచుకొని లోపలికి నడిచాను. ఓహో—ఏమి నేత్రనిర్వాణం! విశాలమైన ప్రాంగణంలో బాగా అలంకరించిన వివాహ మండపం!

కుడివైపున నాగరికవేషంతో కూచుని, అత్తరు పన్నీరూ, తాంబూలాలూ విరివిగా ఉపయోగిస్తున్న లౌక్యులూ, బంధుకోటీ, పెళ్లిపీటకు ఎదురుగుండా ఒక బ్రాహ్మణ సముద్రం. విసనకర్రమేఘాలు దానిమీద అతిజోరుగా ఆడుతున్నాయి. పూచిన తంగేడుపొదల్లా స్త్రీజనం. నల్లనిజడలూ, తెల్లని మల్లెచెండ్లూ ఆ ప్రాంతాన్ని ఏలుతున్నాయి.

ఈపేటస్త్రీల పద్ధతే వేరు—రాచ్చిప్పల్లో, మడిబట్టల్లో కొట్టుకునే బ్రాహ్మణ కుటుంబాల్లో తప్పబుట్టారు. ఎప్పుడూ ఎంత ఉత్సాహంగా చురుగ్గా కలకలలాడుతూ ఉంటారనీ! ముప్పైనలభై ఏళ్ల ఆవిడగూడ చీరా రవికా ఎక్కడా మాయనీకుండా, కడిగిన ముత్యంలా తయారై బయటికి వస్తుంది. కనుకనే ఆవూళ్లో ఏశుభకార్యానికి పిలిచినా మహాసరదా అవుతుంది వెళ్లడానికి.

నేనూ ఒకచోట చదికిలబడ్డాను. బ్రాహ్మణోత్తములు అర్థంతెలియని వేద మంత్రాలతో హోరుపెడుతున్నారు.

"మదర్థం కన్యాం వృణీధ్వమ్"—పెండ్లికుమారుడు మొహంఎరగని ఒక బ్రాహ్మణ్ణి పిలిచి పావలా చేతిలోపెట్టి నా కోపెళ్లి కూతుర్ని చూసిపెట్టమన్నాడు. బ్రాహ్మడు అక్షతలు దులిపి డబ్బులు రొంటిని దోపి లేచినచోటే కూచున్నాడు. అట్లా నలుగురు. పాపం ఒక్కరూ ఆ అబ్బాయిమాట వినలేదు. డబ్బు తిని దగాచేశారు.

ఆయింటి 'యజమాని' మంచివాడు గనుక అతనిమీద దయగలిగి, పట్టుబట్టలు కట్టుకు వచ్చి అతని కెదురుగా కూచుని మాపిల్లను నీకిస్తా నన్నాడు.

"కన్యాం కనకసంపన్నాం కనకాభరణైర్యుతాం, దాస్యామి విష్ణవే తుభ్యం..."

అన్నీ అబద్ధాలు. పిల్లఒంటిమీద ఒక్కనగకూడా కనపడ్డంలేదు, జడలో నాగమల్లి పువ్వులు తప్ప. వెయ్యిన్నూట పదహారు రూపాయలు మొగపెళ్లివారు కట్నంగా గుంజిన తర్వాత నగలుపెట్టవలసిన పూచీ ఆయన కేముంది ?

"ధర్మార్థకామేషు త్వయైషా నాతిచరితవ్యా" కన్యాదాత అన్నాడు — మహా అర్థం తెలిసినట్టు. "నాతిచరామి" సంస్కృతం ముక్కలు నోటపట్టని ఆ అబ్బాయిచేత పురోహితు డనిపించాడు.

సభలో కూచున్న వృద్ధులూ, ముది ఐదువలూ సాదరంగా స్పృశించిన మీదట—మంగళసూత్రం చేత్తో పట్టుకొని పెండ్లికొడుకు—

"మాంగల్యతంతునానేన మమ జీవనహేతునా, కంఠే బధ్నామి సుభగే..."

అంటూ, తెల్లని కళ్లతో చూచి అమాయికంగా మెడ ఒప్పగించే పెండ్లికూతురుమెళ్లో కట్టాడు. ముడి పడింది—

నా కళ్లలో ఎందుకో నీళ్లు తిరిగాయి. అబ్బ—ఎంత తియ్యని ముడి! ఎన్నాళ్లకూ విడరానిముడి! సుఖదుఃఖాల్లో - నవ్వు ఏడుపుల్లో నులివెచ్చని కౌగిలింతల్లో— ఒకరి వెంట ఒకర్ని బలంగా లాగే ముడి! దీని బాధ్యత—దీనిలోని అనంత బాధామాధుర్యం ఈ పూపపిందెల కేం తెలుసు ?

తెలిస్తే— వెంటనే— నునుకొత్తసిగ్గుతో ఒకరి నొకరు చూసుకొని, ఎంత హాయిగా —తీయగా నవ్వుకొనేవారు!

మనస్సులో సముద్రపుటలల్లా ఎన్నో ఊహలు. ఈగ్రంథి-చేతులకూ మెడకూనా?- ఛా! ఎంత విరూపఘటన! రెండు పక్వ హృదయాలలోని స్నేహతంతువుల ముడి— ఎప్పుడో- ఎక్కడో—ఋషుల ఆశీర్వచనాల లో పుట్టిన పవిత్రవివాహసంస్థ తుద కెట్లా తేలింది ?

నిద్ర ముంచుకు వస్తోంది. లేచి విడిది మేడవైపు నడిచాను. మేడమీద దీపా లేవీ లేవు. హాల్లో ఒకరిద్దరు చంటిపిల్లలు గావును నిద్దరోతున్నారు.

తడుముకుంటూ గదిలోకి వెళ్లాను. బట్టలు మార్చే ఓపిక లేదు. పరుపుకోసం వెదికాను నిద్రమత్తులో తూలుతూ. పరుపు చక్కగా పరిచివుంది.

అప్పుడే వచ్చి శయనించింది గాబోలు మా ఆవిడ. మొగాళ్లకన్న ఓర్మి బద్ధకం మనిషి— పిల్లలతో తగువుపడుతూ ఎక్కడో కూచుని చక్కా వచ్చి ఉంటుంది.

పరుపుమీద ఒరిగాను. పెళ్లివారు రాసిన డిల్ బహారు సెంటుతో నా లాల్చీ పరిమళిస్తోంది. తీరా పడుకుంటే...... నిద్ర రాదు. దొర్లుతున్నాను.

పెండ్లివారింట్లోంచి చల్లగా ఇంకా పెళ్లి మంత్రాలు వినబడుతున్నాయి.

"సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః..."

నాకు నవ్వొచ్చింది. రెండు నిమిషాలు గడిచాయి. మెత్తని తామరతూడువంటి చెయ్యి ఒకటి నామెడమీద పడింది. బంగారు గాజులు చిరుతచప్పుడు చేశాయి. ఆ మృదు స్పర్శకు నానరాలన్నీ భగ్గుమని వెలిగాయి. శరీరం జరుగుతోంది. మెదడు తిరగబడుతోంది. ఎంత చిత్రమైన అనుభవం!

పెళ్లి పచ్చకర్పూరపు తాంబూలంతో పరిమళించే వెచ్చని నాలుగు పెదవులూ, ఉద్రేకంగా కొట్టుకునే రెండు హృదయాలూ అతిదగ్గరగా కలుసుకున్నాయి.

పెళ్లిమంత్రాలు ఇంకా వినబడుతున్నాయి.

"సఖా సప్తపదా భవ సఖాయౌ ... సఖ్యాత్తే మాయోషగ్ం సఖ్యాన్మే మా యోష్ఠాః..."

నేను బయలుదేరిన చోటినుంచి తోవ తప్పి ఏగంధర్వలోకంలోని దేవకన్యకఒడిలోనో పడలేదుకద!

ఆబాహునాళపు సుఖస్పర్శ—పెదవులు కలిపేసేస్పు- ఏ జన్మలోనూ పరిచితమైనట్టు లేదు. ఆమత్తులోంచి లేచి ఆలోచించే త్రాణ లేక బుద్ధి గిలగిల కొట్టుకుంటోంది.

* * *

హఠాత్తుగా కామినియూఆయిలు తీవ్ర పరిమళంతో నాతల తిరిగింది. ఉలికిపడి లేచాను. మనస్సు ఆందోళనతో కొట్టుకుంటోంది. కష్టపడి వెతికి దీపం వెలిగించాను. ఏమి టద! నాకళ్లను నేను నమ్మలేకపోయాను. ఈమె ఎవరు? నాభార్య కాదు. ఆ కొత్తమ్మాయి శకుంతల! సాయంత్రం ఎవరో పిలుస్తుంటే విన్నాను. ఎంత విచిత్రసంఘటన! నాఆశ్చర్యానికి హద్దులేదు. ఇంద్రజాలమా- వరప్రసాదమా? ఏపితృదేవతాశీర్వాదం, ఏయామినీదేవత, ఏప్రణయఅధిష్ఠానదైవం, ఈలావణ్యరాశిని మాయచేసి నాకు దానం చేశారు?

'దైవమిచ్చిన భార్యా' ఈమె?

తన్నూ, నన్నూ తిట్టుకుని ఎంత కుంగిపోతోందో లోపల? నెమ్మదిగా ముఖమెత్తి చూశాను. రెండు నిమిషాలు ముఖం దాచుకుని మెల్లగా—నావైపు చూస్తోంది, చిక్కుపడిన లోలకులు సవరించుకుంటూ. మాట్లాడడానికి ధైర్యం చాలకపోయినా—

తెగించి అన్నాను: "ఎంత పొరపాటు జరిగింది?" ఆమె మాటాడలేదుగాని ముఖం మాత్రం మలినంగా లేదు. "క్షమిస్తే—మీ ఎదుటనుంచి వెడతాను" లేవబోయాను. ఈ మాట ఆమెను కదిపింది. నావైపు ఒకసారి గంభీరంగా చూచి చిరునవ్వు నవ్వింది. నాకు ఊపిరి తిరిగింది. "మనస్సులో బాధ పోవడానికా నవ్వుతున్నారు" చనువుగా అన్నాను.

"పుట్టుకతోనే వచ్చిన ఈమనస్సులోని బాధకు పోవడమంటూ లేదు... పెళ్లిపందిట్లో కొంతసేపు కూచుని ఏవేవో జ్ఞాపకమొచ్చి—ఏమీ తోచక ఇక్కడికి వచ్చి చేతికిదొరికిన పరుపొకటి పరుచుకు పడుకున్నాను. నాది అన్నదానిమీద అభిమానం ఏనాడో పోయింది. తనకు అన్యాయం చేసినవారిమీద పగతీర్చుకోడానికి బుద్ధిపూర్వకంగా—సంతోషంగా తప్పుచేసే ధైర్యం ఎట్లాగూ లేదు. తలవనితలంపుగా జరిగిన చిత్రకథకు విచారం ఎందుకూ?... మీరు పశ్చాత్తాపపడుతూంటేమాత్రం నిశ్చయంగా నేను విచారిస్తాను."

ఎంత విచక్షణ — ఎంతచిత్తశుద్ధి — సాహసిస్తే దేన్నికైనా స్త్రీయే సాహసించాలి. మగవాడు వట్టి చచ్చుపెద్దమ్మ!

" పశ్చాత్తాపమా ? దేనికి ? ఈరసికత్వం — ఈ దివ్యానుభవం — ఈఉజ్జ్వల సౌందర్యం—ఎన్ని తపస్సులకు లభ్యమవుతుంది? ఈ స్వర్గీయ అమృతస్వప్నాన్ని ఏనిర్భాగ్యుడు పిడికిలితో పట్టి నిలబెట్టుకోగలడు ? ఉత్తరక్షణంలో కరిగిపోతుంది. మళ్లా మామూలు శుష్కజీవితం గిరగిర తిరగడం మొదలెడుతుంది" నాహృదయం వెలిగించిన ఒత్తిలా మాట్లాడింది.

ఆమె అందుకుంది: " అయితే ఈ స్వప్నాన్ని నేను శాశ్వతం చేస్తాను. ఆ కసుగాయలకు ఇప్పుడు వీరంతా అర్థంతెలియని మంత్రాలతో అరిచి చేసింది పెళ్లికాదు, బొమ్మలపెళ్లి. ఈ ఏకాంతరాత్రి, దక్షిణపుగాలి, చుక్కలు, పాలలా పొంగే యౌవనం మనకు చేసిందే యథార్థమైన పెళ్లి. సరిపడని భర్తతో ఇంతవరకూ కాపరంచేసి చచ్చి, ఇప్పుడు మీపక్కని కొత్తగా పుట్టాను."

లేచి నుంచుంది. కళ్లూ, చెక్కిళ్లూ గీపపు కాంతిలో దుర్నిరీక్ష్యంగా వెలుగుతున్నాయి.

"మీమాంసలవల్ల లాభం లేదు. ఇక ఒక్క పదినిమిషాల్లో 'వారిద్దరూ' వచ్చి ఈ స్వర్గాన్ని నరకం చేస్తారు ... ఏంచేద్దాం... తిరుగులేని నిశ్చయంగా...మన కర్తవ్యం... ఏమిటి?"చురుగ్గా మేడకింది చీకట్లో ఎగిరే మిణుగురులకేసి చూస్తూ అన్నాను.

"కర్తవ్యమా?"

చరచర దగ్గరికి వచ్చి నవ్వుతూ గులాబీ రేకువంటి చేతిని అందిచ్చింది.

అనతిదూరంలో ఉన్న రైల్వేస్టేషన్‌లో అప్పుడే వచ్చి నిలిచిన 'రైలు' ఖంగున కూసింది.

---

# చిత్రగుప్తులు



= శ్రీ వసంతరావు వెంకటరావు =

అనుక్షణం జీవులు చేయుచున్న పాపపుణ్యాలను నిర్దిష్టంగా లిఖించి, జీవితాంతమున యమలోకం చేరుకొన్న పాపాత్ముల దుష్కృత్యాలు క్రోడీకరించి యమధర్మరాజునకు నివేదించు విధి చిత్రగుప్తులది. శతకోటిసహస్రంగా నున్న భూలోకజీవుల నిత్యకృత్యాలను లిఖించడానికి ఇద్దరు చిత్రగుప్తులకు సాధ్యమౌతుందా అని యోచిస్తే, అసలు చిత్రగుప్తులన్న వ్యక్తులున్నారా లేరా అన్న సందేహం కలుగకతప్పదు. ఒక లేఖకుడు లిప్తకాలమైనా విరామం లేకుండా రోజుకు ౮ గంటల చొప్పున పనిచేస్తే ఒక జీవి దినచర్య వ్రాయడానికి ముగ్గురు లేఖకు లుండాలి. ఆలెక్కపైని, అసంఖ్యాకంగా నున్న జీవులకు అధమము 3 కోట్లు అయినా చిత్రగుప్తు లుంటేకాని యమలోకంలో పాపుల కుచితశిక్ష విధించడానికి ముఖ్యాధారమైన జీవితచరిత్రలు సమగ్రంగా ఆయిత్తపెట్టుట సాధ్యం కానట్లు పొడగట్టుతుంది. అగుట, సామాన్యమానవులకు సైతమంగీకృతముగాని పాత్రలను పురాణేతిహాస కర్తలగు మహామేధావులు సృజించి ఉంటారా అను విషమసందేహం జనించుట సమంజసమే.

## ప్రాచీనశాస్త్రాలు-వాటిభావము :

నారదపాత్రను విమర్శించిన * సందర్భమందు పురాణేతిహాసాలలోని వ్యక్తులను మూర్తిమత్వమీయబడిన విశిష్టాభిప్రాయాలుగా భావించుట ఉత్తమోత్తమమని నివేదింపబడింది. మహోన్నతమును, విశాలమును అగు సంఘనిర్మాణము చెక్కుచెదరకుండ, బీటలు వారకుండ, కాలోద్ధ్వంసములవాత బడకుండ నిరంతరము వర్ధిల్లజేయునట్టి సర్వకాలమున కక్కరకు వచ్చు విశ్వజనీనాభిప్రాయాల సంపుటీకరణమే ప్రాచీనశాస్త్రముంజూడు. సర్వవ్యాపి యగు భగవంతుని పేరిట, ఇహపాపములకు పరలోకములో జీవు లనుభవింపనున్న ఘోరంతయాతనల పేరిట, సంఘమర్యాదలను పాటించమని మానవులను హెచ్చరించుచున్న ప్రాచీనశాస్త్రాలు పాశ్చాత్యనాగరికతావ్యామోహితులకును, భౌతికజ్ఞానలేశదృష్టితో పరికించు నవనాగరికులకును హాస్యాస్పదములై కన్పట్టిన కన్పట్టుగాక! అంతమాత్రాన వాటిని తృణీకరింపక శ్రోత్రపదికములైన భావసంపత్తిని గ్రహింపవలసిన బాధ్యత మనపై నున్నది.

## చేసిన తప్పుకు శిక్ష అనుభవించక తప్పదు :

అతిరహస్యంగా మానవు లొనరించు దుష్కృత్యాలు పరుల కజ్ఞేయములై సర్వదా గోప్యంగా ఉంటాయను నమ్మకమే వారికి లేకపోతే మానవులు దుష్పథగాములు కారు. కొన్ని నైతికదుష్కృత్యములు వెల్లడియైనప్పుడు తగిన శిక్ష సంఘమో, ప్రభుత్వమో విధిస్తూనేఉంది. రాజదండన భయోత్పాదకంగా ఉంటుంది. న్యాయమూర్తు లప్రమత్తులై సకాలంలో దుష్టశిక్షణ చేయుచునేఉన్నారు. అయినప్పటికిని ఒకానొకప్పుడైనను మానవుని దుర్నయాలు శిక్షాధికారుల సూక్ష్మదృష్టి నుండి తప్పిపోతాయన్న ఆశచేతనే మానవుడు అలౌకిక ప్రవర్తనానికి సెట్టుకొనేది. ఇది భౌతికప్రపంచ విషయము.

* "నారదుడు - కర్మఫలము" : భారతి, ౧౮-౧౨.

శిక్షార్హులు ప్రమాదవశాత్తు భూలోకంలో దండనవిముక్తు లైనప్పటికిని మరణానంతరమున వారి వారి దుష్కృత్యములకు యుక్తమగు శిక్షానుభవం వారికి తప్పదని భారతీయసిద్ధాంతము. ప్రతికర్మానుభవం జీవికి అనుల్లంఘనీయ మైనప్పుడు, సుకృతదుష్కృతములు జన్మజన్మాంతరేపి జీవి నాశ్రయించియున్నప్పుడు, యుక్తశిక్షనిర్ణయానికి వీలగునట్లు జీవియొక్క కార్యాకార్యసముదాయం సమగ్రంగా లిఖితమై ఉండాలి; లేదేని, జీవికి అన్యాయం జరుగుతుంది. ఏ విశ్వశక్తిప్రేరకమున జీవికి కర్మానుభవం అవశ్యకర్తవ్యమో, ఆవిశ్వశక్తిప్రేరకముననే జీవియొక్క సంపూర్ణచరిత్ర నిరాఘాటంగా విశ్వపత్రాలలో స్వయముద్రితం కావలసిఉంది. ఈభావమే పురాణగ్రంథస్థమై యుండినట్లైతే, ఆకాలంలో అది జనాదరణకు పాత్రమయేది కాదు. మతవిశ్వాసం ప్రబలంగా నున్న ఆకాలంలో ప్రతి ఉత్కృష్టవిషయమూ మతపరంగా ఉద్బోధింపబడేది. సర్వజీవ కార్యాకార్యలేఖ నిర్వహణ భారం వహించుటకై ప్రత్యేకంగా చిత్రగుప్తులు సృజింపబడ్డారు.

## ఏజీవి కాజీవియే చిత్రగుప్తుడు :

శక్తిద్రవ్యముల కవినాభావసంబంధ మున్నదని ప్రాయోగికంగా ఋజువపరిచి, స్థూలదృష్టికి గోచరించు బహుధానేకత్వంలో ఏకత్వాన్ని అన్వేషించగలిగిన భౌతికవిజ్ఞానదృష్టితో చిత్రగుప్తభావాన్ని విమర్శిస్తే మహత్తరసత్యం వ్యక్త మాతుంది. అది, ఏజీవి కాజీవియే చిత్రగుప్తుడన్న పరమరహస్యము. అనుక్షణము, సర్వకాల సర్వావస్థలయందును ప్రతిజీవియు తన సంపూర్ణ చర్యలను, భావములను అజ్ఞానతః విశ్వపుస్తక పత్రాలలో లిఖించుచునే ఉన్నాడు. జీవియొక్క యావచ్చరిత్రమును విశ్వాంతరాళములలోనికి ప్రకృతిశక్తులమూలంగా తనే వ్యాపింపచేస్తున్నాడు. అయితే ఆ చరిత్ర సూక్ష్మలిపిలోనికి అనువదింపబడిన పిదప విశ్వయానానికి బయలుదేరుచుండుటచేత ఒకరి చరిత్ర మరొకరు సంగ్రహించుటకు అవకాశము లేకున్నది. ఆ సూక్ష్మలిపి నెరింగిన భవితజ్ఞుల విశేషదృష్టికి మాత్రము సర్వము విదితమాతుంది.

## విశ్వము-విద్యుదయస్కాంతశక్తి :

విశ్వము విద్యుదయస్కాంతశక్తి (Electro - Magnetic Energy) కి క్రీడారంగము. ఉష్ణము, కాంతి, X-కిరణాలు, గామాకిరణాలు, అతినీలలోహిత (Ultra-violet) కిరణాలు, అతిశోణ (Infra-red) కిరణాలు, రేడియోతరంగాలు మొదలగు భిన్నభిన్న రూపాలలో విద్యుదయస్కాంతశక్తి విశ్వంలో స్వేచ్ఛావిహార మొనరిస్తూంది. కోట్లకొలది మైళ్ల దూరంగా నున్న నక్షత్రాలనుండి ప్రసరించు కాంతిని యుక్తోపకరణాలతో పరిశీలించి జ్యోతిశ్శాస్త్రజ్ఞులు నక్షత్రచరిత్రను కొంతవరకు సమకూర్పగలుగుచున్నారు. నక్షత్రగర్భంలో పాటిల్లుచున్న మహాద్భుతపరిణామములను నిర్దుష్టంగా మానవుల కెరిగిస్తూన్నదే నక్షత్రకాంతి. ఆ కాంతి దృగ్గోచర కాంతియే కానక్కరలేదు. పైని వివరించిన వివిధ కిరణాలలో ఏదైనను నక్షత్రరహస్యం బయటపెట్టగలదు. అయితే ఆలిపి మరొకవిధంగా బోధపరుచుకోవాలి.

## మానవుడు - విద్యుత్తు :

మానవుని ద్వారా విద్యుత్తు నిరాటంకంగా ప్రవహిస్తుంది. విద్యుత్ప్రవాహానికి మానవుడు కొంత ప్రతిరోధం (Resistance) కలిగించినప్పటికిని మానవ శరీరము మంచి వాహక (Conductor) మే. ఏదైనా ఒక లోహపుతీగయొక్క ప్రతిరోధము నిశ్చితమైనది. కాని, మానవుని ప్రతిరోధం మారుతూ ఉంటుం దన్న విషయం మన శాస్త్రజ్ఞులు ప్రాయోగికంగా ఋజువు చేసేరు. ఒక విద్యుదావృత్తం (Electric circuit) లో మానవుని చేర్చి, వాని ప్రతిరోధము కనుగొనవచ్చును. అట్లుండిన మానవునికి భయమో, ఉత్సాహమో, ఉద్రేకమో, సంభ్రమమో, విషాదమో, కారుణ్యమో, ఆశ్చర్యమో కలిగినప్పుడు విద్యుత్ప్రవాహానికి వాని ప్రతిరోధం మారుచున్నట్లు కనుగొన్నారు. మానవునికి మనఃపరివర్తనం సంభవించినప్పుడల్లా వాని ప్రతిరోధ పరిమాణం మారుతుందని ఋజువయింది. అట్టి సమయాలలో మానవశరీరమందు వైద్యుతీయంగా మార్పు కలుగుతుంది.

వల్కా_నైటుపన్నెతో తల దువ్వుకొని, ఆ పన్నెను చేతివెంట్రుకల దగ్గరకు తెచ్చినప్పుడు వెంట్రుకలు నిట్టంగా నిలుచుంటాయి. తల దువ్వుకొన్నప్పుడు కలిగిన రాపిడిచే వల్కా_నైటులో స్థావర విద్యుత్తు (Static electricity) జనిస్తుంది. పన్నెలోనున్న విద్యుత్తు వెంట్రుకలనుసైతము ప్రేరేపించి వాటికి విద్యుదావేశం కలిగిస్తుంది. ఆ కారణంచేత వెంట్రుకలన్యోన్యంగా విముఖమౌతాయి. ఒక దానినుండి ఒకటి దూరంగా పోవుటకే ప్రయత్నిస్తాయి. కాని శరీరంలో ఉద్భవించిన పోటచేత రోమములు హాటిస్థానం నుండి కదలలేవు. కాబట్టి, విద్యుదావేశం పొందినప్పుడవి గత్యంతరంలేక నిట్టనిలుచుంటాయి. సంభ్రమోత్సాహోదిరసను ఉదయించినప్పుడుసైతము వెంట్రుకలొక్కసారి సూటిగా లేస్తాయి; కాని అది శరీరం గగురుపాడుచుటచే సంభవిస్తుంది. అగుట శరీరం గగురుపొడిచినప్పుడు వెంట్రుకలకు విద్యుదావేశం ప్రాప్తిస్తుందని సహేతుకంగా నిర్ణయింపవచ్చును. ఈక్రియలో విద్యుదయస్కాంత తరంగాలు జనించుటకుసైతము అవకాశముంది. ఆ తరంగాలు దిగ్వలయము వ్యాపిస్తాయి. వాటి సందేశం గ్రహించగలవారి కందరకు జీవియొక్క చరిత్రను పూర్తిగా నివేదిస్తాయి.

## ఇచ్ఛా, జ్ఞాన, క్రియలు :

అయితే, విద్యుదయస్కాంత తరంగముల ద్వారా సర్వకార్యములు ప్రకటితమౌతాయా, కావా అని విచారిస్తే ఎంత గోప్యంగా జీవి చేసిన కార్యమైనను విద్యుదయస్కాంత లిపిలోనికి అనువదింపబడకపోదని స్పష్టమౌతుంది. యోచనచేయకుండ ఏకార్యమును జీవి చేయలేడు. ప్రతికార్యమును ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తుల మూలముననే జరుగుతూంది. ఎట్టి స్వల్పకార్యమైనను సరే తదాచరణవిషయమై జీవికి ప్రప్రథమాన్ని ఇచ్ఛ జనిస్తుంది. తదనంతరము ఆచరణవిధానమాలోచించు జ్ఞాన ముదయిస్తుంది. పిదప కార్యనిర్వహణకు పూనుకొంటాడు. ఇట్లు, యుక్తమైన మనఃప్రవృత్తి లేనిదే కార్యములు కొనసాగవు. మనఃప్రవృత్తితో శరీరంలోనుండి విద్యుదయస్కాంతతరంగాలు వ్యాపిస్తాయి. అవి సెకనుకు ౧,౮౬,౦౦౦ మైళ్ల వేగంతో ఆకాశయానం చేస్తాయి. వాటి వేగాన్ని మించిన వేగం—మనోవేగం తప్ప_లేదు. వాటికి విరామాకాంక్ష లేదు. కించిత్తైనా క్షయంలేని జవంతో కాలాంతం వరకూ అవి విశ్వయాత్ర చేస్తూనే ఉంటాయి.

భూలోకజీవజాలంలో మానవుడు సర్వోత్కృష్టుడు కావచ్చును. మానవనాగరికత మహోత్కృష్టమైనది కావచ్చును. కాని, జగత్తులో నక్షత్రగోళాలు లెక్కకు మీరినన్ని ఉన్నాయి. ఆగోళాలలోగాని, వాటి నాశ్రయించి పరిభ్రమిస్తూన్న గ్రహాలలోగాని భూలోకజీవంవంటి జీవమును లేకపోవచ్చును. కాని, మానవునికన్న మేధావంతులగు జీవు లుండరని నిష్కర్షగా చెప్పలేము. భూగోళపరిణామంలో ప్రాథమిక జీవజాతులనుండి మానవు డుద్భవించిన ట్లంగీకరించినట్లైతే, నిరంతర విపర్యయ మొందుచున్న భౌతికావస్థల కనుగుణంగా మానవజాతినుండి అంత కుత్తమోత్తమమైన జాతి జనింప దని ఖండితముగా చెప్పుట కవకాశం లేదు. అగుట, మానవనాగరికతకన్న అత్యుత్తమమైన నాగరికతలో వర్ధిల్లుచున్న జీవులు గల గోళాలుండవచ్చును. అట్టి జీవులు విద్యుదయస్కాంతతరంగలిపిని మనకన్న సూక్ష్మంగా అవగాహించు సాధనములను కల్పించియుండవచ్చును. దూరదర్శినికంటె మేలైన యంత్రములతో వారు భూమిని పరిశీలిస్తే భూలోకజీవుల చరిత్రలు వారికి సువ్యక్తమౌచుండుటకు సందేహం లేదు.

## కాలవాహినిలో కర్మయాత్ర :

అట్టి విశేషసామర్థ్యం గల ఉత్కృష్టజీవులు అనేకగోళాలలో నుండవచ్చును. మన కతిసమీపంగానున్న నక్షత్రంయొక్క దూరం ౨౫,౦౦,౦౦౦ కోట్ల మైళ్లు. ఊహాతీతమైన నక్షత్రదూరాలను 'కాంతిసంవత్సరం' (Light year) లో కొలుచుట ఆచారమై ఉంది. సెకనుకు ౧,౮౬,౦౦౦ మైళ్ల చొప్పున ప్రయాణం చేయు కాంతి ఒక సంవత్సరంలో సుమారు ౬౦౦,౦౦౦ కోట్లమైళ్లు పోతుంది. కాబట్టి, మనకు ౬౦౦,౦౦౦ కోట్ల మైళ్లు ఎడంగా నున్న నక్షత్రం

యొక్క దూరము ౧ కాంతిసంవత్సర మంటారు. ఆ మానంలో మన కతిసమీపంగా నున్న తారయొక్క దూరం ౪ ౧/౪ కాంతిసంవత్సరాలు. ౪ ౧/౪ నుండి శతసహస్రకాంతిసంవత్సరాలు దూరంగా నున్న నక్షత్రాలు, నెబ్యులాలు ఉన్నాయి. జెమినికూటంలో నున్న ఒక నెబ్యులాగణం మనకు ౧,౫౦,౦౦,౦౦౦౦ కాంతివత్సరాల దూరంలో ఉంది. పుంఖానుపుంఖాలుగా నున్న ఈగోళాలలో విద్యుదయస్కాంతలిపి నెరిగిన పరిశోధకు లుండి వారి దృక్కులను భూమిపై కేంద్రీకరింపజేసినట్లైతే భూలోకజీవుల చరిత్రలు సమగ్రంగా వారికి విశద మౌతూఉంటాయి. అతిరహస్యంగా మనం చేసినట్లు భావించుకొన్న కర్మలయొక్క వార్త భూలోకవాసుల కెవరికిని తెలియనప్పటికిని విశ్వజనాని కవి విదితములే! ఒక కర్మ మనం చేయగానే అది కాలగర్భంలో లయమైపోయిం దనుకొనుట ఘోరమైన పొరపాటు. కర్మ చేసిన నాలుగేండ్లతరువాత దాని విషయము సెంటారీ – ఒకనక్షత్రం – లోని జీవులకు తెలుస్తుంది; ౮ ౧/౬ ఏండ్లతరువాత సిరియసు నక్షత్రవాసులకు విశదమౌతుంది; ౧౫ కోట్ల సంవత్సరాలతరువాత జెమినికూటమండలి ఒక నెబ్యులాగణంలో నున్న జీవులు తెలిసికొంటారు. ఇట్లావిషయం కాలవాహినిలో యాత్రచేస్తూ విశ్వంలో నున్న పూతజీవులకు ఆ కర్మరహస్యం ఎరిగిస్తూనే ఉంటుంది. మనం చేసిన కర్మ నాశనంగాదు. విశ్వానికి అంతమంటూ ఉంటే విశ్వాంతంవరకూ ఆకర్మ విశ్వంలో ఉంటుంది. ఇట్లు ఎవరికి వారే చిత్రగుప్తులు.

ఇది భౌతికవిజ్ఞానయుగ మనీ, యంత్రవిజ్ఞానప్రాబల్యంచే నాస్తికత్వమే ప్రబలుతున్న దనీ దురభిప్రాయపడక, భౌతికవిజ్ఞానాదేశములను గ్రహించి నేటి మనఃప్రవృత్తి కనుగుణంగా భౌతికజ్ఞానదీపికతోడనే ప్రాచీనశాస్త్రాగారమును శోధించినట్లైతే దాని ప్రాశస్త్యము నవీనుల నాకర్షింపకపోదు. మూఢవిశ్వాసాచ్ఛాదితమైన ఉన్నతభావములను స్పష్టంగా ప్రదర్శించగల నూతనకాంతిలో ప్రకటించినప్పుడు నవనాగరికులు కూడ ముగ్ధులై వాటి కంజలిఘటింతు రని ఆశింపవచ్చును.



# ఆంధ్రరాజ్యేందిరా!





శ్రీ రత్నాకరం శంకర నారాయణరాజు

సకలోర్వీతలరంగమధ్యమున స్వేచ్ఛన్ మున్ను నీ కీర్తిక
న్యక గజ్జెల్మ్రోయించి యాడినదిగాదా? రాజసంఘంబు మ
స్తకముల్ వంచి భవత్పదాబ్జముల పజ్జన్ గాన్క లర్పింపదా?
వికటంబై చనుదెంచె కాలగతి, నీ వీనాడు లోకాన తే
లిక మైపోయితి వెల్లవారలకు, తల్లీ! యాంధ్రరాజ్యేందిరా!

పగరకు గుండెపై నిడిన బల్లెము కృష్ణధరాతలేంద్రు డీ
జగతిని ఖడ్గహస్తుడయి శాత్రవబృందము జెండునాడు నీ
సిగపయి పూవువాడకయ చెల్లెనుగాదె సమస్తభోగముల్,
వగచుట జెల్ల దాపదలవంతులు దాపురమైన వేళలన్.

చుక్కలదాక మా తెలుగుజోదుల యాదివరాహ టెక్కె, మే
దిక్కున జూడ దానెయయి, తేకువ మున్నొకనాడు వైరులన్
జిక్కులబెట్టి వింధ్యగిరి జేరెడు దాక నదల్పలేదె? యా
చొక్కపు శౌర్యగాథ చెవిసోకిన క్రొంబులకల్ జనించెడున్.

తఱిగని యెత్తి వచ్చు సులతానుల మార్కొని, మాటిమాటికిన్
దురమున రక్తధారలను దోగి, జయాన్వితులైన పుత్రు లా
దరమున నిన్నుగాచునెడ, ధారుణి నే మగవాడుగాని ని
న్నిరవుగ దేరిచూచెనె? యదెల్లను మాయునొ నీమనంబునన్ ?

ఊతోడనున్న మిటారంపు ముద్దులగుమ్మ వాతెఱయమృతమ్ము రోసి
లలితనవ్యశిరీష కలితమాలాజాల పేశలాధిక్యంబు నీసడించి
కలవాణి దేనియల్ జిలికించు జవరాలి మృదుమధురోక్తుల మేలమాడి
గోఘృతపాయస గోస్తనీఫలరస మాధురీమహిమంబు నధిగమించి
మించి, యాంధ్రావనీతలమెల్ల హర్ష
సలిలనిధి నోలలాడించి శాశ్వతముగ
పెద్దనార్యకవిత్వంబు పృథ్విమీద
నీదు కీర్తి ప్రతిష్ఠలు నిల్పెగాదె?

పంచమవేదమా భారతసంహిత విరచించినట్టి కవిత్రయంబు
నిరుపమశౌర్యమై యరులజెండాడిన భద్రగుణాన్విత రుద్రమాంబ
ధీమంతుడయి తెల్గుభూమి వేగన్నుల గాపాడినట్టి యుగంధరుండు
భక్తాగ్రగణ్యుడా భాగవతగ్రంథకర్త పోతన మహాకవివరేంద్రు
డరయ, కడుపార నీవు గన్నట్టి సంతు
గాదొకో? నేటికేనియు గలదె లోటు
విమలధైర్యమనీష విక్రమములందు
కలసి రాలేదు నాతల్లి! కాలమొకటె.

సర్వదిగ్విజయంబు సాధించి నిల్పిరి విజయశాసనములు వేనవేలు
శిల్పకళాప్రౌఢి జెన్నార దిద్దిరి కోటలుగోపురాల్ నీటుగుల్క-
హృదయరంజకములై యెసగుసత్కావ్యముల్ రచియించి రెన్నియో రహిదలిగ
అవనిప్రజాహితార్థంబు నిర్మించిరి బహుళతటాకకూపాదు లెలమి
పూర్వచారిత్ర శోభావిభూతి నేడు
కనులగట్టిన రీతిని గానుపించు
అడగినది కాలగర్భాన నాంధ్రదీప్తి
యెన్నడో ప్రజ్వలించు నదింతనిజము.

అమలతరమ్ములౌ తవ దృగంచల రేఖల నీడలందు సౌ
ఖ్యముగ తెలుంగుజాతి మునుపందిన దందగరాని భాగ్యముల్
సమధికరీతి నేడకట! చావనులేక, మనంగలేక ప్రా
ణములను నిల్పియుండె, సుదినంబులరాక నిరీక్షసేయుచున్.

కలముగా ఖడ్గము నొక్కరీతి నడుపంగా జాలు మాతెల్గువా
రల తేజం బది రక్తనాళముల నారన్ లేదు; శౌర్యాంకముల్
నిలిచెన్నేటికి; లెమ్ముతల్లి! మగుడ న్నీపుత్రులన్ దిద్దుకో
వలె నుత్సాహముబోసి, వైళమ శుభంబౌ నాంధ్రరాజ్యేందిరా !



# కావ్యరచనా విశేషములు

•

= శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి =

శుభాశుభసంఘటనములు జీవితాంగణమున తలలెత్తినపుడు మానవులు సంతోషదుఃఖములను వ్యక్తీకరింతురు. మానవానుభవములను తా మనుభవించి, ఆత్మానుభవములను కావ్యకర్తలు స్వీయకృతులందు ప్రదర్శింతురు. కావున మానవప్రకృతులును, మానవవికృతులును తమ కేల యని వీ రనలేరు. అందుకేని తామే యుండు సంకుచితప్రపంచమందు, తమకై మాత్రమే నిర్దేశింపబడిన గ్రంథములనే వీరు వ్రాసికొనగలరు. సంతసింపవలసివచ్చినపుడు సంతసింపక, సంతపింపవలసి వచ్చినపుడు సంతపింపక అంతయు మిథ్య యనియు, సర్వము మాయ యనియు వచించి కిక్కురు మనక కూర్చుండునాతడు సన్న్యాసులందు నూటికి నూరు మార్కులను దెచ్చుకొని మఠాధిపతి కావచ్చును. ఒరులజోలి తన కేలని కదలని మెదలని రాయి కావచ్చును. బండరాతికి కావ్యమున తావు లేదు. కావ్యకర్త దానిపై ఆకులను, పూవులను ప్రాకించును. తన లేఖినీసంజీవిచే స్పృశించి, దానిని చక్కని చుక్కజేయును. ప్రతిభాస్పర్శచే (స్వార్థరహితుడు కావున తాను చేసినదానిని తన పాత్రము చేసెనంచు తెలుపుమ) కటికిరాతినుండి ఏయహల్యనో లేపి పరస్పర భావప్రకాశమునకు అక్కరైన చక్కని సంఘటనములను సృష్టించును. అంతియకాదు, కావ్యవసుంధరయందు మసలునంతకాలము తన ప్రత్యేకవ్యక్తిత్వము నణచియుంచి, తన గుండెలను కావ్యపాత్రముల కొట పంది ల్లొనరించును. తానే ఒక్కొక్క పాత్రమై కావ్యరంగస్థలి దోచును. వాల్మీకి వ్యాస కాళిదాసులేమి కావించిరో, కావ్యజగతియం దెట్లు తోచిరో యెఱుగరా? జడవారలయ్యు, ప్రాపంచికానుభవములను దమ హృద్వీణల మీటనిచ్చిరి కారా? తాము గోలపెట్టగలవారగుటచే సీత, ద్రౌపది, శకుంతలాదులచే గోలపెట్టించిరి. తాము కోపింపజాలుటచే భీమాదులను రెచ్చగొట్టింపజాలిరి. తాము భక్తులగుటచే హనుమదాదులచే తన్మయనృత్యము చేయింపగలిగిరి. తాము కులికిరి; ఒరులను కులికించిరి. శుభాశుభములు, సుఖదుఃఖములు తమ కేలని తమగుండియలపై గోరీలను నిర్మించిరి కారు. చింతిలి, కులికి, కనలి కావ్యజగతియందు రసస్రవంతులను పారింపజేసిరి.

నన్నడిగితిరా, కావ్యకర్త మనసును, బాలకుని మనసును ఒకేవిధమైనవందును. నూరేండ్లబూచి కొకరి గొడవయును, గోడును అక్కర లేదు. ఈతని కేడ్పు రాదు; నవ్వు రాదు. సంఘజీవితమునుండి ఈతడు 'విడాకులు' కైకొని, ఏమూలనో ముక్కుమూసికొని స్వాంతముక్తికి సంబంధించిన దీర్ఘయోచనమందు బుడుంగున మునింగియుండును. కావ్యకర్తవలె బాలకుడు రూపగుణముల నెఱుగును. రూపరహితమైన దెద్దియు నీతని చూడ్కి నాకర్షింపదు. ప్రత్యక్షగుణప్రదర్శన మొనరింపని మనుజుడు ఈతని హృదయమును స్పృశింపలేడు. తండ్రిరూపమందే ఈతడు తండ్రిగొనములను, తండ్రిని వీక్షించును. రూపమునుండి తండ్రినివ్యామించి, 'అది' యని పేర్కొనబడు 'బ్రహ్మకొలో' కలిసినంతన బాలకుడు తల్లడిల్లును. జనకుని రూపము కాని ఆతని బూడిద ప్రత్యక్షమైనపుడు ఈతని మనసెట్లుండునో యూహింపుడు. తండ్రిరొమ్మునుండి తన్నెవరో దూరముగ గిరవాటువేసి రని, తన్నొంటరిజేయుటకై ఎవరో గ్రద్దవలె తన తండ్రిని తన పాలినుండి యెగదన్నుకొనిపోయి రని (ఏమియు నూహింపజాలని పసివాడు కొడుకొనందున) ఊహించి ఈతడంగలార్చును. సుఖదుఃఖప్రకాశమునకు, పరస్పరభావవ్యక్తీకరణము

నకు భంగము వాటిలినపుడు బ్రతుకు తెల్లవారెనని బాలురును, సామాన్యులును తలపరా? విపత్తు బాలకుని గుండెపై బడినపుడు, పిడుగుదెబ్బవలన పిండియై,— పిండియే యగుటకాదు-బూదెయై, వాతూలమున నదృశ్యమగు గింజవలె నది బొగ్గును, బుగ్గియును గాదా? ఈబొగ్గులోను, బుగ్గిలోను నెర సుండు నని వర్తమాన విషాదవాతూలమున గుండియ మిక్కుటముగ చలించినను, భావికాలమున నానెరసు ప్రజ్వరిల్లి, భావిజీవితమున నవ్యజీవనద్యుతులను జలజల రాల్చు నని మనము తెలుపవచ్చును. జ్ఞానప్రదీపకళికనుండి ప్రసరించు నీ భావచ్ఛటను కసుగాయమనసు గుర్తింపజాలునా?

కావ్యకర్తను సృష్టికర్తకు బోల్చితిని. ఈపోలికలోని సృష్టికర్త సగుణబ్రహ్మగాని, నిర్గుణబ్రహ్మ కాదు సుడీ! కావ్యకర్త నిర్గుణబ్రహ్మవలె తన గ్రంథములను వ్రాయడు. జగదీశుని సృష్టిశక్తినే ఈతడలవఱుచుకొనినాడు కాని తక్కుంగలవాని యనంతగుణములకు బహుయోజనముల దూరమందే యున్నాడు. కొన్ని యంశములందు బాలకునకు సమీపమందున్నాడు. బాలకుడును, కావ్యకర్తయును, ఈశ్వరుడును కొన్నికొన్ని ముఖ్యాంశములందే పోలికలు గలిగియుండిరి.

జగదీశుడు త్రికాలవేది. ప్రస్తుతకాలమట్లే భావికాలమున నీతనికి దోచును. కావ్యకర్తదృష్టి ప్రతిభాసముజ్జ్వలమయ్యు, దివ్యమయ్యు కావ్యపాత్రమై, ఆత్మరచనమున గోచరించు టాతనికర్జమగుచు, జరుగనున్న దేమో యెఱుగనితెఱగున నాతడు ప్రవర్తించును. "కావలసి కారణాంతము లవంబును తప్పదు". అని యాతడనునుగాని "కారణాంత మిట్టి" దని తెలుపడు. వర్తమానము కడవకుండ, గాలదిగ్వలయమున కవ్వల గల యంశములు తలలెత్తుచు కనుల బడుచో వర్తమానమును (The present) వీక్షించువా రెవరు? కావ్యము జోస్యముకాదు. అది భావికాలమునుగుఱించిన గాథ కాదు; వర్తమానసమయమునకు, ప్రత్యక్షకాలమునకు సంబంధించినది. గతాంశములను తెలుపుతఱి గతమును దెచ్చి దాని నది దృష్టిసమక్షమున నిలుపును. కావ్యమున కవ్వల, రచనాకుశలుడు జోస్యము చెప్పినను, కావ్యమందు తాను నిమగ్నుడై యుండు నవసరమున తన కర్తవ్యలక్షణ మెద్దియో గుర్తించిరో ఈతడు తన క్రియను నెఱపును.

రేపు జరుగు సంఘటనము లెవ్వియో నేడే తెలిసిపోయిన, కావ్యమందు తెలుపుటకు కథన మేముండును? భావికాల మనుకూల మైన దని తెలిసికొనినపుడే మానవుడు తన పనికి పూనుకొనును. కాలవియత్తలమున ననుకూలాంశములే గోచరింపవు. ప్రతికూలాంశములుకూడ నందు దోచినగాని సత్యము పూర్ణప్రకాశము నందజాలదు. కావ్యమున నీసత్యమాత్మ ప్రతిబింబమును గాంచును. రేబవళ్లు లేకున్న దినమే లేదు. సుఖదుఃఖములును, ఆలోకాంధకారములును, అనుకూలప్రతికూలాంశములును గలిసియే పూర్ణజీవన సామగ్రి యగును. కావ్యగ్రథనమునకు అక్కరైన దీ సామగ్రియే!



# ప్రజాయుద్ధమనగా నేమి?

= డా. భోగరాజు పట్టాభి సీతారామయ్య =

ఎప్పుడు యుద్ధము జరిగినా ఆ యుద్ధములు రాజులమధ్య యుద్ధమా, ప్రజలమధ్య యుద్ధమా అనే ప్రశ్నకు బదులుచెప్పవలసిన బాధ్యత ఉభయపక్షములవారిపైనను ఉండనే యున్నది. పూర్వపుయుద్ధములు రాజులమధ్య యుద్ధములే యని చరిత్రవలన తెలియుచున్నది. కురుక్షేత్రమునందు కౌరవుల ౧౧ అక్షౌహిణీలు, పాండవుల ౭ అక్షౌహిణీలు మొత్తం ౧౮ అక్షౌహిణీలు, అనగా సుమారు ౧౯ లక్షల చతురంగబలములు పోట్లాడుకొనినపుడు రాజులు ఈ పక్షముననో, ఆ పక్షముననో చేరి కొందరు పాండవులకు, కొందరు కౌరవులకు సహాయముచేసిరి. అంగదేశప్రజలకును, పాంచాలదేశప్రజలకును ఎట్టి వైరమూ లేదు. వారు వీరి దేశముపైగాని, వీరు వారిదేశముపైగాని దాడి వెడలియుండలేదు. రాజులుకూడ యుద్ధరంగమును విడచి ఒకరి దేశమును మరొకరు కొల్లబెట్టలేదు. కాబట్టి రాజులు-రాజులు, సేనలు-సేనలు, రథగజతురగపదాతులు ఒకరినొకరు విధ్వంసంచేసికొనినపుడును యుద్ధము రణరంగమునందే చెలరేగెనుగాని ప్రజలను బాధించలేదు.

రానురాను యుద్ధములు వ్యాప్తినొంది ప్రజాసామాన్యమునుగూడ తమ యొక్క నాశనముపాలు చేయుచున్నవి. అప్పటికీ క్రిందటి ఐరోపామహాయుద్ధమువరకూగూడ యుద్ధములన్నియు క్రమశిక్షణపొందిన భటులమధ్యనే జరుగుచుండెను. ఇటీవల ౧౯౧౪ నుండి బాంబు వ్యాపకమైనపిమ్మట ప్రజాసామాన్యము, యోధులు అను విచక్షణ లేకుండ యుద్ధములు అందరను కలియబెట్టుచున్నవి. ప్రథమమున బ్రిటీషు వారు ఆగ్నేయవాయవ్యసరిహద్దులయందు అఫ్రిడీలు, చిత్రాలీలు, వజీర్లు మున్నగు తెగలవారియొక్క దాడులను అణచివేయుటకు గ్రామములకు గ్రామములు బాంబులతో నశింపుచేయుట తటస్థించినపుడు అమానుషమనియు, క్రూరమనియు ఒక తెగవారును, అనివార్యమని మరొక తెగవారును బ్రిటీషు పార్లమెంటులో చర్చించిరి. కాలక్రమమున జరుగు మార్పులు, భావపరివర్తనములు లోకమునకు విదితమే. ఈరోజున ఘోరమనుకొనినది, దుర్భరమనుకొనినది, అమానుషమనుకొనినది రేపు సర్వసామాన్యమే. ఎవరి మనస్సు చివుక్కుమనదు? అదేప్రకారముగా యిపుడు జరుగుచున్న యుద్ధము రాజ్యాంగములనుండి, సేనలనుండి, రణరంగములనుండి ప్రజాసామాన్యమునకు పాకి పల్లెపల్లెను వ్యాపించినది. అందులో ముఖ్యముగా రష్యాలో జరుగుచున్న యుద్ధము, తత్పూర్వము చీనాలో జరుగుచూవచ్చిన యుద్ధము ప్రజాయుద్ధములుగ మార్పుచెందినవి.

ఎపుడు ఆధునికశాస్త్రపరిశోధనవలన విధ్వంసకపరికరములు రోజురోజుకు మారి

నాశనమును పెంపొందించినవో అపుడు దానిని, వానినీ ఆసమయమందు నివారింప జాలని పక్షమువారి ప్రజ లోకపక్షమునను, దేశాభిమానపూరితులై, అసమర్థులైయుండియు శత్రువునకు స్థావరము చిక్కకుండ చేయువా రొకపక్షమునను తమతమ కర్తవ్యమును నెరవేర్చుచుండుట పరిపాటి అగుచున్నది. యుద్ధములు యోధులమధ్యను, రణరంగమునందును జరుగుచుండిన కాలములోగూడ ప్రజాసామాన్యముయొక్క తోడ్పాటు లేకయే జరుగజాలవు. అటుల జరిగెడివి కావు. గత ఐరోపాయుద్ధమందు ప్రతికుటుంబమును యుద్ధమునకు ఒక్కొక్క యువకుని బలియిచ్చుటయే కాక, పగలనక రాత్రియనక త్రికాలములయందును తమశక్తి కనుగుణమైన యుద్ధసేవను చేయుచునే యుండెను. ప్రతివారి మనస్సు యుద్ధమునందే లగ్నమైయుండెను. ప్రతివాని హృదయము యోధులకొరకై దుఃఖసముద్రమునం దల్లాడుచుండెను. ఇది యిట్లుండ ఈనాడు రష్యావారిపై జర్మనీవారు చేసిన దండయాత్ర ఫలితముగా జర్మనీసరిహద్దులనుండి రమారమి వేయిమైళ్లు రష్యాలోనికి త్రోసికొని వెళ్లి జర్మనీవా రాక్రమించుకొనినప్పటికీ, జర్మనువారియెదుట ఫ్రాన్సువారు ౧౯౪౦-వ సంవత్సరం జూనుమాసములో లొంగిపోయినట్లు లొంగిపోక ప్రతిబాటయందును, ప్రతి పొదయందును ప్రతిగ్రామస్థుడును, ప్రతి గ్రామస్థురాలును తనకుదొరికిన ఆయుధముతో ఆక్రమణచేసినవారిని హింసించి, చివరకు వారియొక్క ఆక్రమణను ఆపలేకపోయినపుడు తమయిండ్లు వాకిండ్లు, పొలములు పంటలు, పశువులు మున్నగు యావత్తు సౌకర్యములను నశింపుచేసి, దగ్ధపటలము చేసి, తెగ్గొట్టి అరణ్యములలోనికి పారిపోవుచున్నారు. ప్రజాయుద్ధ మనిన యిది.

ప్రజాయుద్ధములకు మరొక అర్థము కూడ చెప్పుచున్నారు. దేశముల కన్నిటికీ రష్యా పురోగామి యనియు, రాజ్యాంగవిధానము లన్నిటిలోను సోవియట్ పద్ధతి మార్గదర్శి యనియు, రాజకీయమతము లన్నిటికిని (Isms) కమ్యూనిజమే వరవడి యనియు యిండియాలోని కమ్యూనిస్టుమిత్రుల నమ్మిక. ఈ పద్ధతి హింసవలన స్థాపింపబడినది. ౭౦ లక్షలజనము నాశనము కావడముద్వారా జన్మింపగల్గినది. తదాది ఎప్పటి కప్పుడు ఎదిరి పక్షమువారిని నశింపుచేయుటవలన నిలుపబడుచున్నది. ఇట్టిదానిని మనము సర్వదేశ ప్రజల సమ్మతివలన స్థాపింపబడిన దని చెప్పుటయు, అట్టి రష్యాకు విపత్తు కల్గినది కనుక రష్యా నూతనాభ్యుదయమునకు కారణభూతులైన సర్వదేశప్రజలున్నూ రష్యాను సంరక్షించి అక్కడ జరుగుచున్న నూతన రాజకీయప్రయోగమును కాపాడుట వీరి విధి యనియు, అందుచే యిది ప్రజాయుద్ధ మనియు చెప్పగా వినియున్నాను. ఇట్టి అర్థములో యుద్ధము ప్రజాయుద్ధ మని చెప్పుట ఆశ్చర్యముగ కాన్పించుచున్నది. మొట్ట మొదటలో ప్రజలయొక్క ప్రతినిధులే ౩-వ అంతర్జాతీయసభలోనికి వెళ్లిరా యని సందేహ మగుచున్నది. వెళ్లలేదని మన మందరమును ఎరుగుదుము. రెండవది, వెళ్లకపోవుటయే కాక రష్యాల్లో జరిగిన హింసాయుత రక్తపాతసమన్విత మగు విప్లవమునకును, హిందూస్థానములో జరిగిన అహింసా సత్యములతో గూడిన విప్లవమునకును చాల తారతమ్యము గలదు. తారతమ్య

మేనా? దానికి, దీనికి చుక్కెదురు. ఒకనాటి సంభాషణలో "మనకు కావలసినది Communism minus violence— అనగా హింస మినహా కమ్యూనిజము (సమాజవాదము)" అని పండిత జవహర్లాలు నెహ్రూ చెప్పుట తటస్థించగా అది విని, దీనిపేరే గాంధీయిజమ్ (గాంధీ తత్వము) అంటారని నేను బదులు చెప్పుట తటస్థించినది. కనుక ఏదేశమున కాదేశము తమతమ పరిస్థితులకును, సంప్రదాయములకును అనురూపమగు పద్ధతులను, విధానములను, సిద్ధాంతములను ఆచరణలోనికి తెచ్చుట విధిగాని యింకను స్థిరభావము పొందని యితరదేశముల మార్పుల ననుకరించుట పాటి కాదు. కావున రష్యా యుద్ధములో ప్రవేశించినది ౧౯౪౧-వ సంవత్సరము జూను ౨౧-వ తేదీని. అందుచే ఆ తేదీనుండియు ఈ యుద్ధము ప్రజాయుద్ధమని తలంచుట సహేతుకముగ నచ్చదు.

యుద్ధము ప్రజాయుద్ధమైనపుడు ప్రజలు సావధానముగ ఎవరి పనిపాటలు వారు చేసికొనుచు విమర్శనలతో కాలము గడపుట సాధ్యముగాదు. ప్రతిమనిషియు, ఆబాలగోపాలమును "అయ్యో, దేశము యుద్ధములో మునిగిపోవుచున్నదే, ఆ యుద్ధమందు జయము పొందుటకు నేనేమి చేయుచున్నాను, నా కున్న సొమ్మును సొత్తును, నాలోనున్న శక్తిని సామర్థ్యమును, నాకుటుంబమునకు చెందియున్న పిల్లను మేకను, నాపలుకుబడిలో నున్న అర్థబలమును అంగబలమును యుద్ధముపాలు చేసి యుద్ధములో గెల్చుట నావిధి, నాసంకల్పము, నాకోర్కె, నాయత్నము" అని అనుకొనుట ప్రజాయుద్ధలక్షణము. ఇట్టి యుద్ధముయొక్క స్వభావమును ప్రజలకు వాగ్వాదమువలన రుజువు చేయ నక్కరలేదు. ఇట్టి భావతరంగములు కొళాయిలలోనుండి ప్రవహించు పరాయిదేశపు జలములు గావు. హృదయాంతరాళములనుండి పొంగిపొరలు ఊటలు. వాటియంతట అవియే పైకి రావచ్చును. ప్రజాయుద్ధ మెట్టిదో నిర్వచనము చేయుట కష్టమైనపుడు యుద్ధకాలములో ప్రజలయొక్క భావపరంపరలే అట్టి నిర్వచనమును నిర్వచింపగలవు. నిన్నటివరకు యుద్ధమును నిరోధింపవలెనని బహిరంగముగను, రహస్యముగను ప్రచారముచేసి, ప్రజలయొక్క సహాయముపొందిన మిత్రుడు ఈరోజున యుద్ధము ప్రజాయుద్ధముగా మారినదని చెప్పి ప్రజలను యుద్ధమునకు సహాయపడవలసిన దని ప్రోత్సహించినపుడు ప్రజల మానసికస్థితి ఎట్లు మారిన దని మనము పరిశోధింపవలెను? ఎట్టి మార్పును కన్పించకపోగా నిన్నటివరకును వర్షించిన రహస్యబోధనలను ఈవిధముగ అట్టిబోధకులే మార్పుచేయుటను గురించి ప్రజ లెంతయు నిరసించుట చూచుచున్నాము. ఈసందర్భములో ఇంగ్లాండు రష్యాయొడంబడికకూడ నకాలమునకే వచ్చి మన కండ్లను తెరచినది. ఇంతవరకు ఈ యుద్ధ మనిన ఉత్సాహము కనపరచని భారతీయప్రజలు, ఈయుద్ధము ప్రజాయుద్ధ మని వాదించువారితో,. ఈయుద్ధము ప్రజాయుద్ధమైనయెడల స్టాలిన్ ఒకసారియైన భారతదేశముపేరైనను ఎత్త డేల యనియు, చివరకు జూలై 3 వ తేదీని అతడు గావించిన సంభాషణలో ఈయుద్ధము జాతీయయుద్ధమని వక్కాణించియుండె ననియు, వీనిని గమనించిన యెడల ఇది ఎట్లు ప్రజాయుద్ధ మగుననియు ప్రశ్నించుచున్నారు.

ఇంతవరకును వారు స్టాలినుచేయని విషయములను గురించిన సందేహములే వెలిబుచ్చుచున్నారు. కాని బ్రిటనుతో మొన్న రష్యా ప్రతినిధి మాలటావ్ గావించిన సంధి వలన రష్యా యుద్ధానంతర ఏర్పాట్ల సమయమున మిత్రమండలి దేశములయొక్క అంతరంగిక విషయములలో ఎంతమాత్రమును జోక్యము కలిగించుకొనననని అభయ మిచ్చినది. భారత దేశము బ్రిటిషుసామ్రాజ్యము యొక్క అంతరంగికవిషయములలో నొకటి యని సువిదితమేకదా! అట్లాంటిక్ ఛార్టరును అనువర్తింపజేయువిషయములో చర్చిలు ప్రధాని నిర్వచించిన సూత్రమును రష్యా పూర్తిగ అంగీకరించుటవలన రష్యాప్రభుత్వము భారత దేశము బ్రిటిషుసామ్రాజ్యములో భాగముమాత్రమేకాని, మిత్రమండలి దేశములతో సమాన స్వాతంత్ర్యము ననుభవించు దేశము గాదని పూర్తిగా సుస్పష్టముగా అంగీకరించినది. అందువలన భారత దేశము రష్యా దేశదృష్టిలో బ్రిటిషు సామ్రాజ్యముయొక్క అంతరంగికవిషయమే. అట్లనే కానిండు. రష్యా భారత దేశముతరపున జోక్యము కలిగించుకొనదు. అందువలన మన కెంతమాత్రమును విచారము లేదు. అట్లు జోక్యము కలిగించుకొనవలె నని మన మెన్నడును కోరనులేదు. కాని సత్యమును గమనించినచో, ఈ సంధిలో యిండియావిషయము మినహాయింపబడుటయేకాక, ఇండియా యుద్ధానంతర ఒడంబడికలనుండి వెలివేయబడినట్లు స్పష్టముగ అర్థమగుచున్నది. ఇదియంతయు గమనించినపిమ్మటగూడ ఏ బుద్ధిమంతుడైనను ఈయుద్ధము ప్రజాయుద్ధమే యని వాదింప బూనినచో, ఆ 'ప్రజాయుద్ధము'న కర్థము, భారతదేశప్రజలు మినహా, యితర ప్రపంచప్రజాయుద్ధము అని యైయున్నది.

ఇండియా పరాధీనమైనంతవరకును యిండియాప్రజలకు ప్రజాయుద్ధ మనుమాట గోచరము కాదు. హృదయస్థ మంతకంటెను కాదు. వారి నది కార్యశూరత్వమునకు పురికొల్పజాలదు. ప్రజలను యుద్ధమునుగూర్చి ప్రవృత్తిమార్గములో బెట్టజాలదు. ఇండియా స్వతంత్ర దేశమైనపుడు ఇండియాయొక్క స్వాతంత్ర్యమును ఎట్టి అహింసాతత్వమువలన సంపాదింపగలిగినదో అట్టి అహింసవలననే అన్ని దేశముల స్వాతంత్ర్యమును కాపాడగలిగి యుండును. అపుడు యిండియా యితరదేశములతో చేసికొను ఒడంబడికలన్నియు అహింసాసత్యము లనెడి పునాదులపై ఆధారపడియుండును. అట్టి యొడంబడికలను సమర్థించుటకు సాధనము ప్రాణనష్టమును కలిగించు యుద్ధవిధానముపై ఆధారపడియుండదు. ఇట్లు యిండియాకు స్వాతంత్ర్యము లభించినతర్వాత తన స్వాతంత్ర్యమును, తోటి స్వతంత్ర దేశముల స్వాతంత్ర్యములను కాపాడుటకు జరుపబడు అహింసాయుద్ధమే ప్రజాయుద్ధము.

---

# ప్రకటన

ఈక్రిందకనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1942 సం. జూలై నెల) తో ఇది వరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నవి. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 28-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1942 సం. ఆగస్టు 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. కావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము

B 4, H 29, 31, 33, 34, 36, 62, J 6, 7. L 3, N 5, P 6, 7, 8, 9, 10, 11, 16, R 12, 13, 14, 15, S 40, 42, 43, 53, 58, V 22, 23, Y 5.



# సందేహసమాధానములు



= శ్రీ కుంటిమద్ది శేషశర్మ =

శృంగారనైషధములో కొన్ని సందేహము లని శ్రీమండ నరసింహముగారు జూన్ నెల భారతిలో ప్రకటించినారు. నాయూహకు దోచిన సమాధానము లివి. సహృదయులు పరికింతురుగాక.

## ౧. ఇది ఎట్లు పొసగును ?

"లలన లజ్జాసరిద్దుర్గలంఘనమున
రాజుహృదయంబు జొచ్చిన క్రమము జూడ
తరుణిమారంభపరికల్పితంబులైన
వలుదకుచకుంభముల ప్రభావమున జూవె."

ఇందు పద్యముప్రకారము వీరికేమియు సందేహములేక శాస్త్రిగారి వివరణ చూడడముతో చిక్కొచ్చినట్టున్నది. పద్యములో వా రూహించినట్టుల లజ్జాసరిత్తరణకర్తృత్వము దమయంతికుండ, వివరణమున "నలుడు లజ్జను దాటి, దమయంతియందు వలపు వహించెనని కనబడుచున్న"దని తత్కర్తృత్వము నలుని కని తోచుచున్నదని సందేహించుచున్నారు.

శాస్త్రిగారి వ్యాఖ్య.— దమయంతీ కుచకుంభ విభ్రమమును విని, నలుడు లజ్జను మాని, ఆమెయందు వలపు వహించెనని భావము.

ఈవ్యాఖ్య చూచుటతో నరసింహముగారికి "శాస్త్రిగారు 'మూలమునందలి లజ్జాసరిద్దుర్గతరణకర్త నలు'డని యుద్దేశించి"రని తోచినది. కాని యది పొరబాటు. శాస్త్రిగారి కట్టియుద్దేశము లేదు. పైపద్యమునకు వాస్తవికభావమును వారు ప్రకటించిరి. "దమయంతీకుచకుంభవిభ్రమశ్రవణాత్ నలః త్రపాం విహాయ తస్యామాసక్తచిత్తోభూదిత్యర్థః. ఏతేన మనస్సంగ ఉక్తః" అని మల్లినాథసూరి. కుచకుంభవిభ్రమమును విని, నలుడు సిగ్గువీడి, దమయంతీధ్యానతత్పరుడయ్యె ననుభావమును, కవి ధ్యాయమానదమయంతియే "తరుణిమారంభపరికల్పితంబులైన వలుదకుచములు" తెప్పగా లజ్జాసరిత్తను జలదుర్గము లంఘించి, రాజుహృదయమును స్వాధీనపరచుకొన్నట్లు చమత్కరించి వాచ్యవిధయా తెల్పెను. కాన భావ, వాచ్యములకు లేని వైక్యమాపాదించి, "దుర్గమును స్వాధీనము చేసికొననెంచినవారు దమయంతియా, నలుడా" అని సంశయింప నవసరము లేదు.

ఇక "లజ్జాప్రవాహము దమయంతి నాశ్రయించినదా, రాజునా? రాజు నాశ్రయించిన దనుట యుక్తము కాదు" అనిరి. ఏలనో? కారణము నిరూపించలేదు. లజ్జయను వ్యభిచారిభావము స్త్రీలకే యని నియమమా? లేక అట్టి పరాక్రమశాలి సిగ్గిలుట తగదనియా? పిరికి కండలేని బిరుదు ఖగడు ప్రద్యుమ్నుడు—

# ప్రకటన

ఈక్రిందకనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1942 సం. జూలై నెల) తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 28-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1942 సం. ఆగస్టు 10-వ తేదిని ర్పా 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. కావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము

B 4, H 29, 31, 33, 34, 36, 62, J 6, 7. L 3, N 5, P 6, 7, 8, 9, 10, 11, 16, R 12, 13, 14, 15, S 40, 42, 43, 53, 58, V 22, 23, Y 5.

"స్తనతుంగతా ప్తయే" అని మూలము. స్తనౌన్నత్యముపై బడి చచ్చు మన శ్రీనాథుడు మూలమున లేని యుపమానమును కుచముల కంటించి లేనిచిక్కు తెచ్చిపెట్టినాడు.

ఉన్నదానికి ఏదేనొక సమాధానము చెప్పక తప్పదు. కుచకుంభములన్నపుడు కుంభపదము కరికుంభ వాచకమన్న విరోధము పరిహృతము.

### ౪. పూర్వాపర సందర్భము తప్పుట

"పాకశాసనుండు పావకుండు పరేతపతి పాశహస్తుండు పంచముండనైన నేను నియ్యేవ్వురముఁ బాండవులు పాంచాలినింబోలె."

ఇందు నలుడు తన యనంతర భావులైన పాండవుల ప్రస్తావించుట తగదు–ఇది కాలవిరోధము అనిరి.

ఉత్తరహరివంశమున కృష్ణుని స్తుతించునపుడు కల్క్యవతారమునుగూడ కల్పి స్తుతించినారని శ్రీఅనంతకృష్ణశర్మగారుచేసిన యిట్టి యాక్షేపణకు సమాధానమిచ్చుచు నొక విమర్శకులు (వారిపేరు, పుస్తకము మరచితిని. అదొకప్పుడు విద్వత్పరీక్షకుగూడ పెట్టియుండిరి) "ఇవి దేశచరిత్రలు గావు పౌర్వాపర్యముల నిరూపించుటకు. ఇందు రసాదులు ప్రధానములు. కావున పురాణములవలె నత్యంతము సంఘర్షణ సేయక రసంబులు మాత్రము గ్రోలునది" యనిరి.

విశ్వగుణాదర్శమందు- భావి సముద్రమథనమున కన్న మున్నే దుర్వాసశాపనిదానమైన యైరావతము గలదు. అ దెక్కడిది? కాన వారు వీ రసనేల, ఎల్లరు రసతత్పరులై యిట్టి చిల్లరవిషయములు పాటించుట లేదు.

కొందరుగూడ సదన్నశతాత్ములకు "విశ్వమనాది 'ధాతా యథాపూర్వ ముపాసృజత్' తొలికల్పంబుల చరిత్రలు మలికల్పంబులవాటి కుదాహృతులు పొం" దనిరి కొందరు ధూర్తులు.

### ౫. 'ఐదు పదిసేయుట'

"నవసమాగమవేళ నయ్యవసరమున
నువిదలజ్జాభరంబున కోహటించి
యైదుపదిసేసె నలరాజునంతవాడు
నరయ నెవ్వానిసొమ్ము జయాపజయములు."

ఇందు శాస్త్రిగారి వ్యాఖ్యకన్న నరసింహముగారి నమస్కారమే బాగున్నది. కాని ఐదుగానున్న వాటినే పదిసేసెనని యన్న మూలమునకు—తొలియైదు వ్రేళ్లను వేరు ఐదువ్రేళ్లతో చేర్చి పది యని అర్థము చెప్పుట అసంతుదముగ నున్నది.

"ముజ్జగమ్ము లుద్దండతె నొక్క తుంటవిలుఁ దాలిచి అంటినగందుతూపులఁ జెండిన" జోదు మన్మథుడు తన పంచబాణములను ప్రయోగించియు, దమయంతిలజ్జను జయింపలేక విసిగి, బాణముల నేవగించి నడిమికి విరచివైచె ననుభావముతో నైదుపదిసేసెనని యన్న నెట్లుండునో రసికులు గమనింతురుగాక.

"ఇది పదిలంబుగా నడుఁగ
   కేనపు డక్కడ కోర్కి దాచి వ
ట్టి దొరతనంపునీటు ప్రక
   టించితి. పాపపు లజ్జ నన్ను నో
రదిమె. అనాదరంపు తెఱ
   గై యది హంసికి దోచెనేమొ ని
ల్వద మఱి యించుకైన గరు
   వల్ చవిగానికథ ల్వినింతురే."

అని విచారింపలేదా? కాన లజ్జ రాజు నాశ్రయించినదే. అట్టి లజ్జావేష్టితంబైన రాజుమనస్సునందు ప్రవేశించు టెట్లు సాధ్యమని తర్కించి, వలుద కుచముల ప్రభావమున నని సమాధానపరచినాడు. దీన— "లజ్జ దమయంతి నాశ్రయించినపుడు, లజ్జ యను అగడ్తనడుమ దుర్గమందు రాజహృదయము గలదు గదా— అది ఎట్లు పొసగును" అను శంక నిరవకాశము.

## ౨. ఔచిత్యలోపము కాదా?

"పత్రములమీఁద మూఁగిన భ్రమరకులము
   హరవిసర్జనజనిత దుర్యశముఁ బోలె
గమియవచ్చిన గేదంగి కన్నె పువ్వుఁ
   గౌతుకము పల్లవింపంగఁ గాంచె విభుఁడు."

"భగవంతునివలననే తిరస్కరింపబడి, అపకీర్తిని తలపై దాల్చిన వస్తువును యోగ్యులు అసహ్యముతో చూచెదరుగాని సంతోషముతో జూడరు గదా! మొగిలి ఈశ్వరునిచే దిరస్కరింపబడి యపకీర్తి దెచ్చుకొన్నది. అట్టి వస్తువును "ఒకళ్లొకళ్లకై యెదురుగ వచ్చి వచ్చి, మదగజరాజకుంభముల మచ్చరికించుకుచద్వయంబునన్ ఒత్తుచురమ శంకగూడ లేక, ప్రిదిలిన నీవి కేల సవరించు తలోదరి నోర్తుగాంచి, లోగదిరిన పాపభీతి మెయి కన్నులు మోడ్చిన" యోగ్యుడు నలుడు సంతోషముతో జూడవచ్చునా? ఔచితికి లోపము గాదా? అసహ్యముతో జూచెననుట పాత్రోచితముగాదా యని యిచటి శంక.

వట్టి గేదంగినే హర్షమున జూచియుండిన, శంక కవకాశముండెడిది. ఈ మొగిలి మూర్తిమంతమైన యపకీర్తితో పొసగుచున్నది. విరహియైన నలునికి, వియోగిబాధాకర మదనకరక్రకచమైన కేతకి మషీకృత్తిపరిభూతమగుట సంతసము గాదా. కాన కౌతుకము పల్లవించుటకు కారణము కేతకి గాదు, కేతకీపరిభవము. దాన నౌచితీభంగభీతి యనవసరము.

## 3. అలంకారములో లోపము

"దమయంతీస్తనకుంభవిభ్రమము బొం
   దం గోరుటన్ ధూమపా
నము గావించు చధోముఖంబు లగునా
   నా కుంభముల్ వోలె ధూ
పములన్ దోహద మాచరింపగ గడుం
   బక్వంబులై యున్న దా
డిమముల్ సూచి నృపాలకుండు మది బా
   టించెన్ మహౌత్సుక్యమున్."

ఇందు దోహదధూపితదాడిమములు దమయంతీస్తనవిభ్రమంబు బడయుంగోరి తపించు కుంభములని నలుని యుత్ప్రేక్ష. వీరిశంక పరికింతము. "ఒకవస్తువుతో నొకటినిపోల్చి, అద్దానితో మఱియొకదానికి సామ్యము చూపుట తగదు. యథా—వాని కనుదమ్ములు పొడవై విశాలముగ నుండు తామరరేకులనుబోలు చేపలవలె నున్నవి అనుట తగదు. తామరరేకులవలెనో, లేక చేపలవలెనో యున్నవనుట యుక్తము" అనిరి. కావచ్చును. కానీ, కుండలబోలు దానిమ్మపండ్లవలె దమయంతీస్తనము లున్నవని కవి యనలేదు. కవి వర్ణించిన యుత్ప్రేక్షాచమత్కారధోరణి కది వీరు గల్పించిన ఫలితార్థము. అందు నలంకారమున్ననేమి, దుష్టమైననేమి, లేకున్ననేమి? రచననుబట్టి అలంకారగుణదోషములు మారుచుండును. మన మూహించి రచించిన ఫలితార్థమందలి దోషమునకు కవి బాధ్యుడా? కాన రచనయం దేలాటిదోషము లేదు.

కాని ప్రస్తావవశమున వారు చేయకున్నను చేయదగిన శంకయిందు ఒండు గలదు. తొలుత 'కుచకుంభము'లని కుంభములను కుచములకు ఉపమానముగ చెప్పి, అట్టి కుంభోపమితకుచములతో సాటి బొందుటకు కుంభములు తపించుచున్న వన్న విరుద్ధముగదా. "దమయంతీ

# 'గబ్బిలము'

[కావ్యపరిశీలన]





శ్రీ మూలా పేరన్నశాస్త్రి

సంస్కృత మేఘసందేశఫక్కిలో తెనుగున మొట్టమొదట శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారొక ఖండికను మున్ను వ్రాసియుండిరి. మేఘసందేశమువలె నదియును నొక సందేశమే. ఖండిక పేరు 'శశిదూతము'. విరహాసంతప్తహృదయుడగు యక్షుడు పంపినట్టి సందేశమునే యొక ప్రియుడు నిండు వెన్నెలలో చంద్రశాలపై "రమణి యొకింత కోపన పరాఙ్ముఖియైనది దాని చెప్పకో నమరిన దూత"నని శశిని ప్రాథేయపడి తన వేదననంతయు వెల్లడిచేయును. కాళిదాసుని ప్రతిభావ్యుత్పత్తులకన్న నధికముగా గన్పట్టునట్లు వ్రాయబడిన దిది యనవచ్చును.

విశ్వనాథ కాళిదాసులు కైకొని మెఱుగువెట్టినది విప్రలంభశృంగారము. శృంగారమే సహృదయ హృదయంగమ మని యొక విరహివిరహవేదనను చిత్రించినారు కవులిద్దరును.

ఇట్లే మేఘసందేశ, శశిదూతముల చాయలలో రచింపబడిన మరొక్క కావ్యము శ్రీ జాషువాకవిగారి 'గబ్బిలము'. కాని ఆ రెంటికిని, దీనికిని జాల వ్యత్యాసము ప్రధానరసపరిగ్రహణముననే పొడగట్టును. ఇందలి రస మానందసంధాయకమగు శృంగారము కాదు. కవిగారు వెలిబుచ్చినట్లు 'తుకతుకనుడుకు నశ్రుసందేశము'తో కూడుకొన్న కరుణరసము. సందేశము నంపువాడు విరహానలదగ్ధులగు యక్షప్రియులలో నొకడును గాడు. క్షుధానలపీడితుడగు దీనహరిజనుడు.

"నాదు కన్నీటికథ సమన్వయము సేయ
నార్ద్రహృదయంబుగూడ కొంతవసరంబు"

అని యితడు వాపోవును. కులీనులగు రాజులకువలె హంసములు, చిలుకలు మున్నగు నుత్తమపక్షిదూత లితనికి చిక్కుటసంభవము కావున నిట్టిదుల జీర్ణకుటీరములలో నిరంతరము దర్శనమిచ్చు గబ్బిలము నితనికి సందేశహారిగా కవి పరిగ్రహించెను. ఆ హరిజనుడు "పూపవయస్సులో పలనపోయిన చక్కని తెల్గుకైతకున్ బ్రాపక మిచ్చినట్టి రఘునాథనృపాలకు డేలియున్న

కూడ దుఃఖమున ముంపదలచినవాడు కాడు. అతడు త్రాగుట కున్న దొక్క గంజిమాత్రమే. ఈగంజి త్రాగుటకే పెండ్లియాడి పిల్లలను కనవలయునా యని యాతని వివేచన. నివాస గృహము పూరిగుడిసె. అందునను చివికి జీర్ణమైనది. జీవించుట కూత చెప్పులుకుట్టు పని. గుడిసెలో నాముదపుదీపము. దివ్యదీపము లెచ్చటనుండి వచ్చును? వచ్చుట కాతడు నిరుపేదగదా!

ఈ హరిజనుని కష్టపరంపర లభవునకు విన్నవించుకొనుటయే యిందు వర్ణితము. "ఏనుగునకు మదముహోలి యెనక మెనగిన" 'క్రొంజీకటులలో' విహరణముజేయవచ్చిన గబ్బిలమునే దూతగా కవి తీసుకొని యా మార్గమున నంతేవాసిదయనీయ గాథను వినిపించినాడు. విరహాతురులకు దూతలుగా శరన్మేఘములు, హంసములు, శశినక్షత్రములు కాని, క్షుధాతురున కివి యెక్కడ? గూబలు, గబ్బిలములవంటివే యాతని దౌత్యమునకు దోడుపడజాలినవి. జీర్ణగృహమున సాక్షాత్కరించిన గబ్బిలమును జూచి

"నాగృహంబున వెదకు చున్నా వదేమి
దొరక దిచ్చట నానందకిరణలవము"

అని తన దుస్థితికి వగచి యిచట కేల వచ్చితి వని ప్రశ్నించినాడు. గబ్బిల మిచట దౌత్యమునకు గడంగిన దనుకొనవచ్చును. దాని క్షేమసమాచారములనుగూర్చి సంప్రశ్నించి తన గోడు సర్వము శివున కెరింగింప కైలాసమునకు బొమ్మని హరిజనుడు వేడుకొనును. "అంటరానిహా దున్న నిషిద్ధగేహము", "హృదయము లేని లోకము సుమీ" యను మాటలు వాని దీనతా సూచకములు.

"సనాతనధర్మధేనువుల్ పితికిన పాలు పేదకు లభింపవు." హైందవపూజారు లంత సులభముగ లభింప నిచ్చువారా? ఇట్లని పుణ్యభారత దేశమున తమ తోడి హిందువుడగు హరిజనుని, అగ్రజాతులమన్న అధికారగర్వముచే నన్యాయమనక అనరాని వినరాని కనరాని పాట్లు పెట్టి గాలిసోకిన పామువలె బుసకొట్టుచు నతిలుబ్ధులై యుక్తులు పన్ని కసరుచు నొక్కొక్కతరి కొట్టుచు మానవసహజ మగు ప్రేమ మాలి మహాభోగమత్తులై మలమల మాడుచున్నను మనసిచ్చి మాటాడక చూడక కుక్కల కన్న హేయముగ దలంచి ప్రవర్తించువారి దుశ్చేష్టలను తూర్పార నెత్తిపోసిన కవికి జేజేలు.

ఈ కావ్యమునందు ప్రతిచోటను హరిజనుని యత్యంత దీనచరిత్రమే ప్రతిబింబించు చుండును. పాఠకుల మనస్సు లెంత శిలాకఠినములైనను ఈ కావ్యమును చదువుచున్నప్పుడు కరగి చలింపక మానవు.

దీని కంతకును శక్తివంత మగు శైలియే కారణము. 'పిరదౌసి' లో కన్న, 'స్వప్నకథ'లోకన్న 'గబ్బిలము'న జాషువా కవిశైలి మనస్సును చూరకొనినది. ఆ వర్ణనలు, ఆ పూర్వప్రదేశగాథాసముదాహరణములు చదువునప్పు డాయాచోటులలో గబ్బిలముతో దానును హరిజనుని 'అశ్రుసందేశము'ను మోసికొనిపోవుచు దిలకించు

చున్నటులే పాఠకునకు తోచును. తంజాపురీమండలమునుండి కైలాసగిరిశిఖరము దనుక వర్ణింపబడిన మధ్యేమార్గప్రదేశములు, ప్రదేశగాథలు చక్కనివి.

తంజాపురీమండలములోని హరిజనుని నాయకునిగా గ్రహించుట భారతభూమీసీమలను కవివర్ణించి ధన్యు డగుటకే కాబోలు. గబ్బిలమునకు తిన్నగా త్రోవచూపక వక్రముగాజూపుట కదియే కారణము. "కైలాసమునకు నాపన్నినత్రోవ కొంత వక్రతకు గురియైన" దని కవియే తెలుపుట యారయ నగును. ఇది భూగోళపరిశీలనమున దోషమే యైనను సత్యోత్తమ భావనాసముద్రేకమున దోష మన బనిలేదు.

ద్రావిడదేశవర్ణనము నించుకంతయు త్రిలింగదేశవర్ణనము నధికము గావించుటలో "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యన్న లోకోక్తి కవిపట్ల గ్రాహ్యము.

కవి జాతీయత గలవాడు. కవితాశైలి నిరంకుశ మైనది, మాధురీసహిత మైనది. సముత్తము భావోద్రిక్తతను గైకొన్న సంగతి సహృదయాదరణీయదయనీయ హరిజనుని విషాదచారిత్రగాథ. అన్నిటికన్నియు గల యసమానసుధాఖండిక 'గబ్బిలము'. 'గబ్బిలము' చూడని వర్ణనలే లేవు, అవలంబింపని క్రొత్తపోకడలే లేవు, వెలువరింపని వినూత్న భావములే లేవు. అన్నిటి కన్ని బంగరుశలాకలు.



# 'రామన్ ఎఫెక్టు'

= శ్రీ దువ్వూరి అచ్యుత అనంత సత్యనారాయణరావు =

మనకు సూర్యునివద్దనుండి వచ్చే కాంతి తెల్లరంగు కలిగి ఉంటుంది. కాని దానినే ఒక గాజుపట్టకము (Prism) లోనుండి చూస్తే ఏడురంగులు అగపడతాయి. అవి ఏవంటే–ఊదా, నేరేడుపండురంగు, ఆకుపచ్చ, నీలి, పసుపుపచ్చ, నారింజపండురంగు ఎరుపు వరుసని ఉంటాయి. ఇన్ని రంగులు ఎందుచేత అగపడుతున్నాయి అనే విషయం న్యూటనుశాస్త్రజ్ఞుడు మొట్టమొదట ఊహించేడు. మనకు వచ్చే తెల్లనికాంతిలో ఈ ఏడురంగులూ స్వతహాగా ఉన్నాయనీ, ఈ ఏడురంగులూ కలిసినప్పుడు తెల్లగా అగుపడుతుందనీ, గాజుపట్టకానికి ఏడురంగులను విడదీసే ధర్మం ఉన్నదనీ అతడు చెప్పేడు. ఒక గుండ్రని అట్టముక్కమీద ఏడుభాగాలు గుర్తుపెట్టి వానికి పై ఏడు రంగులూ వరుసగా వేసి, ఆ అట్టను జోరుగా త్రిప్పితే అది తెల్లగా అగపడుతుంది. ఈ ఏడురంగులూ అతికొద్దికాలంలో కంటిమీద పడి మిశ్రమమగుతుండడమువల్ల తెల్లరంగగపడుతూంది. కనుక తెల్లరంగన్నది ఏడు రంగుల కలయికచే కలిగిన భావమే నని దీనివలన తెలుస్తూంది.

పైన గాజుపట్టకములోనుండి తెల్లకాంతిని చూసినప్పుడు ఏడురంగు లగపడతాయని చెప్పేను. కాని అది నిజానికి కొంచెందూరం. ఒక్క ఏడురంగులేనా నిజంగా అగపడుతున్నవి? కాదు. ఆకుపచ్చ, నీలి చూస్తున్నా మనుకోండి. సరిగ్గా కొంతమేర ఆకుపచ్చ ఉండి, ఒక్కమారు నీలిలోకి మారిపోతూందా? లేదే! ఆకుపచ్చ క్రమేపీ నీలిలోకి మారుతూంది. అంటే రెండింటికీ మధ్యస్థమైన రంగులు, అనగా ఆకుపచ్చ ఎక్కువ, నీలి తక్కువ కలిసిన మిశ్రమపురంగు, ఆకుపచ్చ, నీలి సమానంగా కలిసిన రంగు, ఆకుపచ్చ తక్కువ, నీలి ఎక్కువ కలిసినరంగు– ఇలాగ ఆకుపచ్చ, నీలి వేరువేరు పాళ్లలో కలిసినవి ఎన్నో రంగులుంటాయి. అలాగే పైన చెప్పిన ప్రతి రెండు రంగుల మధ్య ఎన్నోరంగు లుంటాయి. మనకు ప్రాముఖ్యంగా కనబడేవి ఏడు రంగులు. అందుచేత తెల్లకాంతి ఏడు రంగుల కాంతుల మిశ్రమం అంటాము. కాని నిజానికి చూస్తే తెల్లకాంతి ఎన్నో లక్షల రంగుల కాంతికిరణాల మిశ్రమం. ఇన్ని లక్షల రంగులూ ఊదానుండి ఎరుపులోనికి పైచెప్పిన వరుసని క్రమేపీ మారుతాయి.

## కాంతియొక్క ప్రకృతి :

కాంతి ఒకచోటనుండి మరోచోటికి వెళ్లడం చూస్తున్నాము. సూర్యునినుండి మనవద్దకు కాంతి ప్రయాణంచేసి వస్తూంది. ఇలా రావడంలో సెకండుకు ౧౮,౬౦,౦౦ మైళ్లచొప్పున ప్రయాణంచేస్తూంది. అయితే కాంతి అన్న దేమిటి, అది ఏలాగు ప్రసరిస్తూంది అన్న విషయము చాలాకాలమువరకు అగోచరంగా ఉండేది. క్రిందటి శతాబ్దంలోనే కాంతియొక్క గుణాలను కనుకొన్నారు. కాంతికిరణం అంటే అలల (Waves) మూలంగా ప్రయాణం చేస్తున్న ఒక ప్రకంపనం (Vibration) అని తెలుసుకొన్నారు. ప్రకంపనం అంటే ఊయలచలనంవంటి కదలిక. కాంతి అలల రూపంగా ప్రయాణం చేస్తున్నప్పుడు, ఆ అల ఒక ప్రత్యేకపు కొలత కల్గి ఉంటుంది. అంతేకాని ఎంత పడితే అంత ఉండలేదు. అందుచేత ఆపరిమాణాన్ని 'అల పొడవు' అందాము. దానినే ఇంగ్లీషున 'Wave-length' అంటారు. కాంతియొక్క అలపొడవుకూ రంగుకూ సంబంధముంది. రంగు ఊదానుండి ఎరుపులోనికి మారుతున్నప్పుడు అలపొడవు క్రమేపీ హెచ్చుతుంది. కనుక వేరువేరరంగుల కాంతులంటే వేరు వేరు అలపొడవుల కాంతు లన్నమాట. కాంతియొక్క అలపొడవు చాలా చిన్నది కనుక దీనిని సెంటిమీటర్లలో చెప్పడం సుళువు

కాదు. దీనిని చెప్పడానికి ఒక సెంటిమీటర్లో పదికోటియవ భాగాన్ని యూనిట్ (Unit) గా తీసికొన్నారు. దానిని ఒక ఆంగ్‌స్ట్రాం యూనిట్ (Angstrom unit) అంటారు. ఊదారంగు కాంతి అలపొడవు దరిదాపు ౪౦౦౦ ఆ. యూ., ఎరుపురంగు కాంతి అలపొడవు సుమారు ౭౦౦౦ ఆ· యూ. ఉంటాయి. తక్కిన రంగుల కాంతుల అల పొడవులు ఈ మధ్యగా ఉంటాయి. మామూలుగా మనం తెల్లకాంతి అన్నదాంట్లో ఎన్నో రంగుల కాంతు లున్నాయి. అంటే ౪౦౦౦ - ౭౦౦౦ ఆ. యూ.ల మధ్యగా ఉండేటటువంటి ఎన్నో అలపొడవులు కల కాంతు లున్నా యన్నమాట.

కాంతి అలపొడవు మారినప్పుడు రంగేకాక కాంతి యొక్క శక్తి (Energy) కూడా మారుతుంది. అల పొడవు హెచ్చుతూంటే శక్తి తగ్గుతూఉంటుంది. కనుక రంగు ఊదానుండి ఎరుపులోనికి క్రమేపీ మారు తున్నప్పుడు, అనగా అలపొడవు క్రమేపీ హెచ్చు తున్నప్పుడు శక్తి క్రమేపీ తగ్గుతుంది. కనుక ఎరుపు రంగుకాంతికన్న ఊదారంగుకాంతికి శక్తి ఎక్కువ, అలపొడవు తక్కువ.

ఇప్పుడు మనం ౫౮౯౩ ఆ. యూ. అల పొడవు గల-కాంతి అన్నా మంటే అది ఒక ప్రత్యేకపురంగు, ప్రత్యేకపు శక్తిగల కాంతి అన్నమాట. ఇంక ఏ ఇతర రంగుకాంతికీ అదే అలపొడవు ఉండదు. కనుక ఒకే అలపొడవు గల కాంతి అంటే ఒకే రంగు కల కాంతి (Monochromatic light) అన్నమాట.

కాంతి చిందబడుట :

మడ్డిగా నున్న ఒక ద్రవపదార్థంలోనుంచి కాంతి కిరణాలు వెళ్లుతున్నా యనుకొందాము— పడమటి నుంచి తూర్పుదిక్కుగా. మనం పడమర తూర్పు దిక్కుగా ఆద్రవపదార్థంలోకి చూస్తే కాంతి అగ పడడం సహజమే. కాని దక్షిణోత్తర దిక్కుగా, అంటే కాంతిని పంపిన మార్గానికి లంబదిశ (Perpendicular)గా చూసినాకూడా కొద్దికాంతి, అంటే చాలా తక్కువ తీక్ష్ణత (intensity) కల కాంతి అగపడుతుంది. దీనివల్ల ఏమి తెలుస్తూంది? కిరణాలు ఒక మార్గంగుండా వెళ్లుతున్నప్పుడు ఆ మార్గంలోనే కాంతి అగపడడం సహజం. కాని ప్రక్కలనికూడా కాంతి అగపడుతూం దంటే ఆప్రక్కలకుకూడా కిర ణాలు వస్తున్నా యన్నమాట. ద్రవపదార్థం మడ్డిగా ఉందంటే అందులో ఏవో నలక లున్నాయి కదూ. కాంతికిరణాలు ఈనలకలతో ఢీకొంటున్నాయి. అప్పు డా కిరణాలు వాటి అసలుదారినే కాక తక్కిన అన్ని వైపులా చిందబడుతున్నాయి. అంటే చాలాకాంతి దానిదారంట అది వెళ్లిపోతూంది. కొంత కాంతి మటుకు అన్నివైపులా చిందబడుతూంది. అందుచేత మనం ఉత్తర దక్షిణాలుగా చూచినప్పుడు కొద్ది తీక్ష్ణత గల కాంతిమాత్రమే అగపడుతూంది. దీనిని తెలుగులో 'కాంతి చిందబడుట' అనీ, ఇంగ్లీషులో Scattering of light అనీ అంటారు. అయితే ఇటువంటిది మడ్డిలో నిండిన ద్రవపదార్థంలో జరగడమే ముందు కనుకొన్నారు. కాని తరు వాత శుభ్రమైన, నిర్మలమైన ద్రవపదార్థంలోనూ, వాయుపదార్థంలోనూ, పారదర్శక ఘనపదార్థం (Transparent solid) లోనూ కూడా ఇట్లే జరుగుతుందని రాలే అను పండితుడు కనుకొని చెప్పేడు. అయితే ఇదివరకు కాంతినలకలతో ఢీకొని చిందబడ్డది నిర్మలమైన ద్రవంలో ఎలాగు చిందబడు తుంది? ప్రతిపదార్థం చిన్నచిన్న అణువుల (Molecules)సమూహం కదా. ఈ ద్రవంయొక్క అణువులు కాంతితో ఢీకొని, కాంతిని అన్నివైపులా చిందు తాయి. అలాగే ఘనపదార్థంలోనూ, వాయుపదార్థం లోనూకూడా జరుగుతుంది.

చిందబడిన కాంతియొక్క నీలి :

పదార్థములోని అణువులచే కాంతి చిందబడుట కొన్ని సూత్రాల ననుసరించి జరుగుతుంది. మొదటి సూత్ర మేమంటే-కాంతి అన్నివైపులా చిందబడుతుంది. కాని చిందబడిన కాంతియొక్క తీక్ష్ణత కాంతి వెళుతున్న అసలుదిక్కులో చాలా తక్కువ ఉంటుంది, లంబదిశలో అధికతమం (Maximum)గా ఉంటుంది. లంబదిశ నుండి అసలుదిక్కుకు తిరుగుతున్నప్పుడు తీక్ష్ణత తగ్గి

పోతుంది. కనుకనే మనం చిందబడిన కాంతికోసం లంబదిశలో చూస్తాము. రెండవ ముఖ్యమైన సూత్రమేమంటే, తక్కువ అలపొడవుగల కాంతి ఎక్కువగా చిందబడుతుంది; ఎక్కువ అలపొడవు గల కాంతి తక్కువగా చిందబడుతుంది. తెల్లకాంతికిరణాలు నీటిలోనుంచి వెళ్లుతున్నా యనుకోండి. ఇంకొక మార్గంలో చిందబడిన కాంతిని పరీక్షచేస్తున్నప్పుడు, తక్కువ అలపొడవు గల నీలికాంతి ఎక్కువగానూ, ఎక్కువ అలపొడవు గల ఎఱ్ఱకాంతి చాలా తక్కువగానూ వస్తాయి. అలపొడవు రెండింత లయినప్పుడు చిందబడిన కాంతి తీక్ష్ణత పదహారో వంతుకు తగ్గుతుంది. ఇలా తీక్ష్ణత చాలాజోరుగా తగ్గిపోతుంది. కనుక చిందబడిన కాంతిలో నీలిరంగు కాంతియొక్క తీక్ష్ణత ఎరుపురంగు కాంతియొక్క తీక్ష్ణతకు సుమారు పదిరెట్లుంటుంది. అందుచేత ఈ చిందబడిన కాంతి చాలావరకు నీలిగా అగపడుతుంది. ఈవిషయం మనం చాలా సుళువుగా చూడవచ్చును. ఒక గాజుబుడ్డికి చుట్టూ మసిగాని, నల్ల పెయింటుగాని పూసి, ఎదురెదురుగా రెండు చిన్న గుండ్రని కిటికీ లుంచవలెను. అనగా ఆప్రదేశాలలో మసి చెరిపివేయవలెను. వాటికి మధ్యగా ఇంకొక కిటికీ నుంచినచో అది ఇదివరకటి రెండింటికీ లంబదిశలో ఉండును. ఈ గాజుబుడ్డిని నీటితో నింపి, ఒక చీకటిగదిలో నుంచి, ఒక విద్యుద్దీపపు కాంతిని గాని, లేక ఏ ఇతర దీపపు కాంతిని గాని, ఒకభూతద్దము,లేక కుంభకటకం(convex lens) సాయంతో బుడ్డిలోని ఎదురెదురు కిటికీలద్వారా పంపవలెను (ఒకటవ పటంలో చూపినట్లు). అప్పుడు మూడవ కిటికీలోనుండి చూసిన నీలికాంతి అగపడును. అదే చిందబడిన కాంతి. అందులో నీలిరంగు కాంతి ఎరుపురంగు కాంతికి పది రెట్లుండుటచే,మొత్తం మీద ఆ కాంతి నీలిగా అగపడుతుంది. బుడ్డిలో నీరుకాక ఏ ఇతర ద్రవపదార్థం పోసినా, ఇలాగే మూడవ కిటికీద్వారా అగపడు కాంతి నీలిగా ఉండును. భూతద్దము లేకపోయినా ఈ విషయం చూడవచ్చును. గదికిటికీతలుపుకు చిన్న బెజ్జ ముంచి, దాని కవతలవైపున సూర్యకాంతి పడునట్లు చేసిన, గదిలోనికి కాంతికిరణములు సరళరేఖలుగా వచ్చును. ఆ కాంతికిరణములదారిలో మసిపూసిన గాజుబుడ్డిని ఎదురెదురు ద్వారములగుండా కాంతిపోవునట్లు పట్టి




పటము ౧.

దీ—దీపము  తె—తెర  1, 2, 3—కిటికీలు
కు—కుంభకటకము  క—కన్ను  బు—గాజుబుడ్డి

కొని, మూడవ ద్వారములోనుండి చూస్తే కొద్దిగా నీలికాంతి అగపడుతుంది.

## సముద్రము, ఆకాశముల నీలి:

ఆకాశము, సముద్రము నీలిగా ఉంటాయి. వాటి గంభీరమైన నీలికి ఇదివరలో ఎన్నో కారణాలు చెప్పేవారు. కాని ఇప్పు డవన్నీ త్రోసివేయబడ్డాయి. కాంతి చిందబడుటే వాటి నీలికి గల ముఖ్యకారణమని గ్రహించబడ్డది. సూర్యునివద్దనుండి వచ్చే తెల్ల కాంతి గాలిలో నుండి, సముద్రపు నీటిలో నుండి చొచ్చుకొని పోతూంది. గాలియొక్క అణువులచేత చిందబడిన కిరణాలు మనము చూస్తున్నాము. నీలికిరణాలు ఎక్కువగా చిందబడుటచే, అవి ఎక్కువ ప్రాముఖ్యం కలిగి ఆకాశం నీలిగా ఉన్నదనే భావాన్ని కలుగచేస్తాయి. అలాగే సముద్రపు నీటి అణువులచేత చిందబడిన కాంతిలోకూడా నీలికిరణాలు తక్కిన రంగుల కిరణాలకంటె ఎక్కువగా ఉంటాయి కనుక, ఆ చిందబడిన కాంతి కంటిలో పడినప్పుడు సముద్రం నీలిగా ఉన్నదనే భావాన్ని కలుగచేస్తూంది

## రామన్ పరిశోధనలు :

అయితే ఇంకొక ముఖ్యవిషయం మనం గమనించవలసి ఉంది. ౧౯౨౮-వ సంవత్సరమువరకూ మనము పంపినకిరణాలలో ఏ అలపొడవు కల కాంతి ఉన్నదో, చిందబడిన కిరణాలలో అదే అలపొడవుకల కాంతి వస్తుందని అనుకొనేవారు. పంపబడిన కాంతికి తీక్ష్ణత ఎక్కువ, చిందబడిన కాంతికి తక్కువ—అదే భేదం. కాని పంపబడిన కాంతిలో లేని అలపొడవులు చిందబడిన కాంతిలో ఉన్నాయేమో నని రామన్ మహాశయునికి అనుమానం వేసింది. అందుచేత ఒక రంగు కల కాంతిని, అనగా ఒకే అలపొడవు కల కాంతిని కొన్ని ద్రవపదార్థాలగుండా పంపి, చిందబడిన కాంతిని యంత్రసహాయంచేత పరీక్ష చేసేడు. వర్ణ పట గ్రాహకము (spectrograph) అనే ఉపకరణములోనికి ఏదైనా కాంతిని పంపినప్పుడు, అది ఆకాంతిలోని వేరువేరు రంగులను వేరుచేసి, ఆయారంగుల అలపొడవులను కొలవడానికి వీలుచేస్తుంది. అటువంటి పరికరంతో అతడు చిందబడిన కాంతిని జాగ్రత్తగా పరీక్ష చెయ్యగా, పంపబడిన రంగుకల కాంతియే కాకుండా, ఇతర రంగుల కాంతికూడా కొద్దిగా వచ్చింది. అంటే పంపబడిన కిరణాలయొక్క అలపొడవుగల కాంతే కాకుండా ఇతర అలపొడవుల కాంతికూడా కొద్దిగా వచ్చిందన్నమాట. ఇలాగ ఒక అలపొడవుకల కాంతిని పారదర్శక పదార్థాలలోనుండి, అనగా కాంతిని తమగుండా ప్రయాణం చేయనిచ్చు పదార్థాలలోనుండి పంపినప్పుడు చిందబడిన కాంతిలో కొత్త అలపొడవులు కల కాంతి ఉండడం అనే విషయాన్ని రామన్ మహాశయుడు కనుక్కొన్నాడు. దీనినే 'రామన్ ఇఫెక్టు' (Raman Effect) అంటారు. దీనినే అందరికీ బోధపడేటట్టు టూకీగా చెప్పాలంటే— ఒకరంగు కల కాంతిని పారదర్శక పదార్థంలోనికి, అంటే కాంతిని తనగుండా పోనిచ్చే పదార్థంలోనికి పంపుము. ఆ కాంతిలో చాలాభాగం తనమార్గంగుండా పోతుంది. కొద్దిభాగం మాత్రము అన్నివైపులా చిందబడుతుంది. ఆ చిందబడినకాంతిని పరీక్షచేసినచో, పంపబడిన కిరణాల కున్న రంగుకాంతి కాక కొత్తరంగుల కాంతికూడ కొద్దిగా కనపడుతుంది. దీనినే 'రామన్ ఇఫెక్టు' అంటారు. రామన్ కనుక్కొన్న ఈవిషయం చాలా ముఖ్యమైనది. ౧౯౩౦-వ సంవత్సరములో ఇతడు ప్రకటించిన ఈ పరిశోధన ప్రపంచములోని ఇతర భౌతికశాస్త్రజ్ఞులు ఆ ఏడు చేసిన పరిశోధన లన్నింటి కంటె ముఖ్య మైనదని చెప్పి, ఇతడికి నోబెలుబహుమానము ఇచ్చేరు.

## 'రామన్ ఇఫెక్టు' పరిశీలన :

చిందబడిన కాంతి చాలాతక్కువ వగుటచేతను, అందులోను కొత్తరంగుల, లేక కొత్తఅలపొడవుల కాంతి మరీ తక్కువ వగుటచేతను, ఒక పదార్థంయొక్క 'రామన్ ఇఫెక్టు'ను మనం ఉత్తకంటితో చూడలేము. దానిని కొన్ని పరికరముల సాయంతో పరిశీలించవచ్చును. కాంతిని పంపుటకు తెల్లరంగుకాంతి నిచ్చే దీపములు పనికిరావు. పాదరసపుదీపము (Mercury arc) అనే దానిని ఉపయోగిస్తారు. అది కొన్నికొన్ని ప్రత్యేక అలపొడవుల కాంతి నిస్తుంది. ఒక పెద్ద భూతద్దం, లేక కుంభకటకంతో ఆకాంతిని ఒక గాజుగొట్టం మీదకు కేంద్రీకరిస్తారు. ఆ గొట్టంలో పరీక్షచేయబడు




పటము ౨.

దీ—పాదరసపు దీపము కు1, కు2—కుంభకటకములు 1,2—కిటికీలు
గొ—గాజుగొట్టము వ—వర్ణపటగ్రాహకము

తున్న ద్రవపదార్థం ఉంటుంది. ఆ గొట్టానికి నల్ల పెయింటు వేయబడి ఉంటుంది. కాని కాంతి వెళ్ల

దానికి ఒక కిటికీ, దానికి లంబదిశగా చిందబడిన కాంతి రావడానికి ఇంకొక కిటికీ ఉంటాయి. ఆ కిటికీనుండి వస్తున్న చిందబడినకాంతి ఇంకొక సంధికటకం సాయంతో వర్ణపటగ్రాహకము (Spectrograph) అనే పరికరము మీదకు కేంద్రీకరింపబడుతుంది (రెండవ పటములో చూపినట్లు). వర్ణపటగ్రాహకముగుండా మనం చూసినట్లయితే ఆ చిందబడిన కాంతిలోని వేరు వేరు రంగులు, లేక అలపొడవులు తెలుస్తాయి. కనుక అసలు పాదరసపుదీపపు కాంతిలో లేని కొత్త అల పొడవు లుంటే తెలుస్తుంది. కాని ఇందులో కూడా ఆ కొత్త అలపొడవుల కాంతితీక్ష్ణత చాలా తక్కువగుట చేత సరిగా అగపడవు. కనుక ఈయంత్రం చివర ఒక ఫోటోగ్రాఫుప్లేటు అమరుస్తారు. చిందబడిన కాంతి విశ్లేషింపబడి ఫోటోగ్రాఫు తీయబడుతుంది. అయితే చిందబడిన కాంతి ఫోటోగ్రాఫుప్లేటుపైని కొద్దిసేపు పడినంతమాత్రాన్ని దానిలో మార్పులు తేలేదు. చాలా సేపు పడాలి. ద్రవపదార్థాలకైతే కొన్నిగంటలు, వాయుపదార్థాలకూ,ఘనపదార్థాలకైతే కొన్నిరోజులు కూడా పడాలి. ఈ ఫోటోగ్రాఫును 'రామన్ వర్ణపటం' (Raman Spectrum) అంటారు. కనుక ఒకపదార్థం యొక్క 'రామన్‌వర్ణపటం' తియ్యాలంటే,చిందబడిన కాంతికి కొన్ని రోజులుకూడా ఫోటో తియ్యవలసి ఉంటుంది. ఈ 'రామన్ వర్ణపటము'ను పరీక్షచేసి, కొత్తగా వచ్చిన అలపొడవులను కనుక్కొంటారు. ఈలాగున ఒకపదార్థంయొక్క 'రామన్ ఇఫెక్టు'నుపరిశీలించవచ్చును.

## అణునిర్మాణం :

ఒకే ఒక అలపొడవు కల కాంతిని ఏదైనా పదార్థం గుండా పంపినపుడు, చిందబడినకాంతిలో కొత్తఅల పొడవుల కాంతికూడ కొద్దిగా వస్తుందని పైన చెప్పేను. అంతేకాక అలపొడవు మారినప్పుడు శక్తికూడా మారు తుందని మనకు తెలుసును. కనుక మనము పంపిన కాంతికి ఒక శక్తి ఉంటుంది. చిందబడిన కాంతిలో చాలవరకు అదే శక్తి కల కాంతి ఉంటుంది. కాని కొంతమటుకు కొత్త అలపొడవు, లేక కొత్త శక్తి కల్గది. అనగా ఈ కొత్తకాంతి చిందబడినపుడు దీనిశక్తిలో కొంతమార్పు వచ్చింది. ఈమార్పు ఎలా వస్తుందన్నది మనం సులువుగా ఊహించవచ్చును. కాంతి పదార్థం యొక్క అణువుతో ఢీకొంటూంది. అలా ఢీకొంటు న్నప్పుడు అణువు కాంతినుండి కొంతశక్తిని లాక్కొనవచ్చును. లేక అణువుకు ఎక్కువశక్తి ఉన్నచో కాంతికి కొంతశక్తిని ఇవ్వివేయవచ్చును. కనుక చింద బడినకాంతిలో కొంత భాగానికి శక్తి ఎక్కువ వవచ్చును. అంటే అలపొడవు తగ్గుతుంది. కొంత భాగానికి శక్తి తగ్గవచ్చును. అంటే అలపొడవు హెచ్చుతుంది. అంతేకాక ఒకే పదార్థంలోని కొన్ని అణువులు కాంతినుండి ఒక కొంతశక్తిని తీసికొనవచ్చును. మరికొన్ని అణువులు మరియొకపరిమాణముగల శక్తిని తీసికొనవచ్చును. కనుక చిందబడిన కాంతిలో కొత్త అలపొడవులు ఒకటే కాక చాలా ఉంటాయి. ఈ కొత్త అలపొడవులు అసలు అలపొడవుకంటె హెచ్చూ ఉంటాయి, తక్కువా ఉంటాయి. అయితే అణువులు కాంతికి శక్తి నివ్వడంకంటె శక్తిని కాంతినుండి తీసి కొనడం ఎక్కువసహజం. అంటే అలపొడవు తగ్గడం కన్న హెచ్చడం ఎక్కువ సహజం. కనుక చిందబడి మార్పుపొందిన కాంతిలో తక్కువ అలపొడవు కాంతికంటె హెచ్చు అలపొడవు కల కాంతి ఎక్కువ తీక్ష్ణత కలిగిఉంటుంది. ఈ విషయాలన్నీ కూడా ప్రయోగాల మూలకంగా ఋజువుచేయబడ్డాయి. ఒకే రంగు, లేక ఒకే అలపొడవు కల కాంతి వేరువేరు పదార్థాలగుండా వెళ్లుతున్నప్పుడు చిందబడినకాంతిలో కలుగు మార్పు లేమిటి? ఒక పదార్థంలో చిందబడిన కాంతిలో కొన్ని అలపొడవుమార్పు లుంటాయి. ఇంకొక పదార్థంలో అలపొడవుమార్పులు పూర్వపు పదార్థమునకువలెగాక కొత్తగా ఉంటాయి. ఒక్కొక్క పదార్థమునకు దానికి సహజమైన అలపొడవు మార్పు లుంటాయి.

ఈ'రామన్ ఇఫెక్టు' కనుగొనటవలన, అణువుల యొక్క నిర్మాణం (Molecular structure), అంటే దానిలో పరమాణువులు (Atoms) ఏ వరుసలో ఉన్నాయో, ఏలాగున కదులుతున్నాయో తెలుసుకో డానికి వీలయింది. అణువులు కాంతినుండి కొన్నికొన్ని పరిమాణములు కల శక్తిని తీసుకొంటున్నాయి. చింద

బడిన కాంతిని విశ్లేషించి, అందులోని వేరువేరు అల పొడవులను కనుగొన్నచో, అలపొడవుల మార్పులను, అందువలన శక్తిలో కలిగిన మార్పులయొక్క పరిమాణములను తెలిసికొనవచ్చును. అందువలన ఆ పదార్థములోని అణువులు ఏయే పరిమాణములు గల శక్తిని తీసికొనగలవో, లేక ఇచ్చివేయ గలవో తెలుస్తుంది. ఆయా పరిమాణముల శక్తిని ఇచ్చివేయుటకు, లేక తీసికొనుటకు ఆ అణువులలోని పరమాణువులు ఏ వరసలో ఉండాలో తెలుస్తుంది. అందుచేత ఆపదార్థంయొక్క అణునిర్మాణం తెలిసికోడానికి వీలవుతుంది. బెంజీను (**Benzene**) అనే పదార్థంయొక్క అణునిర్మాణం సరిగా నిర్ధారణ చెయ్యలేక చాలాకాలం తంటాలు పడ్డారు. 'రామన్ ఇఫెక్టు' కనుగొన్న తరువాతనే దీని మూలకంగా ఆపదార్థంయొక్క అణునిర్మాణం స్థిరపరచబడినది. ఈలాగున అణునిర్మాణం తెలిసికొందుకే కాక, ఇంకా ఎన్నో విధాల ఉపయోగపడుతూ ఈ 'రామన్ ఇఫెక్టు' భౌతిక శాస్త్రాభివృద్ధికి ఎంతో సహాయకారిగా ఉంది.





# ఓదార్పు

— శ్రీ సుందరాచారి —

అమ్మా, ఎంతటిసాహసం బవనిజా! అన్యాయ మీ తీరు గా
కమ్మా, గర్భముతోటి తల్లివి కదా! కారుణ్యలేశంబు లే
దమ్మా? నీ కిది మేలు కాదు; చెడినా డా నమ్మకద్రోహి నీ
కిమ్ముల్ గూర్చి సుఖింపలేడు, వినుమా, నీ తెంపు పోనాడుమా.

దురితపథానువర్తులగు ద్రోహుల పాపభరంబు నింతయున్
సరకును జేయకే పరమశాంతవిలాసముతోడ మోయు నా
ధరణి కనుంగుబిడ్డ వయి, తాలిమి వీడుట చిత్రమమ్మ, నీ
చరితకు వంకదెచ్చుకొని చావును కోరి వరింప ధర్మమా?

కాముల కూతలే నిజము? క్ష్మాపతి రాముడె ధర్మమూర్తి; నీ
ప్రాకటమైన శీల మిక పాడయిపోయెను; సాధ్వి యింక నా
చాకలిపెండ్లమే— పరువుచాలని మాటల కేమిగాని, ఓ
లోకపునీత నీ కిదియు లోకువయా, యిటు లంతరింతువా?

పలువలు తూలనాడుటను పాటన సేయుట యొక్క తప్పు; నిన్
తెలిసి త్యజించినట్టి మగధీరుని కయ్యెను నిట్టు లేద్వగా
గలుగుట వేరు తప్పు; పయిగా అపవాదులు తీరకుండనే
పలువురనోళ్లలో నలిగి ప్రాణము లూడ్చుట పెద్దత ప్పగున్.

పతిపదసేవయే పరమపావన మంచును నారగట్టి, నా
డతులితభోగము ల్విడిచినా వటవీస్థలి కేగి; చాలకే
చితులను పేర్చి దూకితివి శీలనిరూపణకై తెగించి, ఆ
పతికిని చాలడేమి కడుపారగ జూచెడు నీదుపుత్త్రిదున్ ?

అలరం దళ్కుల రత్నరాజమకుటం బందంబుగా దాల్చి ఈ
యిలనే కాక సమస్తలోకములనే యింపార రాముండె నీ
తలపుల్మాని ప్రజానురంజనమె ఆధారంబుగా నేలనీ—
కలతం జెందకుమమ్మ, నీకు నెపుడో కాలంబు రాకుండునా?

రామరాజ్యాన నీవంటి రామ కింత - దిక్కులేకున్న మునిగిన దేమిలేదు—
నీదువిశ్వంబు గొడ్డుపోలేదు తల్లి; - ఆదరింతకు కరవు రాలేదు తల్లి!

అదిగో ఆశ్రమవాసభూమి, అచటన్ ఆనంద మెల్లప్పుడున్
పదము ల్పాడుచు నాట్యమాడు, పరమప్రాజ్ఞుండు వాల్మీకియున్
సదయాత్ముం డదె నీకు రక్షయొసగన్ సన్నద్ధుడై వెల్వడెన్;
పదవే తల్లి! శుభంబు లౌ నచట, పాపం గాంచి లాలింతులే.

---

# కృతజ్ఞుడు

[కథానిక]



= శ్రీ ధనికొండ హనుమంతరావు =

౧

పంచపాళీలో చాప వేసుకొని, పెరటిలోని ఆకుమళ్లమీంచి వచ్చే చల్లగాలి పీలుస్తూ, ముసలికళ్లజోడు తగిలించుకొని అప్పుడే భగవద్గీతను విప్పాడు రాఘవయ్య. బైట ఎవరో తనను పేరుపెట్టి పిలిచినట్టుండి, ఒక్కసారి తలుపుతీసి చూసి, "దయచెయ్యండి" అని సిల్కుదుస్తుల్లో వున్న తనయీడు మనిషిని ఆహ్వానించి, రెండుతరాల్ని చూసిన కుర్చీ దుమ్ముదులిపి అతిథికి ఆసనాన్ని అమిర్చాడు. ఆ వచ్చినాయన మొదట కొత్త మొహమాటపడ్డా, ఆ మర్యాదను అంగీకరించటమే తనకు ధర్మమైనట్టు కుర్చీని ఆక్రమించుకున్నాడు. రాఘవయ్య చాపమీదనే గోడ కానుకొని కూర్చొని, ఆ వచ్చిన వ్యక్తిముఖకళను పరిశీలించసాగాడు. ఆ పెద్దింటిమనిషిముఖంలో ఏదో వ్యాకులత స్పష్టంగా కనిపిస్తోంది.

లౌకికంగా ఐదారునిమిషాలపాటు కుశలప్రశ్నలూ అవీ కాగానే, ఆ వచ్చినాయన, "మీతో చెప్దామనే వచ్చాను" అన్నాడు.

"ఏమిటీ?" అన్నాడు రాఘవయ్య.

ఆయన తాను అనుమానిస్తూన్నట్టూ, ఆ చెప్పబోయ్యే విషయం కఠినమైనట్టూ చూశాడు.

"చెప్పండి ... ఏమీ అనుమానించనక్కర్లేదు" అన్నాడు రాఘవయ్య, తొందరపాటు సూచించే కంఠంతో.

"ఏమీ లేదు...మీవాడి విషయం..."

"మాసూర్యమా? ఏం చేశాడు?"

"ఐదారుగురు రౌడీలతో కలిసి నానాగోలా చేస్తున్నాడు..."

"కొంచెం విశదంగా చెప్పండి"

"ఇవ్వాళ ఏప్రిల్ ఫస్టట ... మా అమ్మాయి స్కూలునుంచి ఇంటికి వస్తూంటే, సైకిల్ మీద వెళ్లి బుడ్డెడు సిరాను దానిమీద చల్లి, జడలాగి..."

"ఆఁ" అన్నాడు రాఘవయ్య, ఏదో ఒక్కసారిగా నమ్మలేని విషయాన్ని వింటూన్నవాడిలాగు.

"నేను అనవసరంగా మీవాడిమీద చాడీలు చెప్పేందుకు రాలేదు. ఇది చాలామంది స్కూలు కుర్రాళ్ల ఎదుటనే జరిగింది. మిమ్మల్ని నేను చిన్నతనం నుంచీ ఎరుగుదును. మీ రెంత మర్యాదస్థులో, ఊళ్లో ఎంత గౌరవాన్ని సంపాయించుకున్నారో కూడా నాకు తెలుసు. చూడండి: మీవాడు రాసిన ప్రేమలేఖలు" అని బుల్లిరికార్డును జేబులోంచి తీసి రాఘవయ్యముందు పడేశాడు. రాఘవయ్య ఒకటిరెండు ఉత్తరాలు నమూనాగా చదివి, ఇక మిగతావి ఏ ధోరణిలో ఉంటయ్యో ఊహించుకోగలిగాడు.

"చూడండి: ఆ బెదిరింపు లేమిటి? మాఅమ్మాయిని ఏమేమిట్లో చేస్తాట్ట... నేనూ ఏడెనిమిది నెల్లనుంచీ యీవేషాల్ని చూస్తూ సహించి వూరుకున్నాను. నేను తలుచుకుంటే మీవాణ్ణి ఏమీ చెయ్యలేనంత బలహీనుణ్ణిగా లేను. కాని ఏదైనా మీతో చెప్పి చేద్దామనే ఇట్లా వచ్చాను. ఇంకోటి ఆలోచించండి: గౌరవంగా బతకటం కష్టంకాని, ఉన్న గౌరవాన్ని పోగొట్టుకోవటం ఎంతలోపని ?"

రాఘవయ్య నిట్టూర్పుతో తల తిప్పి, "నాకు తెలుసు తాసిల్దారుగారూ! మీరు చాలా ఉదార స్వభావులు ... గొప్పింటివాళ్లతో తులతూగలేక పోయినా – నామీద యీగౌరవాన్ని ఉంచినందుకు నేను మీకు కృతజ్ఞుణ్ని. నేను వాడిపని పడతాను" అన్నాడు.

"మీ రామాట అంటే చాలు. – ఇక నాకు సెలవా?"

రాఘవయ్య ఆయనకు నమస్కరించి, రోడ్డు మీదిదాకా సాగనంపి, తిరిగొచ్చి తనస్థలంలో కూర్చొని భగవద్గీత విప్పాడు. కాని, యీ ముసలితనంలో తనకు కనిపించవలసిన శాంతి ఆగీతలో ఎక్కడా దొరకటం లేదు. ఆ అచ్చులోని అక్షరాలు సూర్యం రాసిన ప్రేమలేఖల్లోని వంకరటింకర అక్షరాల్లా సన్నై. హృదయంలో ఏదో తుపాను చెలరేగింది. బాధగా కళ్లు మూసుకొని గతించిన జీవితాన్ని సింహావలోకనం చేసుకోసాగాడు:

తనూ, భార్యా పుత్రులకోసం తహతహలాడటమూ, వరసాగ్గా ముగ్గురు కొడుకులు పుట్టి, చిన్నతనమన్నా గడవకముందే నేలపాలవటమూ, నాలుగో వాడుగా పుట్టిన యీసూర్యం తన విధికరుణవల్లనో, దంపతుల అదృష్టంవల్లనో పెరిగి పెద్దవాడవటమూ, తన జీవితంలో తను నిజంగా తీర్చలేని అనేకకోర్కెలను సూర్యానికి తీర్చటమూ, వాడిముద్దుముచ్చటలే తన మనస్సుకు ఆనందాన్నివ్వటమూ అతనింకా మరిచిపోలేదు. వాడిజీవితాన్ని రాణింపజేసేందుకు తనూ, భార్యాకూడా అనేకసౌఖ్యాల్ని బలిఇచ్చుకున్నారు. పోయిన ముగ్గురు పిల్లలమీది మక్కువనూకూడా వీ డొక్కడి మీదనే చూపుతూ ప్రాణసమానంగా పెంచుకొచ్చి, పెరిగి పెద్దవాడై తన నొక సుపుత్రుని తండ్రిగా చేసి తన యీ ముసలితనంలో చేదోడువాదోడుగా నిలిచి ఒక కంట కనిపెడుతూవుంటాడనీ, వాడి ఒళ్లో తలపెట్టుకొని, వాడి నీడలో హాయిగా మృత్యుదేవతను ఆహ్వానించుకోవటంకూడా తనకు మనశ్శాంతేననీ తలిచిన రోజులు వెనుకనే గడిచిపోయినై.

వాడు ఎంతవాడైనాడు! అంత ముద్దుగా, గారాబంగా పెరిగిన సూర్యం తనకళ్లయెదుట ఎట్లా చెడిపొయ్యాడు! స్కూలుకు వెళ్తున్నానని చెప్పి, గోలీకాయలాటలకూ, గాలిపటాల్ని ఎగరేసుకునేందుకూ వెళ్లటంమొదలు, రౌడీల స్నేహంతో తాగుడు నుంచీ ఉంపుడుకత్తెలవరకూ వాడు ముందుకుసాగాడు. మొదటినుంచీకూడా వాణ్ని సక్రమమార్గంలో పెట్టాలనే ఉద్దేశం ఆచరణలోకి లాగుకురాకుండానే కాలచక్రం వాణ్ని యీవిధంగా లాక్కొచ్చింది. మొదట్లో కొడుకుమీది అనురాగంచేత వాడి చెడు ప్రవర్తనను నమ్మలేకా, తరువాత నమ్మినా వాణ్ని క్షమిస్తూవచ్చి తల్లి అడ్డంపడి వాణ్ని కాపాడుతూ రావటంవల్ల తన కన్నెర్రకు తావులేకుండాపోబట్టే యీనాటికి వాడు తను తలిచిన సూర్యంలాగు కాకుండా అమిత దుర్మార్గుడయ్యాడు. తన వంశమర్యాదా, తను బతుకుతూన్న యీబీదరికంలోనే తను సంపాయించుకోగలిగిన పలుకుబడీ – అన్నింటికీ వాడు వేరుపురుగయ్యాడు. తను కన్నవాడు కనుక వాడివల్ల కలిగే హానిని భరించటం తనకు తప్పదు; కాని వాడు ఊరందరికీ హానికరంగా ఉండే స్థితికూడా వచ్చింది. 'ఎవరి పిల్లాడు?' అనే ప్రశ్న మొదలు 'రాఘవయ్యకొడుకే!' అనే మామూలుసమాధానాలే ఊళ్లో జరిగే దుర్మార్గాల్లో ముప్పాతిక వంతుకు జవాబులుగా తయారయినై. గొప్పఇంటి పడుచులతో లేనిపోని సరసాలకు దిగి, వారి ఆగ్రహానికి వాడు గురైనా —తనకు లోకుల దృష్టిలో వున్న గౌరవమైతేనేం, ఆ పెద్దింటి మనుషులు భయపడే పరువుమర్యాదలైతేనేం వాణ్ని ఇంతవరకూ కాపాడుకొచ్చినై. ఈ అల్పుణ్ని దండించాలంటే–ప్రజలు భయపడి ఊరుకోవటం లేదు; తన ముఖం చూసీ, తన బాధ్యతను గుర్తించీ వారింకా సహనాన్ని చూపుతున్నారు. లేకపోతేనా...?

వాడు సుపుత్రు డౌతా డని తను ఆశపడ్డాడు కాని, లేకుంటే ఆముగ్గురిగతే వీడికీ పట్టినా తన విధిని తను దూషించేవాడే కాదు. తనపైన పెరిగి పెద్దదైన చెట్టునీడకు తను నోచుకోకపోయినా—అది తన వేళ్లతో పెరిగిన నేలనే భేదిస్తుందని తను కలనైనా ఊహించలేదుకదా! భాగ్యవంతులకు డబ్బుండబట్టి,

## ౨

దాదాపు ఆ రాత్రంతా రాఘవయ్య నిద్రాదేవితో విరోధం పూనాడు. సూర్యం ఇంటికి వస్తే తను కొత్త మార్గాల్లో ఉపయోగించవలసిన సామ, దాన, భేద, దండోపాయాల్ని గూర్చి ఆలోచించసాగాడు. తెల్ల వారుజామువరకూ బుర్ర మొద్దుబారేట్టు ఆలోచించినా అతనికి తృప్తి కలగలేదు. ఊహాప్రపంచంలోని సూర్యంతో తను చేసిన వాదనలూ, వాణ్ని తిట్టిన తిట్లూ, వాడిమీద తన స్వాధీనంతప్పిన కోపమూ — అన్నీ కలిసి అతన్ని పూర్తిగా అలసిపొయ్యేట్టు చేసినై. తెల్లవారుజామునకొంత్రోలు కాస్త కునుకుపట్టింది.

భార్య వచ్చి తట్టి లేపి, "మిమ్మల్ని ఎవరో పిలుస్తున్నారు" అంది.

అతను నిద్రకళ్లను తుడుచుకొని, వెళ్లి తలుపు తెరిచాడు. అప్పటికింకా తెల్లారలేదు. నిర్మలాకాశంలో చంద్రుడుమాత్రం గస్తీతిరుగుతున్నాడు. ఈ చల్లగాలిలో హాయిగా నిద్రపోవలసిన లోకంనుంచి–తన కోసం యీ పూరిపాకను వెతుక్కుంటూ వచ్చిన వ్యక్తి తాసిల్దారుగారు !

అతను ఆశ్చర్యపడి, "దయచెయ్యండి" అన్నాడు.

"అక్కర్లేదు; రాఘవయ్యగారూ ! ఇకముందు మీఇంట్లోకి రావలసిన అవసరంకూడా కలగదు. ఈ చివరి సారికిమాత్రం – మీ నిద్రాభంగానికి నన్ను క్షమించి–ఇలా యీ అరుగుమీదికి వస్తే మాట్లాడి వెళ్లి పోతాను"

ఏదో గొప్పప్రమాదమే సంభవించిందని రాఘవయ్య దిగులుపడుతూ మెల్లిగా అరుగుమీదికి వెళ్లి ఆయనపక్కనే నిలబడ్డాడు.

"ఇక లాభం లేదు రాఘవయ్యగారూ ! సహనానికికూడా ఒక మితి వుంటుంది. గౌరవ కుటుంబీకుల మవటంవల్ల, చప్పున బైట పడితే ఆ గౌరవం కాస్తా పోతుందేమో నని భయపడి ఇన్నాళ్లూ ఊరుకున్నాం. కాని ఆ సహనమే యీ స్థితికి లాగింది."

"ఏమైందీ?" అన్నాడు రాఘవయ్య ఆత్రుతతో.

"మావండి: రాత్రి మీవాడు బాగా తాగి, ఇంకా పదిమందిని వెంటవేసుకొనివచ్చి మా ఇంటిమీద పడ్డాడు. అమ్మాయిని పేరున పిలుస్తూ తలుపు తెరవమనీ... పెద్దంతా గోలగోల చేసి ఇంతకుముందే వెళ్లి పొయ్యాడు. ఈ విషయాల్ని మీతో చెప్పికూడా లాభం లేదనుకుంటాను. ప్రభుత్వం వుంది; రక్షణను ఇచ్చే న్యాయం వుంది. వీటిని మించిన పలుకుబడీ, అర్థబలమూ, అంగబలమూ లేకపోలేదు. వాటి నన్నింటినీ ఉపయోగించటంకన్న వేరుమార్గంకూడా లేదు. ఈ సంగతే మీతో చెప్పిపోదామని వచ్చాను."

ఈ మాటలు రాఘవయ్యను శిలాప్రతిమలాగు చేసినై. 'ఎంతవాడయ్యాడు!' అన్నాడు అస్పష్టంగా. గొంతు తడి ఆరిపోయింది. దుఃఖం ఒకవైపున గొంతుకు అడ్డంపడుతోంది. బలవంతాన మాట్లాడసాగాడు.

"నేను కనుక్కుంటాను!" అన్నాడు కోపంతో.

"ఇంకేం కనుక్కుంటారు? మీకు చేత నౌతుందేమో ననుకున్నాను. ఆస్థితికూడా దాటిపోయింది; తొండ ముదిరి ఊసరవిల్లి అయింది. ఇంక లాభం లేదు."

ఔను–తను తండ్రిగా పనికిరానివా డయ్యాడు. దురాత్ముణ్ని కని, పెంచి లోకంమీద వదిలి పెట్టాడు. వాడు తన చేతికి మీరిపొయ్యాడు. ఆ శిక్షనుకూడా అనుభవించవలసింది తనేనేమో ?

ఏదో చెప్పరాని ధైర్యంతో, "మీరు కాస్త ఆగండి. రేపు ఒక్కరోజూ నాకు అవకాశం ఇవ్వండి" అన్నాడు.

"ఏం లాభం?" ఆయన నిట్టూర్చి, రాఘవయ్య మాటల్నికూడా వినిపించుకోకుండానే వెళ్లి పొయ్యాడు.

ఒక నిమిషం తాసిల్దారుగారు వెళ్లినవైపు చూస్తూ నిలబడి, చప్పున తెలివి తెచ్చుకొని, చరచరా ఇంట్లోకి వచ్చాడు. అతని కళ్లు నిప్పుల్ని కక్కు

లేనిపోని వ్యసనాలు కలిగి చెడిపోవటం తనకు తెలుసు కాని, బీదవాళ్లుకూడా యీవిధంగా క్రూరులవటం అతనికి కొత్తగానే కనిపించింది. చేతి కందకుండా పోయిపోయి, యీనాడు తనకు అందని కొమ్మన కూర్చొని, తన నొక చేతకానివాడుగా చేసి నాడు తన ఆనందాన్నే అనుభవిస్తున్నాడు. కుపుత్రుల వల్ల ధృతరాష్ట్రుడు పడ్డ బాధంతా రాఘవయ్యకు అర్థమైంది. జీవితం ఎంత 'రిస్క్'తో కూడుకున్నది!

గత ఎనిమిదిసంవత్సరాల చరిత్రలోని అనేక ఘట్టాలు యీనాడు ఒక్కత్తుగా రాఘవయ్యమీద పనిచేసినై. మూసివున్న అతని కళ్లవెంట చేతకాని కోపం కన్నీటిరూపాన వెలి కురికింది.

"ఏమిటి, అట్లా ఉన్నారు?"

గృహిణిమాటలకు రాఘవయ్య మళ్లీ యీ ప్రపంచంలో పడ్డాడు. ఆమె చూడకుండా కన్నీరు తుడుచుకొని, దుఃఖంవల్ల ఎండిన గొంతును స్వాధీనంలోకి తెచ్చుకునేందుకు ప్రయత్నించాడు. ముఖకళను మారుద్దామని వ్యర్థప్రయత్నం చేసి కోపంతో ఒణికే కంఠంతో "నీ సుపుత్రుడిసంగతి—" అన్నాడు.

"ఏం చేశాడు?" అంది ఆమె దగ్గరిగా వచ్చి నిలబడుతూ.

"తాసిల్దారుగారి అమ్మాయిని గోలచేశాడు ... ఇంకేం చెయ్యాలి? లోకంలో మన స్థానం ఎక్కడ? బీదరికంలోనే గౌరవమర్యాదల్ని సంపాయించుకున్నాం. మనతరం అయిపోవచ్చింది. వాడివల్ల 'అవును' అనిపించుకున్న బతుకును పాడుచేసుకోవటంతప్ప నాకింకేమీ కనిపించదు. ఇకముందు మనం సంపాయించబోయ్యేది శాంతికాదు, సౌఖ్యమూకాదు — బాధా, అపకీర్తీను"

ఆమె వింటూ సమాధానంకోసం మాటల్ని వెతుక్కుంటోంది.

"కొడుకుండి చెడిపొయ్యాడే అని ఏడవటం కన్న - అసలు కొడుకులే లేరే అని ఏడవటమే మేలనిపిస్తోంది. వాడు నిష్ప్రయోజకుడైనందుకు నా కేమీ విచారం లేదు. మనను సంతోషపెట్టకపోయినా దిగులులేదు. కాని లోకకంటకుడయ్యాడు..."

"అంతగా బాధపడటం దేనికీ?" అంది ఆమె.

"నువ్వింక కట్టిపెట్టు. ఈరకం ఓదార్పులే వాణ్ని ఇంతవరకూ తీసుకొచ్చినై. మన పుత్రప్రేమంతా పాలుపోసి పామును పెంచినట్టుంది. నీబిడ్డ నీకు ముద్దుకావచ్చు; కాని లోకు లందరికీ ముద్దుకాడుగా? ఇప్పటికైనా నువ్వు కన్ను తెరవలేదు; ఇంటికి ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు పోతాడో తెలియదాయె! ఇంట్లో ఏవిసంగా ఉపయోగపడే వస్తువున్నా దొంగిలించుకు పోతాడు. వాడు ఆకలితోమాత్రమే ఇంటి కొచ్చినప్పుడు యేమీ అనలేము; ఆకలి తీరాక వాడికి ఇంటి అవసరంకూడా తీరుతుందాయె! తాగుడుదాకా వచ్చినవాడు..."

ఆమె ఇక వినలేకపోయింది. "సరే వచ్చాక అడుగుదాం" అంది.

"అడగవలసిందే! వాడి దృష్టిలో మన కసలు స్థానం ఏదీ? మనం ఎంతవరకూ వాడికి అవసరమో అంతవరకూ ఉపయోగించుకున్నాడు. ఇప్పుడు వాడికి తండ్రి అక్కర్లేదు, తల్లి అక్కర్లేదు. లోకాన్ని బెదిరించి, బాధించి, మోసపుచ్చి బతుకుతే చాలు. వాడు మనను వదిలేసినా—యీ వెధవ సంబంధం మనం వాణ్ని వదిలించుకోకుండా అడ్డంపడుతోంది. వాడు మనకు సంపాయించి పెట్టక్కర్లేదు. తిని ఎవరికీ హానిచెయ్యకుండా తిరుగుతే చాలు. మనం పొయ్యాక వాడెల్లా తయారైనా ఫర్వాలేదు. కాని ఇంకా బతికివున్న మనను యీవిధంగా బాధించటం—"

మాట పూర్తికాకమునుపే ఆమె అంది: "ఈ మాటలన్నీ ఇప్పుడెందుకు? వాడొచ్చాక..."

"అదే...వాణ్ని రానీ. నువ్వేమీ అడ్డుపడవొక. అసలు విననట్టే మాట్లాడకుండా ఊరుకో. ఇవాళ వాడిసంగతేమిటో తేలుస్తాను"

"సరే" అని ఆమె వంటపనిమీద వెళ్లిపోయింది.

తున్నయ్. శ్వాస ఉష్ణవాయువుల్ని తోడు తెచ్చుకుంటోంది. ఆమూర్తి భార్యకు ఉగ్రంగా కనిపించింది. ముసలితనంవల్ల శక్తిలేని భర్త కాదు; ఈఆకారంతో అతను మనుష్యుల్ని విరుచుకుతినగల బలశాలి! ఒక్కక్షణంలో ఎంత బలవంతుడుగా కనిపిస్తున్నాడు!

"విన్నావుగా?" అన్నాడు భార్యతో. ఆ గొంతులోని కఠినత్వం ఒకస్త్రీని భయపెట్టటంలో కూడా ఆశ్చర్యం లేదు.

ఆమె తల తిప్పి, భర్తకళ్లల్లోకి చూడలేక నేల చూపులు చూస్తూ అంది: "వాణ్ణొకసారి ఇంటికి తీసుకురండి...నేను చెప్పి చూస్తాను."

అతను వికటంగా నవ్వి, "ఆరోజులు గడిచిపోయినై. మాశావుగా— సాయంత్రంనుంచీ రాత్రిలోపలే ఒక వ్యక్తిదృష్టిలో నాకున్న గౌరవం ఎలా పోయిందో?...ఇంకేమీ లాభం లేదు; నేనే వెళ్లి వస్తాను. తలుపు వేసుకో" అని ఉత్తరీయ్యం మీద వేసుకొని, భార్య వెనుకనుంచి చెప్పే మాటల్ని కూడా వినకుండానే రోడ్డెక్కాడు.

తను ఎక్కడికి వెళ్లాలో, ఏం చెయ్యాలో మొదట్లో అతనికి పాలుపోలేదు. ఆకోపం అతన్ని ఇవేమీ ఆలోచించలేకుండా చేసినై. కొంత దూరం నడిచి, ఒక వంతెనమీద కూర్చొని, మెల్లిగా కోపానికి ఆ చల్లగాలిని ఆహుతిచ్చాడు. ఇదివరకు తను విన్న అనేకవిషయాల్ని జ్ఞాపకం తెచ్చుకున్నాడు. వాడికి ఊళ్లో అనేకచోట్ల నివాసా లున్నై; అనేక మంది స్నేహితులూ ఉన్నారు.

ఒకయింటికి వెళ్లి అడిగాడు; వాడు సూర్యం తనకు అసలు కలవటమే లేదన్నాడు. ఇంకోడు వాడికీ, తనకూ విరోధమన్నాడు. మరొకడు తనకేమీ తెలియదన్నాడు. మిగతావా ళ్లందరూకూడా ఇదేధోరణి! ఒకణ్ని మించినవారిగ ఇంకొకడు - తోడుదొంగలు!

జీవితంలోని ఈఅపజయా లన్నీ రాఘవయ్యను క్షణక్షణానికీ క్రూరుణ్ని గాకూడా తయారుచేసేందుకు ఉపయోగపడుతున్నయ్. విధి తనను బీదవాణ్నిగా చేసి, విలువలేని వ్యక్తిగా గాలిపీలుస్తూ బతకమని శాసించింది; అందుకుకూడా అతను దుఃఖపడలేదు. తన కుటుంబకష్టాలకుకూడా తనింతగా బాధపడలేదు. ఒక పుత్రుణ్ని తనకు ప్రసాదించి, సక్రమంగా ఇరవైనాలుగేళ్లు పెంచి తనకు కొరగానివాడిగా తయారుచేసిన తనవిధి ఏవిధంగానూ క్షంతవ్యుడు కాదు. విధి చూపిన దయకన్న క్రౌర్యమే వేయిరెట్లు మే లనిపించింది!

వాడు కనిపిస్తే యీనాటినుంచీ వాడో, తనో యీలోకంలో జీవయాత్ర గడిపే అర్హతను సంపాయించుకోవా లని రూపించేటంత కోపం అతనిలో పనిచేసింది. కాని మట్టమధ్యాహ్నంవరకూ ఊరంతా గాలించినా నిష్ప్రయోజనం! ఇక తనకు ఏది దారి? విసుగు, కోపము, యీ తిరగటంలో అవయవాలు పొందిన బడలికా—అతన్ని అన్నివిధాలా బాధించసాగినై.

వెళ్తున్నవాడల్లా ఒక ఇంటిముందా గాడు. అతనికొక కొత్త ఆలోచన తట్టింది.

వాకిట్లో ఉన్న పోలీసుజవాన్ని అడిగాడు. "ఇనస్పెక్టర్ గారు ఉన్నారా?"

"సావిట్లో కూర్చొని కాగితాలు చూసుకుంటున్నారు" అన్నాడు జవాను.

రాఘవయ్య సావిట్లోకి వెళ్లాడు. సబ్ ఇనస్పెక్టరు అతనికి మిత్రుడు. అతని చేతుల్లోనే శాంతి, రక్షణ, చట్టమూ వుంది. పైన ఇలాటి వ్యర్థుల్ని ఎందర్నో చూసిన అనుభవంకూడా అతనికి వుంది. అతని సలహా తీసుకోవటమే రాఘవయ్యకు తోచిన కొత్తమార్గం.

ఇనస్పెక్టరు కాగితాలమీంచి తలెత్తి చూసి నవ్వుతూ, "కూర్చో, ఎక్కడా కనిపించటం లేదే?" అన్నాడు ఆదరణతో.

రాఘవయ్య అలసిన ముఖాన్ని తుడుచుకుంటూ, "కనిపించటాని కేముందీ?... నీతో ఒక అవసరమైన పని వుండి వచ్చాను" అన్నాడు.

"చెప్పు" అని, వినేందుకు సిద్ధమైనట్టు, పడకకుర్చీలో కాళ్లు జాచి పడుకున్నాడు ఇనస్పెక్టరు.

"మావాడి సంగతి ఇదివరకు అప్పుడప్పుడు నీతో చెప్తూవచ్చాను - గుర్తుందా?"

"ఎవరూ — అబ్బాయా?"

"ఆc...అబ్బాయే! వాడు నాశక్తికి మించి పొయ్యాడు. మొక్కై వంగనిది మానై వంగుతుందా? నేను విధించగలిగే శిక్షలన్నీ అయిపోయినై. నా పసూరు ఉనే అపకీర్తితప్ప, వాడివల్ల నాకు వచ్చే ఆదరణ ఇంకేమీ లేదు"

"ఏమైందీ?"

రాఘవయ్య అంతా చెప్పి, "న్యాయానికి కొడుకైతే యేం - ఇంకోడైతే యేం? నాకు వాడి సంబంధం లేదన్నా - వాణ్ని కన్నాననే కనపడనినేర మొకటి నామీద ఉండనేవుంది. ఇక ఇప్పుడు చెయ్య వలసిందేమిటో నాకు తోచటంలేదు. ఈవిధంగా ఇంకా కొన్నాళ్లు సాగితే వాడు హంతకుడు అవుతా డనేందుకుకూడా సందేహం లేదు" అన్నాడు.

ఇనస్పెక్టరు నవ్వి, పెన్సులు పెదివుల సందున బిగించి రెండునిమిషాలు ఆలోచించాక, "వాణ్ని బాగుచేయ్యవచ్చు" అన్నాడు.

"ఎట్లా?" అన్నాడు రాఘవయ్య, ముందుకు వంగుతూ.

"చెప్తానుగా - ఇంతదూరం వచ్చాక, కొంత కఠినంగా ప్రవర్తిస్తేతప్ప లాభంలేదు."

"ఫర్వాలేదు - చెప్పు"

"వాణ్ని ఒకసారి జైలుకు పంపుదాం-" ఇనస్పెక్టరుకు అది గాలిపీల్చినంత తేలికనీ, తను అలాటి పనుల్ని ఇంతకుముందు అనేకం చేశాననీ ఆకంఠమే సాక్ష్యమిస్తోంది.

కాని రాఘవయ్యకు ఆమాటలు అంత తేలిగ్గా కనిపించలేదు. తను కన్న కొడుకును చట్టానికి బద్ధుణ్ని చేసి జైలుకు పంపటం! వాడొకసారి జైలుకు వెళ్లివస్తే అందువల్ల తనకు వచ్చే అపకీర్తీ, వాడి భావి జీవితంలో రాణించే సమయాలనుకూడా అది రాహువు లాగు అడ్డంపడటమూ జ్ఞాపకంచేసుకుంటున్నాడు.

మౌనంలోనే స్నేహితుడి ముఖంలో కనిపించే వింతబాధను గుర్తించి ఇనస్పెక్టరు "ఏం తేల్చావ్?" అన్నాడు.

అంత త్వరగా జవాబు ఇవ్వలేకపోయ్యాడు రాఘవయ్య. ఆకోపంలో అతనికి తోచినంత కఠినంగా ఆహ్వాదయం లేదు. పైన చెక్కుకట్టి గట్టిగా వుంది కాని - ఆ రక్తసంబంధం ఆ గట్టితనాన్ని మింగే సేందుకు గట్టిగా ప్రయత్నించింది.

"కొడుకును కనటంతోనే బాధ్యత తీరిపో తుందా? నీఅంతట నువ్వు ఇవ్వాళ ఒప్పుకోకపోయినా-రేపైనా వాడి గతి ఇంతే! కాలం జరుగుతూన్న కొద్దీ, వాడి యీడు మించుతూన్నకొద్దీ వాడి నేరాలు కూడా ఇంకా ప్రూరరూపం దాల్చుతూ, ఒకటికి పది అవుతై. ఆస్థితి వస్తే - జీవితమంతా జైలులోనే గడిపే నేరాలు రాకపోవు. ఇప్పటికైనా మించి పోయింది లేదు—"

ఇనస్పెక్టరు హేళనగా రాఘవయ్యముఖం చూసి నవ్వుతున్నాడు. తన కొడుకని తను చూపిన పక్షపాతాన్ని కనిపెట్టి, తనను ఎంత తేలిగ్గా మాస్తోంది ఆచూపు!

"జైలుకా?" అన్నాడు మెల్లిగా.

"ఔను...ఇందులో భయపడవలసిందేమీ లేదు. ప్రభుత్వం జైళ్లను కట్టించింది ఎందు కనుకున్నావ్? పీడి తలదన్నిన రౌడీలు ఒకసారి జైలుప్రవేశంతో సగం చచ్చి బైటపడి బాగుపడ్డవాళ్లను నేను చాలా మందిని ఎరుగుదును. నువ్వు వాణ్ణి బాగుచెయ్యదలుచు కుంటే-ఇవ్వాళ నీ కిది కష్టంగా వున్నా - ఇంతకన్న మంచిదారి ఇంకోటి లేదు. ఆ గుహలోకి ఒక్కసారి వెళ్లటంతో రౌడీయిజం ఎగరాలి!...ఇంకోటి ఆలోచించు: ఆ తాసిల్దారే రిపోర్టుచేసినా వాడి గతి ఇంతేగా!"

కన్నకొడు కొకవైపూ, న్యాయ మొకవైపూ, వాడిదురాగ్రహ మొకవైపూ, తన బాధ్యత ఒకవైపూ అతన్ని బెదిరించినై. తనకు శక్తి చాలనప్పుడు ఇతర్ల సహాయాన్ని అపేక్షించటంతప్ప తను చెయ్య

కలిగిందీ లేదు. సూర్యం తన రక్తసంబంధమున్న బిడ్డ! శిక్షకూ, బంధుత్వానికీ—ఒక బంధుత్వ మేమిటి? ఈపోలీసుఅధికారికి తన పుత్రాణ్ణి శిక్షించటంవల్ల వచ్చేదేముంది? ఇది నిజంగా తన పుత్రాడిమంచికేనేమో? ...సూర్యంసంగతంతా అతను సింహావలోకనం చేసుకొని కోపంతో ఊగిపొయ్యాడు. ఆకోపమే చివరి మెట్టుదగ్గర అంగీకారమైంది.

సబ్ ఇనస్పెక్టరు ఆ అంగీకారానికి తృప్తితో నవ్వి "భేష్! ను వ్వింక నిర్విచారంగా ఇంటికి వెళ్లి పడుకో. మిగతాది నేను చూస్తాను" అని స్నేహితుడి వీపు తట్టి మెల్లిగా సాగనంపాడు.

## 3

రాఘువయ్య ఇంటికి రాగానే భర్తముఖంలోని వ్యాకులతను కనిపెట్టి, "ఏమైందీ? వా డెక్కడన్నా కనిపించాడా?...వాణ్ణికూడా వెంటపెట్టుకు రాకపొయ్యావేరా?"అని వివిధప్రశ్నలు వేసింది భార్య.

అన్నింటికీ సమాధానంగా "ఏం లేదు" అని అతను విసుక్కున్నాడు.

ఆమె ఇంకా సాగతియ్యకుండానే ఏడుపు ముఖం పెట్టుకొని తన పనిమీద వెళ్లిపోయింది. ఇప్పటికి చాలారోజుల్నుంచీ భార్యచేతి వంటకాలు అతనికి రుచించటం లేదు. ఈనాడుకూడా ఇదే సంభవించింది. ఇదివరకులాగు ఆ రుచించకపోవటాన్ని అతను హృదయంలో దాచుకోలేకపొయ్యాడు; నాలుగైదు సార్లు ఆమాటను గొణిగాడు. బతుకే ఒక భారమై, క్లిష్టసమస్యలు—నిర్ణయించేందుకు మానవశక్తి చాలనివి ఎదురై అతన్ని అన్నివైపులనుంచీ తరిమి బైట పడేట్టు చేస్తున్నయ్. బీదరికంలో పుట్టి, బీదరికంలోనే పెరిగి, కష్టాల్ని జీర్ణించుకుంటూన్నప్పుడు అతను బాధపడలేదు; విధి తనను విడనాడిననాడు కాని, అదృష్టమనేది తనను చూసి నవ్వనినాడుకాని, లోకమంతా ఏకమై తనను ఒక్కణ్ణీ చేసిననాడుకానీ అతను గుర్తించనిబాధ కాలక్రమాన ఈరూపం దాల్చి ఒక్కసారిగా మొయ్యలేని భారంతో అతనిమీద పడ్డది.

అసలుసంగతి భార్యకు చెప్పకుండానే తను అంగీకారాన్ని ఇచ్చివచ్చిన విషయాన్ని తనలో తను విమర్శించుకోసాగాడు: తను కన్న కొడుకును జైలుపాలుచెయ్యటంలో త్వరపడ్డాడేమో? తన వంశంలోని ఒకడు—తన ఆత్మబంధువు, వంశోద్ధారకుడు—ప్రభుత్వానికీ, సంఘానికీ — నలుగురిఎదుటా నేరస్థుడుగా నిలబడటం — ఇకముందు తను తలెత్తుకు తిరగగలడా?......కాదు—ఇది లోకంలోని చాలామంది హర్షించే పని. తనకు తెలిసినవాళ్లందరూ తన న్యాయ పరిశీలనను తప్పక మెచ్చుకుంటారు. దురాత్ముడైనవాడు ఎవడైనా శిక్షార్హు డౌనని తను అనేకసార్లు గీతలో చదివాడు. ఏ గీతను తన మనశ్శాంతికిగాను ఉపయోగించుకుంటున్నాడో, దాన్నే నిజమైన జీవితంలో ఆచరణలో పెట్టటం తప్పెందుకవుతుంది? కాని వాడు జైలుకు వెళ్లటం తనను ఇప్పటికన్నా ఎక్కువ బాధకు గురయ్యేట్టు చేస్తుందేమో? వాడు తనకు కనిపించే వారం రోజు లైరది. తనను వాడు గడ్డిపోచగా చూస్తున్నా యీ పితృహృదయం నిర్దయగా వాడివైపే పరుగెత్తుతుంది. మరికొంతకాలంపాటు చూడకూడదా? చూసిమాత్రం ఏం లాభం? చూసిన రోజుల వల్ల కలిగిన మార్పుమాత్రం ఏముంది?

ఈరకం ఆలోచనలతో దరికానక సాయింత్రం వరకూ గడిపాడు. చీకటి పడుతూండగా సబ్ ఇనస్పెక్టరు ఇంటికి వచ్చాడు. రాఘువయ్యను చెప్పరాని భయ మొకటి ఆవరించింది. ఆత్రుతతో "ఏమైందీ?" అని అడిగాడు.

ఇనస్పెక్టరు నవ్వుతూ, "ఏముందీ? జేబు దొంగతనంకింద మూడునెల్ల శిక్ష పడ్డది" అన్నాడు.

రాఘువయ్యముఖంలో రక్తమే లేక, వెలవెల బోయింది. తనకొడుక్కు శిక్షకూడా పడ్డదా? తన నిర్ణయమే ఇంకా పూర్తికాక బాధపడుతూండగా, అవవలసిన పనంతా అయిపోయిందా?

"జేబుదొంగతనమా?" అన్నాడు ఒణుకుతూ.

"కేసు నిలిచే సాధన మదీ—."

తనెంత నిర్దయుడై, మానవుడు సంతానానికి చూపవలసిన జాలిని కూడా మరిచి, కఠినంగా ప్రవర్తించాడు! ఇంత త్వరగా ఈపని అవుతుందని అతను అనుకోలేదు.

"తప్పించేందుకు వీల్లేదా? ఎవరిచేత నాతుందో చెప్తే వాళ్లను ప్రార్థిస్తాను" అన్నాడు భయంతో అసలు తను యీపనికి ఒప్పుకున్నప్పుడు ఏదో చెప్పరాని మైకం తనకళ్లను కప్పింది! ఇంకేమన్నా ఆశ వుందేమో నని దేవులాడుతున్నాడు.

"తప్పిస్తావా ?...లాభం లేదు! ఇది ప్రభుత్వపు శిక్ష! ఈరాత్రిబండిలోనే వెళ్లిపోతాడు. — ఒకసారి చూస్తావా?"

ఇప్పటికి తను చూపిన క్రూరత కాక — ఇంకా తను వాడిదగ్గిరకు విమఫునవ్వును కక్కే ముఖంతో వెళ్లి, వాణ్ని ఎత్తిపాడిచినట్టు ప్రవర్తించగలడా? ఏచేతుల పైన ఎత్తుకుతిప్పి వాడికి అన్నం కలిపిపెట్టాడో, ఏ చేతులతో వాడిని చిచ్చికొట్టి నిద్రపుచ్చాడో, ఆ చేతులను కృత్రిమంగాజాచి, 'నాయనా' అని ఆహ్వానించగలడా? గుండెలున్నయ్యా—వాణ్ని ఎదటపడి పలకరించేందుకు? గొప్పనేరాన్ని చేసి, న్యాయానికి భయపడి, అంతరాత్మ తరుముతూండగా, భయంతో ముఖం తప్పించుకు తిరిగే నేరస్థుడిలాగు మారిపాయ్యాడు రాఘవయ్య!

"నేనా?...నేను— రాను— వా డేమన్నాడు?"

"ఏమంటాడు? నేనే చాటుగా అంతా చెప్పాను. ధైర్యం చెప్పాను. వాడేమీ అనలేదు. చెప్తున్నంతసేపూ తల వంచుకొని విన్నాడు—అంతే!"

రాఘవయ్య ఆలోచనలో పడి ఏమీ మాట్లాడలేకపాయ్యాడు.

"సరే, నేను వెళ్లివస్తాను" అని ఇనస్పెక్టరు సైకి లెక్కి వెళ్లిపాయ్యాడు.

ఇంట్లోకి వచ్చాడన్నమాటే కాని రాఘవయ్య మనస్సు మనస్సులో లేదు. అతని అంతరాత్మ బాణంగుచ్చుకున్న పక్షిలాగు గిజగిజా తన్నుకోవటం మొదలు పెట్టింది. తన ఏకైకపుత్రుణ్ణి జీవితమంతా తన జీవానికి పడిఏడిచేట్టు జైలుకుపంపటం! విధి తనకు జీవితంలో ఇచ్చిన విషమపరీక్ష తనలాంటి సామాన్య మానవుడు ఎదుర్కోగలడా? తనకు ఇందులో జయం కలిగిందో లేదోకూడా తెలుసుకోవటం కష్టం. ఇది తప్పో, ఒప్పోకూడా యీచీకట్లో అతని కేమీ తెలియటం లేదు. ఏదన్నా పని చేస్తున్నప్పుడు అది మంచో, చెడ్డో గ్రహించగలుగుతే — లోకంలో చెడ్డవాడనే మనిషే దొరకడేమో?

రాఘవయ్య క్షణంలో వింతవ్యక్తిగా మారిపాయ్యాడు. ఈ దెబ్బ అతని జీవితాన్నే తలకిందులు చేసింది. ఇంతకు పూర్వంవరకూ కనిపించిన సూర్యం వేరు; ఇప్పుడు కనిపిస్తూన్నవాడు వేరు...వాడు తన తొడపైన కూర్చొని, కథలు చెప్పించుకుంటూ, ముద్దుమాటలతో తన హృదయాన్ని కరిగిస్తూ, వంతుల ప్రకారం ముద్దులుతిన్న చిన్నసూర్యమే అతనికిప్పుడు కనిపించేది.

వాడు ఏమవుతాడు? రాఘవయ్య జ్ఞాపకం చేసుకుంటున్నాడు. వాడు — అల్లారుముద్దుగా పెరిగిన తన ఏకైకపుత్రుడు — ఇతర ప్రపంచంతో సంబంధంలేని జైలులో — ఒక రోజు కాదు, రెండు రోజులు కాదు మూడు నెలలపాటు బంధింపబడుతాడు. వాడికి నిద్రాహారా లుంటయ్యా? తనను క్షణక్షణానికీ తలుచుకొని, తను విధించిన శిక్షను విధిలేక అనుభవిస్తూ ఎన్నిబాధలకు లోనౌతాడో! ఆ శిక్ష తనకైనా ఇప్పుడింత బాధపడేవాడు కాదేమో?

భార్య వచ్చి "పోలీసువాళ్లు మనింటికి ఎందుకొచ్చారు?" అంది. పోలీసుశాఖను చూస్తే సహజంగా ఉండే భయం ఆమెపట్ల పోలేదు.

ఈ ప్రశ్నకు రాఘవయ్య వెంటనే జవాబు చెప్పలేకపాయ్యాడు. ఇందులో ఏదో ప్రమాదమైన విషయమే ఇమిడివుం దని ఆలోచిస్తూ ఆమె మళ్లీ అంది: "ఏమిటో — నాకు సరిగ్గా చెప్పండి."

జీవితంలో మొట్టమొదట నేరస్థుడై, న్యాయాధికారియెదుట నిలబడ్డవాడిలాగు రాఘవయ్య భయాన్నంతటినీ కళ్లల్లో నిలుపుకొని బైటి చీకటిలోకి చూశాడు.

ఏం చెప్తాడు? చెప్పక తప్పేదేముంది? వాడి తల్లికన్న వాడివిషయం వినదగ్గ ఇతరవ్యక్తులుమాత్రం యీ లోకంలో ఇంకెవరున్నారు? మధ్య తన స్థితి ఎంత బాధావహమైంది!

"చెప్పండి" అని ఆమె మళ్లీ హెచ్చరించింది, భర్తమౌనంలో ఆమెకు అగాధాలు కనిపించినయ్.

గొంతు సరిచేసుకొని, శాంతో పాటే గుండెను కూడా ఒక విధంగా మామూలుస్థితికి లాక్కొచ్చి, "ఏం లేదు — సూర్యంసంగతి —" అని ఆగాడు.

"అదే — ఏమైందీ?" ఆమెసహన మంతా మాయమైనట్టు ఆ గొంతే చెప్తోంది.

"వాడు...వాడు ... జైలుకు ... వెళ్లాడు!" ముఖం ఆమెకు చూపలేక రాఘవయ్య ఇంటికప్పులోకి చూడసాగాడు.

ఆమెకు యీ మాటలు వెంటనే అర్థంకాలేదు. మెల్లిగా అర్థంచేసుకొని, ఏడవాలని ప్రయత్నిస్తూ, "ఏమిటీ? ... జైలుకా? దేనికి? ఎప్పుడు?...నాకు సరిగ్గా చెప్పండి—" అని ప్రశ్నలు కురిపించింది.

కాని తన ప్రశ్నలకు జవాబైనా వినకముందే— ఆమెహృదయాన్ని చీల్చుకొని ఏడుపు బైటపడ్డది. రాఘవయ్యకుకూడా ఆమెతోపాటే ఏడవాలని పించిది. కాని ఇద్దరూ ఏడుస్తూ కూర్చుంటే - తమకు సానుభూతి చూపే మూడో ప్రాణి ఏదీ? వెంటనే తప్పనిసరిగా తనకు తనే నచ్చచెప్పుకొని, గుండెను రాయిచేసుకున్నాడు.

"ఇదుగో — ఎందుకూ ఏడుస్తావ్? అర్థం లేకుండా గుండెబాదుకుంటే ఏం లాభం?...చూడు: మన బంగారం మంచిది కానప్పుడు ఏం చేస్తాం? వాడు అందరిలాటివాడే అయితే మనను కనిపెట్టుకొని ఇక్కడే పడిఉండేవాడు. దుర్మార్గుణ్ని ప్రభుత్వంకూడా క్షమించలేదు. అనవసరంగా ఏడ్చి, నలుగుర్నీ ఇక్కడికి ఆహ్వానించి యీవిషయాన్ని ప్రచారంచేసుకుంటేకాని నీకు తృప్తి ఉండదా?"

ఆ చివరిమాటతో ఆమెదుఃఖం తన శబ్దాన్ని పోగొట్టుకుంది. కొంచెంసేపు కుమిలికుమిలి ఏడ్చి, "మీరేం చేస్తున్నారు? మీకు పలుకుబడి వుందిగా! వాడేం తప్పు చేశాడు? ఏమన్నా డబ్బుతో పని అయినట్లయితే నానగ అమ్మి ఇచ్చేదాన్నిగా! నాకు ఇంత వరకూ మాటమాత్రమైనా చెప్పకుండా ఎందుకు దాచారు?" అంది.

"అంతా అయిపోయింది. — నాకుమాత్రం తెలుసా యేం?"

"వాడిప్పుడు ఎక్కడున్నాడు? — ఒక్కసారి వెళ్లి చూసివద్దాం."

"లాభం లేదు...వాడీపాటికి వెళ్లిపోయి వుంటాడు."

ఆమె అలాగే ఏడుస్తూకూర్చుంది. ఇన్ని అబద్ధాలకు రాఘవయ్య అంతరాత్మ ఒప్పుకోలేదు. జీవితంలో అబద్ధాలు ఇచ్చే రక్షణకూడా అతనికి అర్థమౌతోంది. కాని వాడి తల్లిదగ్గరే ఇలాటి విషయాన్ని దాచటంలో తనకు ఒరిగే దేమిటో అతని ఊహకు తట్టలేదు. పోనీ, నిజం చెప్దామంటే చెప్పరాని భయం అతని భావమీద అధికారాన్ని చెలాయిస్తోంది.

ఆరాత్రి బాగా పొద్దుపోయ్యాక కాని, ఆమె మామూలుమని షవలేదు. పరిస్థితులు ఎంత విషమించినా, ఎంత దుఃఖాన్ని తోడు తెచ్చుకొని ఎదురైనా — బతికదలుచుకున్న మానవుడు విధిగా జరపవలసిన పనుల మాట జ్ఞాపకమొచ్చింది. కన్నీళ్లు తుడుచుకుంటూ, "భోజనానికి లేవండి" అంది.

రాఘవయ్యఆలోచనకు ఇంకా ఏదరి కనిపించలేదు. అన్యమనస్కంగానే అతను, "నాకు ఆకలి కావటంలేదు." అన్నాడు.

"అయిందేమో అయింది. అన్నం మానుకొని ఏం చేస్తాం?" అంది ఆమె.

ఆమె కొంత ఏడ్పుతో సంపాయించగలిగిన గుండెనిబ్బరానికి రాఘవయ్య ఆశ్చర్యపోయ్యాడు. తను ఏవిధంగా ప్రవర్తించి యీహృదయదౌర్బల్యాన్ని పారద్రోలాలో అతనికి తోచలేదు.

"నిజంగా నాకు ఆకలి లేదు."

ఆమె తరువాత బతిమాలినా రాఘవయ్య భోజనానికి లేవలేదు. ఆమెకూడా ఆరాత్రి భర్తను అనుసరించింది.

మూడుగంటలనుంచీ రాఘవయ్య ఒకసమస్యతో వేగిపోతున్నాడు. అసలు విషయం భార్యకు చెప్పటమా, మానటమా? చివరకు చెప్పాలనే నిశ్చయానికి వచ్చాడు. కాని ఏవిధంగా చెప్పాలో అతనికి తోచలేదు.

ఆరాత్రిలో సగానికి పైగా గడిచింది. కాని ఇద్దరికీ నిద్దర పట్టలేదు. ఆమె ఇంకా తలగడాలో ముఖం దాచుకొని వినిపించని దుఃఖంతో భర్తలాగే బాధపడుతోంది.

నిజాన్ని బైటపెట్టేందుకు రాఘవయ్యకు ఇదే సమయంగా తోచింది. మెల్లిగా జరిగిన కథనంతట్నీ చెప్పాడు; చెప్పకుండా ఉండలేకపొయ్యాడు.

ఆమె అంతా విని, "నిజమా? నిజమా? కన్నకొడుకును జైలుకు పంపేందుకు ఒప్పుకున్నారా?... మీ రక్తంలో రక్తం, బొమికలో బొమిక—వాణ్ని జైలుకు పంపారా? మీకు హృదయమంటూ వుందా? మానవుడు చెయ్యవలసిన పనేనా ఇది?" అని మళ్లీ వెక్కి వెక్కి ఏడ్వసాగింది. ఇంతవరకూ ఆమె అనుభవించింది ఒక్క కొడుకునుగూర్చిన బాధే! కాని యీ క్షణంనుంచీ ఆమెను భర్తనుగూర్చిన బాధకూడా ఆవరించింది.

ఆమెఏడ్పు శ్రుతిమించుతుందనే భయంతో రాఘవయ్య "నీకు తెలియదు పూర్ణా! నేనంతా ఆలోచించే చేశాను. ఇంతకన్న ఇంకోమార్గంకూడా లేదు" అని, తను చేసిన పనికి తను చెప్పుకున్న సమాధానాలన్నింటినీ ఏకరువు పెట్టి సమర్థించుకోచూశాడు. కాని భార్యకిది ఏవిధంగానూ తృప్తికరంగా లేకపోవటం గుర్తించి, అతనుకూడా మళ్లీ బాధపడసాగాడు.

"ఏమి టీసమర్థన? సంతానానికి మేలుచేసుకోలేకపోగా హానిచెయ్యటంకూడా మంచిపనేనా?"

ఆమె మళ్లీ ఏడ్వసాగింది. ఆమెఏడ్పు అతన్ని క్షణక్షణానికి బలహీనుణ్నిగా చేయసాగింది. ఆమెతోపాటే ఏడ్చి అతను తన హృదయభారాన్ని తగ్గించుకుందా మనుకున్నాడు. కాని, అతని కన్నీరు ఇదివరకే ఇంకిపోయింది.

జరిగిందంతా ఇతరప్రపంచానికి తెలియకుండానే జరిగింది. కాని యీ మెయేడ్పుతో ఇరుగుపొరుగు వాళ్లందరూ వచ్చి, సంగతి తెలుసుకుంటే ఉన్నది ఉండగా, లోకానికంతకూ తెలిసిందేననే ఏడ్పుకూడా ఒకపక్క తనను బాధించకమానదు!

అన్నాడు: "పూర్ణా! ఈగోల మనను ఇంతతో వదలక రేపు వాడుకాని, మనంకాని తలెత్తుకు తిరగకుండా చేస్తుంది. అట్లా పెద్దగా ఏడవోక...అందరూ లేచివస్తే—"

ఆమె మాట్లాడేందుకు దుఃఖాన్ని ఆపుకుంటూ, "ఏం తెలుస్తే? ఆపని చేసినప్పుడు లేని భయం ఇంకోళ్లు వింటూన్నప్పుడు వస్తుందా?" అంది.

ఈథోరణిమాటలకు సమాధానం చెప్పే శక్తి రాఘవయ్యలో లేదు. లోకమంతా ఇంతేననికూడా అతనికి తోచలేదు. తనది తప్పో, ఒప్పో తెలియక తప్పనుకుంటే బాధపడవలసివస్తుందేమో ననే భయంతో తనకుతను అనేకవిధాలుగా నచ్చచెప్పకొని కృత్రిమంగా బాధను వదిలించుకున్నా ననుకున్నాడు. కాని అది తన మాటల్ని వినకుండానే పైపైకి వస్తోంది. దాన్ని మరిచిపోవాలనికూడా ప్రయత్నంచేశాడు. కాని బాధను మరిచిపోవటం ఏమానవునికి సాధ్యమౌతుంది?

ఇక ఇంకోవ్యక్తి—అతిముఖ్యురాలు—వాడి తల్లి తనపనిని తప్పుగా ఎంచుతూ, తనయెదుట ఇలా బాధపడటం తన అంతరాత్మను ఒకవిధంగా బెదిరించటమే! ఇంతవరకూ తను ఏకారణాల సహాయంతో ఆత్మశాంతికోసం ప్రయత్నించాడో అవన్నీ ఇప్పుడు మిథ్యలుగా తోచినై. గోడలుదాటని ఏడ్పుతోనే తెల్లవారింది.

## ౪

జీవితం మానవుడు ఊహించలేని రంగుల్ని పొందుతూ, ఎరగని కొత్తమార్గాల్లోంచి — తనకు తెలియకుండానే సాగిపోతుం దని రాఘవయ్య ఇంత

కాలానికికాని గుర్తించలేకపోయ్యాడు. ఇంతవరకూ ఎదురైన కష్టాలకన్న ముందున్న కష్టాలే భరించరానివనికూడా అతను అనుకోలేదు.

కొడుకు జైలుకువెళ్లిన నాలుగైదురోజులదాకా ఇంట్లో అతను పడ్డ మాట లన్నింటినీ – తన తప్పు వుందనే అభిప్రాయంతోనే కిక్కురు మనకుండా భరించాడు. తనంటే భార్యకున్న గౌరవభావంకూడా ఒక్క పనితో అడుగంటింది. నిత్యజీవితంలో ఏదైనా చిన్న పొరపాటు చేస్తే "కొడుకును జైలుకు పంపుకున్నవాళ్లకు ఇవ్వోక లెక్కా ?"అని ఆమె దెప్పి పొడవడం మామూలైంది. అతను వీటికి మారుమాట్లాడక పోవటం ఆమెకు తృప్తికరంగా తోచలేదనుకుంటాను. నిర్జీవపు వస్తువును తిడితే, కొడితే, బాధిస్తే-అదేమీ అనలేదు కనుకనే దాని జోలికి ఎవ్వరూ వెళ్లరు. ఇలాటిదే రాఘవయ్యపట్ల ఆమెకు తోచిన అభిప్రాయం. ఒకే వ్యక్తిదగ్గర ఆ మామూలుమాటల్నే అనటంవల్ల వాటి విలువకూడా క్రమేపీ ఆమెదృష్టిలో తగ్గనారంభించింది. తనకు కలిగిన బాధకు కసిగా, ప్రతిక్రియగా ఆమె తన హృదయాగ్నిని వీలైనన్ని తావుల్లో కురిపించేందుకు — తనకు తెలియకుండానే — ప్రయత్నం చేసింది.

దీని పరిణామమే - పొరుగింటి ఇల్లాళ్లతో మాటల సందర్భంలో – తన కొడుకు ఎల్లా చెడిపోయిందీ, వాడిమీద తనకుండే గొప్పఆశయాలన్నీ ఏవిధంగా నేలకూలినదీ, అన్నింటికన్నా ఆశ్చర్యకరంగా శిలారూప హృదయంతో తండ్రే వాణ్ని జైలుకు పంపటమూ– మొదలైనఘట్టాల్ని నవరసభరితంగా పారాయణచేస్తేనే కాని ఆమెకు తృప్తి తోచలేదు. ఒకటిమాత్రం నిజం: ఆమె ఇతరత్రా యీకథవల్ల యీలోకంలో ఏ ఒక్కరికీకూడా హాని చేద్దామని ఉద్దేశపడలేదు.

ఇది ఏవిధంగా పరిణమిస్తుందోకూడా ఆమె ఆలోచించలేదు. క్రమంగా ఆనోటా యీనోటా యీవిషయం ఊరంతా పాకిపోయింది. ప్రతివాళ్లూ రాఘవయ్యను చాటుచాటుగా విమర్శించుకోసాగారు. ప్రతివిమర్శనాకూడా రాఘవయ్య గొప్ప నేరస్థుడిగా తేల్చేది. క్రమంగా యీవిమర్శలుకూడా అంతరించిపోయినై. రాఘవయ్య అతిక్రూరుడనీ, కన్నకొడుకును పాడుచేసిందికాక, శిక్షింపజేశాడనే అభిప్రాయ మొక్కటే వారిలో నిలిచిపోయింది.

ఇలాటి మాటల్ని రాఘవయ్యదృష్టి ఆకర్షించక పోలేదు. ప్రజల్లో ఇప్పుడుకొత్తగా తనంటే కలిగిన అభిప్రాయాన్నిగూర్చికూడా అతను తనలోతను విమర్శించుకున్నాడు. లోకానికి తనెంత ద్రోహంచేశాడు! తనను చూసి లోకంలోని తండ్రుల్ని గుర్తించాలంటే వారిలో ఒక్క క్రూరత్వంతప్ప ఇంకేం కనిపిస్తుంది?... తనసంగతి లోకానికి తెలిసిపోయిందేననే పూర్వపుభయం పోయింది. అందుకు అతను విచారపడలేదు. నిజం ఎన్నటికీ దాగదు. దుర్మార్గము, దుష్టత్వము, దుర్వాసనా అంతకన్నా దాగవు. ఏనాటికో తెలుస్తుందని తను అనుకున్నది యీనాడే తెలిసింది—అంతే భేదం! లోలోపల అతను పడే ఆవేదననుకూడా లోకానికి కనపరచి, దాని దృష్టిలో క్రూరరూపాన్ని బాహ్యంగాకూడా ప్రదర్శించకుండా—ఇన్ని అవస్థలమధ్యా గంభీరమైన ముఖభంగిమను దాల్చటం అతను అలవాటుచేసుకున్నాడు.

కష్టాలైనా సుఖాలైనా, ఆనందమైనా దుఃఖమైనా — రోజులుమాత్రం మామూలుగానే గడిచిపోతున్నై. మెల్లిగా నూర్యంశిక్షకూడా క్షీణించసాగింది. 'మరి ఇరవైరోజులు', 'మరి పదిహేను రోజులు'అని రాఘవయ్య రోజువారీలుగా లెక్కించుకుంటున్నాడు.

మళ్లీ తన కొడుకు తిరిగివస్తాడు. లోకంతో పాటే వాడుకూడా తనపైన విరోధాన్ని పూనిఉంచటం సహజం. కాని తను వాడికి కావాలని ద్రోహంచేసి, వాణ్ని అధఃపాతాళానికి దిగతొక్కాలని ఏవిధమైన ప్రయత్నమూ చెయ్యలేదని వాడికి రూపించటం తన విధి! వాడికి తనమీద ఏర్పడే హేయభావం తనను బాధించదు. ఎందుకంటే, యీలోకంలో తనమీద తన కుండే ఆశలకన్న కొడుకుమీదనే ఎక్కువ ఆశల్ని రాఘవయ్య కేంద్రీకరించుకున్నాడు! అందుకనే కొడుకు చూపే ఏభావమూకూడా తన ప్రేమ భావానికి హాని చెయ్యలేదు. వాణ్ని ఇకముందు ఆదరించవలసిన బాధ్యత తనపైన వుంది.

ఆ జైలులో వాడు బిక్కుబిక్కుమంటూ కూర్చుంటే తనిక్కడ హాయిగా కాలాన్ని గడపలేదని వాడికి చెప్పుకుంటాడు. అక్కడ వాడు గంజినీళ్లు తాగుతూంటే, ఇక్కడ తను రుచికరమైన పదార్థాలతో ఆకలి తీర్చుకోలేదని నచ్చచెప్తాడు. వీటిని మించి—ఎంతైనా తను వాడి తండ్రిననీ, తన హృదయంలో ఏపరిస్థితులకూ కదలని స్థాన మొకటి తను జీవించినంతకాలమూ ప్రత్యేకించబడ్డదనీ విప్పిచెప్పుకుంటాడు...ఇనస్పెక్టరు చెప్పినట్టు వీడి జైలుప్రవేశంతో వీడి స్నేహితులు చాలామందికి భయం వేసి, తమ నాయకుడిగతే తమకూడా పడుతుం దని కొంతవరకూ సన్మార్గాన పడటాన్నికూడా రాఘవయ్య గమనించకపోలేదు. చిన్న కథకే ఇంత బాగుపడ్డ లోకం ఉండగా, నిజంగా బాధను అనుభవించి,ఒక్కసారి జీవితాన్ని సింహావలోకనం చేసుకొని, కొత్త అనుభవంతోపాటే కొత్తవిజ్ఞానాన్ని సంపాయించుకువస్తూన్న తన కొడుకు బాగుపడేందుకు ఎన్నో అవకాశాలుంటై! ఆ విధిదయవల్ల దీన్నొకదాన్ని చూడగలుగుతే ఇక తనకు జీవితంలో మరి కోర్కెలు ఉండబోవు. అప్పుడు—ఆ ముందు రోజుల్లో తనకోసం ఒక మనశ్శాంతి కాచుకు కూర్చుంటుంది. ఇది కారణంగానే అతను యీ బాధను సమర్థించుకోగలుగుతున్నాడు.

తెల్లారుతే కొడుకు వస్తాడనగా—

ఆరాత్రి అతనికి నిద్రపట్టలేదు. రేపు రైలులో దిగబొయ్యేది రౌడీసూర్యం కాదు; ప్రభుత్వం నిర్మించిన జైలులో తన దుష్టత్వాన్నంతట్నీ దిగవిడిచి, శుద్ధిపొంది, సత్ప్రవర్తనను అన్వేషిస్తూ దిగే సూర్యం! ఈ కొత్త సూర్యంమీద తన కున్న ఆశ లన్నింటినీ అనేక దిక్కుల్లో అత్యున్నతంగా నిర్మించుకుంటూ సూర్యోదయానికై ఎదురుచూడసాగాడు.

మర్నాడు—కొడుకుకోసం స్టేషన్‌కు వెళ్లాడు. కాని, రాత్రిలాగు అతని మనస్సు తేలిగ్గా లేదు. ఏదో తప్పుపని చేసి, తనేమీ ఎరగనట్టు యీ దొంగబురఖాతో మేకపోతుగాంభీర్యాన్ని ప్రదర్శిస్తున్నట్టుగా అతని అంతరాత్మ బాధపడుతోంది.

వాడు మళ్లీ తనను నమ్ముతాడా? ఒకసారి కరవగా చావుతప్పి కన్ను లొట్టపడేట్టు చేసిన పామును మళ్లీ దగ్గరకు చేరనిస్తాడా? ... మళ్లీ యీ అనుమానం కలిగింది ... ఎందుకు చేరదియ్యడు? వాడి చిన్నతనమంతా ఇప్పుడు ముసలిదయిన యీ చేతుల మీదనేగా గడిచింది! ఇదివరకు ఎప్పుడూ ఎరుపురంగులను దాల్చని తన కన్నుల సాక్ష్యంలేదా? తండ్రికొడుకులమధ్య ఏర్పడ్డ ద్వేషభావాలు క్షణికాలేకాని జీవితాంతాలవరకూ ఉంటయ్యా? ... నిజంగా తనది తప్పేనేమో? ఒకవేళ ఇది నిజమైనా — వాడు ఎన్ని తప్పులు చేస్తే తను మన్నించలేదు! తనది యీ ఒక్క తప్పేగా? కనుకనే—తను పెద్దవాడైతేమాత్రమేం — వాణ్ని క్షమాపణ కోరినా ఫరవాలేదు. ఇది తనకేమంత పరువుతక్కువపని! వాడేమన్నా పరాయివాడు కనుకనా? తనో, వాడో ఇద్దర్లో ఏవొక్కరైనా సర్దుకోకపోతే ఎట్లా? అందుకు తనే సిద్ధమైతేమాత్రం వచ్చే నష్టం ఏమంత గొప్పది? ... అంతే! వాడు తనను కావిలించుకొని ...

పెద్దమోతతో రైలు వచ్చి ఆగింది. రాఘవయ్య ఒళ్లంతా కళ్లుచేసుకొని, దిగే జనాన్ని ఆత్రుతతో త్వరత్వరగా చూడసాగాడు. మొదట అన్ని మొఖాలూ అతనికి ఒకేమాదిరిగా కనిపించినయ్. వెంటనే కొంత తొందరను తగ్గించుకొని మళ్లీ చూడసాగాడు. సూర్యం — ఆ పాడుజీవితంలో సరైన తిండి లేక, మనశ్శాంతి లేక చిక్కి శల్యమై లోకమంతటినుంచీ సానుభూతి కోరే దీనమైన చూపుల్తో ఎదురౌతాడని ఆ మూర్తినే తలుచుకుంటూ అంతటా చూశాడు. కాని అలాటివ్యక్తి ఎవరూ అతని దృష్టిన పడలేదు. రైలు మాత్రం నిర్దయగా వెళ్లిపోయింది. తను పొరపాటుగా చూశాననే అనుమానంతో అతను టిక్కెట్లు తీసుకునే చోట నిలబడి, బైటపడే ఒక్కొక్కముఖాన్నీ పరిశీలించిచూశాడు. వాడెక్కడా కనిపించనేలేదు. ప్రయాణీకులుకూడా వెళ్లిపొయ్యారు.

సిగ్గుతో, తలవొంపుతో ఏమూలనుంచన్నా జారేడేమోనని బళ్లవాళ్లదగ్గర కొచ్చి, దృష్టి వెళ్లగలిగినంత దూరంవరకూ చూశాడు. లేదు — వాడు రానే

లేదు! అతని కాళ్లు వెంటనే ఆ ప్రదేశాన్ని వీడలేక పోయినై. బళ్లవాళ్లుమాత్రం, బండికోసం నిలబడ్డా డేమోనని రాఘవయ్యను కొంతసేపు వెంటాడి, నిరాశ చేసుకున్నదాకా వదలలేదు. అతను అనుకున్నాడు: "ఒక అణువై, యీ మహాప్రపంచంనుంచి అస్తమించేందుకు సిద్ధమైన నాకు — యీ బాధాకరజీవితంలో బండిలో ఎక్కి అనుభవించే కొద్ది సౌఖ్యమూకూడా అనవసరం!"

వాడికి బండి తప్పివుంటుంది—ఈ ఆశ ఇంకా అతనిలో మిణుకుమిణుకున మెరిసి అతని ఆశయాల్ని పూర్తిగా చంపలేకపోయింది.

కాళ్లీడ్చుకుంటూ ఇంటికి వచ్చాడు. భార్య ఎదురవగానే తను పడే ఆందోళనంతట్నీ దాచుకోవాలని వ్యర్థప్రయత్నం చేశాడు.

కాని ఆమె అతని ముఖకళను అర్థం చేసుకొని, "వాడు రానేలేదా?" అని అడిగింది.

"లేదు—బహుశా రైలు తప్పివుంటుంది."

"రైలా?" అని వికటంగా నవ్వి ఆమె అంది: "వాడింకా ఎందు కొస్తాడు? వాణ్ని చేతులారా పాతాళానికి దిగతొక్కాక — యీ ఆకులమ్మిన ఊళ్లోనే కట్టెలమ్మేందుకు సిద్ధపడేందుకు వాడికి ఆత్మగౌరవ మనేది లేకపోలేదు!...వాడు రాడు —ఎప్పటికీ రాడు!"

ఆమె కుమిలికుమిలి ఏడ్వసాగింది. వా డొస్తాడనే ఆశతో ఉదయంనుంచి శ్రమపడి చేసిన వంట ప్రయత్నమంతా వృథా! తనను—తన జీవితాన్నే వృథా చేసుకుంది! కష్టపడి కని, పెంచిన తల్లిగా— ఆమె యీ నిరాశకు మరీ కుంగిపోయింది.

ఆమెమాటలకు రాఘవయ్యమనస్సంతా పాడైంది. వాడు వస్తాడని తను ఉదయంనుంచీ పడ్డ ఆత్రుతా, వాడిపక్కనే కూర్చొని తను తృప్తిగా భోంచేస్తూ ముచ్చటించవలసిన విషయాల్ని ఆలోచించుకున్న శ్రమా అతనికి పిచ్చెక్కించినయ్. కాని, కష్టాలకు ఓర్వటం అతను జీవితంలో చాలాకాలంనుంచీ అలవరుచుకుంటూన్న పాఠమే కనుక, భార్యలాగు ఒక్కసారిగా ఉన్న ధైర్యాన్నంతట్నీ పోగొట్టుకోలేకపొయ్యాడు.

తరువాతిబండికి మళ్లీ స్టేషనుకు వెళ్లాడు; వాడు రాలేదు. మూడు రోజులవరకూ వరసాగ్గా ప్రతిబండికీ— వా డొస్తాడనే ఆశను నిరాధారంగా తనకు తను కల్పించుకుంటూ—వెళ్లాడు. కాని భార్య అధైర్యమే నిజమైంది. ఇనస్పెక్టర్ను అడుగుతే జైలు నుంచి మూడురోజులక్రితమే వెళ్లిపోయినట్టు చెప్పాడు...వాడు ఉండేందుకు వీలున్న తావు లన్నింటినీ వెతికాడు. లాభం లేకపోయింది.

ఇక లాభం లేదనే మాటను తేల్చుకున్నప్పుడు అతని హృదయంలో ఒక భూకంపం వచ్చింది. ఇక ఎక్కడికి పోయివుంటాడు? ఈ మూడు నెలలూ వాడు ఎక్కడున్నదీ తెలియబట్టే, వాడు ఒక సమయానికి వస్తాడనే ధైర్యం ఉండబట్టే అంతగా ఆరాటపడలేదు. కాని యీ క్షణంనుంచీ వాణ్నిగూర్చి ఆలోచించేందుకు సహాయపడే వాతావరణంకూడా తన ఊహకు అతీతమైంది.

ఇక వా డేమౌతాడు? వాడికి ఇల్లు లేదు, వాకిలి లేదు. లోకంలో తనకు తను తప్ప ఏ ఇతర్లూ ఉండరు; ఒంటరిబతు కవుతుంది. వింత దేశాల్లో వింతముఖాల మధ్య జీవితం గడిపేందుకు సిద్ధమై ఉంటాడు. ఒకసారి వాడికి టైఫాయిడ్ జ్వరం వస్తే తల్లి గాజులజత అమ్మి మందుఖర్చుకింద ఇచ్చుకొని అహోరాత్రులూ తనతోపాటే వాడిపక్కన సేవ చేస్తూ కూర్చొని, వాణ్ని బతికించుకుంది. మృత్యువనేది మానవాతీతమైందైనా, ఆ క్షణానికిమాత్రం కష్టం ఫలించబట్టే—మృత్యుదేవతను తప్పించుకున్నామనే ఆనంద మొకటి కలిగింది...ఒకవేళ యీ జీవితంలో వాడికి కొద్ది జ్వరం వస్తే, తలకాయనొప్పి వస్తే— రెండో సహాయాన్ని ఎక్కణ్నుంచి తెచ్చుకుంటాడు? చలిరోజుల్లో అమ్మకాచే వేడినీటిస్నానం వాడికోసం ఎదురవగలదా? పోనీ, వాడిదగ్గర డబ్బుమాత్ర మేముంది? లోకంలోని ముప్పాతిక సమస్యల్ని కడుపులో దాచుకోగల ధనం లేనివాడు ఆ వింత సమస్యల్ని ఎలా ఎదుర్కొగలుగుతాడు? సంపాయించటమన్నా

తెలిసివున్నవాడు కనుకనా? వెధవ ఫీప్రు ఫారం తెలివితేటల్లో వాడికి సంపాదన సాధ్య మవుతుందా? ఇంక అలాటి వ్యక్తికి మిగిలింది ఒక్కటే — అంగవైకల్యం పొందినవాడిలాగు, దిక్కులేని అనాధలాగు, మానాభిమానాలే లేని మనిషిలాగు, లోకంలో అసమర్థుడివలె అడుక్కుతినటమే! జీవితంలో వాడు ఆ విద్యనుకూడా అభ్యసించి ఉండలేదే!

అతిక్లిష్టసమస్యల్తో నిండివున్న లోకాన్ని జయించేందుకుగాను వాడు తన ఆత్మబంధువుల్నీ, పరిచయస్థుల్నీ వదిలి కొత్త వాతావరణంలోకి వెళ్లాడు. కష్టాలకు సానుభూతి చూపే వ్యక్తులుకూడా వాడికి లేరు. ఇదివరకు వాడు ఎట్లా పోయినా మళ్లీ వస్తాడు కదా అనే ఆశ వుండేది. కాని ఇప్పుడు అసలు వస్తాడో, రాడో అనే పెద్ద అనుమానం తయారైంది. కొంచెం ఇంచుమించుగా పోయిన తన కొడుకుల్లో వీడూ జమేకాని - పోయినవాళ్లనుగూర్చి అప్పుడు కొద్దికాలంవరకూ విచారించి అతను ఊరుకున్నాడు. కాని యీబతికిఉన్నవాణ్ని గూర్చి ఎన్నాళ్లవరకూ విచారించాలో కూడా తెలియదు!

ఈ ఊహలతో రాఘవయ్యకు సగంశక్తులు పని మానుకున్నట్టు తోచింది. భార్యమాత్రం దీన్ని ఒక విధంగా విమర్శించింది:

"వాడికి తల్లీ తండ్రీ, ఇల్లూ, వాకిలీ - ఏమీ లేకుండా లోకంలో ఏకాకిగా, దేశదిమ్మరిగా, అనాథగా చేసింది మీరు. నాతో వాదించవోకండి, వీటన్నిటికీ కారణం మీరు! మీరే!"

ఈమాటల్ని ఆమె ఏకాస్త సందర్భం వచ్చినా అంటూనేవుంది. రాఘవయ్యహృదయం అతనికి తెలియకుండానే పగిలికూర్చుంది. అది మళ్లీ అతుకుపడుతుందో లేదోకూడా ఎవరు చెప్పగలరు?

౫

జీవితం చాలా దుర్భరమైంది. కొడుకు అభివృద్ధి చూస్తూ, వాడి కష్టసుఖాల్లో భాగం తీసుకుంటూ యీముసలితనాన్ని దాటుదామని తలచిన అతని ఆశలన్నీ పూర్తిగా అడుగంటినై. ఎవరిపైన తన మనశ్శాంతిభారాన్నంతట్నీ మోపుకొని నమ్మికున్నాడో వాడే తనకు చిక్కలేదు. ఇది ఎవరి అన్యాయమైనా, తప్పయినా—ఫలితంమాత్రం తనమీదనే పడ్డది.

వాడి చిన్నతనంలో రాఘవయ్యకు వాడిపైన చాలా ఆశ లుండేవి. కొడుకుసంపాదనా, తను మనమణ్ని ఆడిస్తూ ఆనందించటమూ, జీవితమధురతమ క్షణాల రాకా – మొదలైనవన్నీ అతన్ని ఆకాశానికి తీసుకుపొయ్యేవి. కాని కొడుకుప్రవర్తనతోపాటు ఆఆశలన్నీ ఒకొక్కక మెట్టే కిందికి దిగసాగినవి. దాంతోపాటే అతని కోర్కెలుకూడా క్రమంగా తగ్గిరాసాగినవి. ఇక్కడకు - యీచివరిమెట్టుకు దిగేదాకా అతను ఇంతగా కష్టపడలేదు. ఈప్రదేశంమీద నిలబడి - తను ఎంత పైనుంచి దిగివచ్చాడో, ఇప్పుడు ఏఅగాధంలో ఉన్నాడో చూసుకోవటంతో అతను తనకు తను పరిస్థితులకు అనుకూలంగా మారలేకపొయ్యాడు. ఈ చివరిమెట్టు – తను 'మరణశయ్యమీద ఏకొడుకును చూసి తృప్తిపడగలడనేదే!

కొరగానివాణ్నికూడా ఏతండ్రీ వదులుకోలేడు. తనకు లభించే ఆనందాన్నయినా అనుభవించలేకపోయిన మానవుడు పొందే ఆవేదనంతా రాఘవయ్యకు వర్తిస్తుంది. భాగ్యవంతుడైనా బీదవాడైనా, సమర్థుడైనా అసమర్థుడైనా సంతానంమీద ఉండే మక్కువ మాత్రం అంతటా ఒకటే! పాషాణహృదయంతో సంతానాన్ని తండ్రి వదులుకోలేనప్పుడు తను నిర్దయగా పరిస్థితుల ఒత్తిడివల్ల కొడుకును పోగొట్టుకున్నాడు. ఎక్కడో తెలియదు. మళ్లీ లభ్యమౌతాడో లేదో కూడా తెలియదు! ఇదెంత బాధతో కూడుకున్నదనికూడా తను ఎరగడు!

భార్య విమర్శించినట్లు తనే వాణ్ని దేశాలపాలు చేశాడు. లోకరాక్షసికి ఆహారంగాకూడా వదిలాడు. వాడెన్నికష్టాలపాలయ్యాడో! తనను— తనలాటి విరోధిని వాడు క్షమించగలడా? కుటుంబవైరం ఎంత ఘోరమైంది!

వాడు మామూలుగా భోంచేసే కంచమూ, ఆ స్థలమూ, వాడు పడుకునే మంచమూ, వాడి బట్టల

పెట్టే, చదివినా వాడికి జ్ఞానాన్ని ఇవ్వలేకపోయిన పుస్తకాలూ, స్కూల్లో దొంగతనంగా తెచ్చిన సీమ సున్నాలతో వాడు రాసిన వింతభావాలూ, వాడికి సంబంధించిన ప్రతిచిన్నవస్తువూకూడా—వాడు లేకపోవటంవల్ల రాఘవయ్యహృదయంలో అత్యున్నతస్థానాన్ని ఆక్రమించుకోసాగినై.

వీటిని మించి తనది గొప్ప తప్పుందనే భావం అతనిలో తీవ్రంగా పనిచేస్తున్నంతకాలమూ అతనికి గొప్ప భయ మొకటి కలిగేది. అతని అంతరాత్మే అతనికి యీవిధంగా ద్రోహం చేస్తూవస్తోంది. తన నీడను చూసి తను భయపడేట్టుగా రాఘవయ్య తయారవటంలోకూడా ఆశ్చర్యం లేదు!

రాత్రులు వింతవింతకల లొచ్చి రాఘవయ్యను బాధించేవి. ప్రతికలలోనూ కొడుకు కనిపించి తన జీవచరిత్రలోని ఘట్టాల్ని కళ్లకు కడతాడు. అతను కొనితెచ్చుకొనే మనశ్శాంతికూడా యీఘటనలతో మాయమవసాగింది. జీవితంలోని యీ గొప్ప మార్పుకు ఒక్కసారిగా రాఘవయ్య సర్దుకోలేకపోవటమే అతన్ని ఇంతబాధకూ గురిచేసింది.

ఒక సాయింత్రం రాఘవయ్యకు జ్వరమొచ్చింది. రెండురోజు లయేప్పటికి ఆజ్వరం తీవ్రరూపం దాల్చి, కొడుకునుగూర్చిన పిచ్చిమాటల రూపాన బైటపడసాగింది... భార్య ఇంతవరకూ భర్తమీద చూపుతూ వచ్చిన ద్వేషభావాన్ని పూర్తిగా వదిలి శక్తిలోపం లేకుండా పరిచర్యలు చేయసాగింది. ఒక్కటే, రెండో మగదిక్కు లేకుండానే ఎలా సమర్థించుకుందోకాని తొమ్మిదోరోజుకు రాఘవయ్య జ్వరం పూర్తిగా జారింది.

పథ్యం తీసుకోకపూర్వమే రాఘవయ్య అన్నాడు: "ఇక లాభంలేదు. ముసలితనం త్వరత్వరగా ఆవరించుకుంటోంది. ఈ పండిన కాయ ఏనాడో ఇలాగే జారిపోతుంది. నువ్వుమాత్రం ఏం చేస్తావ్ పూర్ణా? జీవితంలో డబ్బునా సంపాయించలేకపోతిని! నాజాతకమహాత్మ్యమే మోకాని, ఎవరికీ హాని చెయ్యకుండా బతకాలని చూస్తూ నేను విధితో ఆడిన ఏఆటలోనూ నేను గెలుపొందలేకపోయ్యాను... చివరకు కన్నకొడుకైనా దగ్గర లేకుండా చావటం ఎంత కష్టం!"

ఈ చివరిమాట ఆమెకష్టాలన్నిటినీ వరసాగ్గా జ్ఞాపకం చెయ్యగలిగినంత పదునుగా వుంది. ఆమె అంది: "ఇప్పు డాగతించిన విషయాల నన్నింటినీ తలుచుకొని విచారించి ఏం లాభం? వాడు చెయ్యిజారిపోయ్యాడు. ఎక్క డున్నాడో కూడా తెలియ దాయె! వాణ్ణి వెతికే ఓపికైనా మీకు లేదాయె! మన మేమన్నా లక్షాధికార్లమూ, వాడికోసం దేశమంతా తిరగగలిగేందుకు?...ముందు మీ ఆరోగ్యం చూసుకోండి—తరువాత ఏడ్చే శక్తి రాగానే ఏడవ్వొచ్చు."

కాసేపు శూన్యంలోకి సాలోచనగా చూసి అతను అన్నాడు: "పూర్ణా! ఇక యీజన్మానికి యీ పితృహృదయంలో సంతానానికని ఏర్పడ్డ యీ అనురాగాన్ని ఎవరి కివ్వను? ఈ అనురాగాన్ని భరించే వాళ్లు ఎవరో ఒకరు కావాలి. లేకపోతే బతకటమే ఒక సమస్య అవుతుంది."

ఆమె తలతిప్పి "అవును. నేనూ అదే అనుకుంటున్నాను. ఈఇంట్లో వాడిబదులు ఇంకెవరన్నా తిరుగుతూండకపోతే మనం బతకలేం" అని రెండుమూడు నిమిషాలు ఏదో పాతజీవితాన్ని సింహావలోకనం చేసుకున్నట్టుగా ఊహాప్రపంచంలో పడి, మెల్లిగా "మా బాబును తెచ్చి పెంచుకుందామా?" అంది.

బాబు ఆమెచెల్లెలికొడుకు; సూర్యంకన్న రెండేళ్లు పెద్ద. పుత్రులుపోవటం మామూలైనప్పుడు— ఒకసారి ఇతన్ని తెచ్చి పెంచుకోవాలనే ఉద్దేశం యీ దంపతుల్లో కలిగి, ఆమాటలు యీరెండుకుటుంబాల మధ్యా జరిగినై; కాని కాలయాపనలో సూర్యంజననంతో మళ్లీ యీమాట లెవ్వరూ తలపెట్టలేదు.

ఇప్పుడు భార్య చెప్పినమాటలు రాఘవయ్యకు చాలా సమంజసంగా తోచినై. బిడ్డను పోగొట్టుకొన్న ఆవుకూడా ఆ పోలుతిత్తిలో గడ్డిపెట్టి తయారుచేసిన ఆ శవాకారాన్ని చూడకపోతే తృప్తిలేదు.

అది చలించకపోయినా, తనకు ఆనందంగా గంతులు వెయ్యలేకపోయినా, తను పగలల్లా కష్టపడి చేలగట్టుల మీద మేసి వచ్చిన గడ్డిని పాలుగా మార్చి యీనిర్జీవపు బొమ్మకోసం పరుగుపరుగున ఇంటికి వచ్చి తన వృథా ప్రయాసను గుర్తించినా—ఆ బొమ్మే దాని కొక తృప్తి! విధివశాన్నైతేనేమి, స్వయంకృతాపరాధాన అయితేనేమి — అసలు ఆనందం లభించనప్పుడు, దాని తావులో కనీసం దాని ఛాయనైనా చూసుకొని కృత్రిమానందాన్ని అనుభవించటం జంతువే మానవుడికి చూపుతోంది. ఏ ఇతరవిజ్ఞానమూ లేని, భావాన్ని పైకి చెప్పగలిగే భాష లేని జంతువే యీకొత్తరకం అనుభవాన్ని తెచ్చుకుంటున్నప్పుడు మానవుడైన రాఘవయ్య దీనికి ఆశించటంలో వింతేముంది ?

అందుకనే భార్యసలహాకు రాఘవయ్య వెంటనే ఒప్పుకున్నాడు. కుమారుడికోసం హృదయంలో దాస్తూ వచ్చిన యీఅనురాగాన్ని యీపరాయిబిడ్డను చూపటం అదీ ఒక ఆనందమే! ఈవిధంగా 'బదులు'వస్తువును ఉపయోగించటం అతని మనోవ్యాధికి ఒక విధంగా మందుగాకూడా అతనికి తోచింది.

౬

అనుకున్న ప్రకారం పదిరోజులు గడవకపూర్వమే బాబును తీసుకొచ్చారు. ఇందుకు అవతలి కుటుంబంకూడా ఏమీ అడ్డు చెప్పలేదు. వారుకూడా బీదవాళ్లవటమూ, బాబు వ్యవసాయంతప్ప ఏఇతరపనీ లేకుండా ఉండటమూ, వారికి బాబులాటివాళ్లు మరొక అయిదుగురు ఉండటమే కారణాలు.

బాబు తెలివైన కుర్రవాడు. పిల్లలులేని చాలా మందికి తనలాటి కొడుకు కావాలనే ఆశను పెట్టగల ముఖం. వీటికితోడు చాలా సౌమ్యుడు. లోకంలో తనకు ఎంతవరకూ పని వుందో — తను యీలోకానికి ఎంతవరకూ ఉపయోగమో అంతవరకే ఉంటాడు. తను ఒక అణువై బతకటమే తనకు యీప్రపంచంలో పడ్డశిక్ష అని అతని అభిప్రాయం. అందుకనే తన జీవితానికి ఏవో కనపడని గోడలు అడ్డుగా ఉన్నయ్యన్నట్టు ప్రవర్తిస్తాడు. ఆగోడవతలి లోకం ఏలాటిదో అతను చూడదలుచుకోలేదు. తనకు తెలిసినదాన్ని జీవితంలో ఉపయోగించుకొనే అవకాశాలు లేవనీ, ఎన్నటికీ రావనీ అతను ఒక్కసారే ఎన్నడో నిర్ణయించుకున్నాడు. తన దారిద్ర్యభారం తనకు లోకంలో ఇంతకన్న ఎక్కువ స్థానాన్ని ఇవ్వదనీ, అందుకు ప్రయత్నించటం వృథా ప్రయాసేకాకుండా ఇతర్ల కన్నెర్రకు గురవుతుందనీ అతను ఎరుగును. అందుకనే జీవితంలోని ప్రతిఅడుగునూ అతను లెక్కించి వేసుకుంటూ వస్తున్నాడు. ఈ వింత వ్యక్తిని ముదట చూసినవాళ్లు పిచ్చివాడుగానో, అమాయకుడుగానో గ్రహించటం జరుగుతూవస్తోంది.

ఇలాటి కొడుకునే యీకుటుంబం ఆశించింది. కాని వారి గర్భాన పడ్డది దౌర్భాగ్యుడు. వాడైనా దేశాలపాలయ్యాడు. ఇక యీ పెంపుడుకొడుకు ఆ కొరత తీర్చేందుకు వచ్చాడు. ఏనడవడితోనైతే యీ కుటుంబం ఇంతవరకూ బాధపడుతూ వచ్చిందో— సరిగ్గా దానికి ఎదురునడక గల వ్యక్తిని ఆస్థానంలో చూడటం వారిని ఆనందింపజేసింది. దీన్ని వారు ఎంత మామూలుగా తెలుసుకుంటూన్నా, వారి అంతరాత్మ దీన్ని కృత్రిమపుఛాయగా గుర్తిస్తున్నా యీకొడుకు మీదనే వారు తమ అనురాగబీజాల్ని నాటారు. విత్తుల రూపాన కాదు, వృక్షాకారంలోనే!

ఈబాబు ప్రవర్తన వారినేకాకుండా ఆ వీథిలోని తల్లిదండ్రులందర్నీ మరో వింతప్రపంచానికి లాక్కెళ్లింది. తల్లులు తమ పిల్లలకు ఏమైనా నేర్పదలుచుకుంటే—బాబును చూచి, ఏవో కొత్తసిద్ధాంతాలనూ, జీవితపునడకనూ తాము యీనాడే కనిపెట్టినట్టు అతని శీలాన్నే దృష్టిలో ఉంచుకొని నూరిపోసేవారు. తండ్రులు తమ కొడుకులకు ఏమైనా చెప్పదలుచుకున్నప్పుడు "బాబు అది చేశాడు, బాబు ఇదిచేశాడు" అనేవారు. బాబు చేసిన పనుల్నీ, చేసే పనుల్నీ సంతానాలు చెయ్యకపోవటం, చెయ్యలేకపోవటం తండ్రుల్ని కొంత అసంతృప్తికి కారణంగా చేసేవి! ఈ గొప్ప అంతా బాబుకేకాని అకుటుంబానికిమాత్రం కాదు!

ఈసంఘటనలతో రాఘవయ్య భార్యాసమేతంగా కొత్తరకంమనశ్శాంతిని అనుభవించసాగాడు.

నానాటికీ బాబుమీది మక్కువ వారికి ఎక్కువ కాజొచ్చింది.

కాని లోకం దీన్ని కనిపెట్టింది; వేరొక రూపాన అర్థాలుతీసింది; రాఘవయ్యను ఇంకోవిధంగా విమర్శించసాగింది.

"కన్నకొడుకును దేశాలపాలు చేసుకొని పెంపుడుకొడుకును తెచ్చిపెట్టుకోవటం ఏం సుఖం?" అంది లోకం.

సూర్యానికి ఏలోకమైతే భయపడి, వాడిబారి తప్పించుకోవటం ఎలాగా అని ఏలోకమైతే మథనపడ్డదో ఆలోకమే వాడు వదలటాన్ని యీదృష్టితో చూడగలిగింది. దానికి సూర్యం జ్ఞాపకమే లేడు. వాడి దుష్టకార్యాలనే అది మరిచిపోయింది. కాని రాఘవయ్య—బీదవాడు—ఒకరి జోలికి పోని సాధువు తమ సంతానంలో తమకు కలగని ఆనందాన్ని అనుభవించగలగటమే అది క్షమించలేకపోయింది. దాని ఓర్పు కూడా పూర్తిగా జారింది. ఏవ్యక్తిని ఎలా ఉపయోగించుకోవాలో తరతరాలుగా వస్తూన్న లోకచరిత్ర ఘట్టాలతో అది సంపాయించిన విజ్ఞానం ఏవిధంగానూ వృథా పోలేదు.

రాఘవయ్య అనుభవించే కృత్రిమానందాన్ని యీర్ష్యకాంతిలో కనిపెట్టగలిగిన జనమంతా తమ మనశ్శాంతికి భంగం కలుగకుండా—ద్రాక్షపళ్లు అందని నక్కలాగు యీ ఆనందాన్ని 'పుల్లద్రాక్షలు'గా ఎత్తి చూపగలిగారు. లోకమంతా నిర్భాగ్యులమయమే అయినా సౌఖ్యం ప్రతివాళ్లకూ అందుబాటులో ఉంటుంది. అందరూ సమాన సౌఖ్యాన్ని అనుభవిస్తూన్నా ఇది సాధ్యమే... కాని లోకంలో కొందరు అటూ, కొందరు ఇటూ ఉండటంవల్లనే జీవితం వింత వస్తువవుతోంది!

రాఘవయ్య బైట కనిపిస్తే— అతనికి వినిపించేట్టు "కొడుకును దేశాలపాలు చేసినవాడు" అని గుసగుసల్ని జారిచేస్తూ, అతను బాధపడటాన్ని చూసి, బాబులాంటి సత్ప్రవర్తనగలవాణ్ని పెంచుకున్నప్పటికీ, అనుభవించే కృత్రిమానందం ఒక లెక్కలోనిది కాదని కృత్రిమంగా చూపి తమకు తాము తృప్తిపడటాన్ని లోకం మెల్లిగా నేర్చుకుంది. బాబును తెచ్చుకున్న కొత్తల్లో లోకం తను తలిచినంత పాడుగా లేదని రాఘవయ్య అభిప్రాయపడ్డాడు. కాని యీ కొత్త విధానాన్ని చూసి అతను ఆశ్చర్యపడి లోలోన కృంగిపోసాగాడు.

అతను అనుకునేవాడు: "తప్పుచేసి ఎన్ని కొత్త వేషాలు వేసి దాన్ని దాచుకోవాలని ప్రయత్నిస్తే మాత్రం ఏం లాభం? ఎంతవాడైనా కన్నకొడుకుతో పెంపుడుకొడుకు ఏవిధంగానూ సాటిరాడు. నేను నాకే చేసుకుంటూన్న యీ మోసాన్ని లోకం గుర్తించగలగటంలో తప్పేముంది? బాగుపడ్డవాళ్లూ, చెడిపోయినవాళ్లూ, కష్టాలకోసమై జన్మించినవాళ్లూ, సౌఖ్యపడేందుకు నోచుకున్నవాళ్లూ—ఇంకా తలనెంచుకలన్ని రకాల వ్యక్తులతో నిండివున్న లోకంలో నేను నిర్భాగ్యుణ్నయ్యాక— నా విధిమాత్రం నన్ను ఏ విధంగా క్షమించగలుగుతుంది?"

అతను అరుగుమీదికి వస్తే, వీధిలో ఆటలాడుకునే కుర్రవాళ్లు, "తాతా! నన్నుకూడా జైలుకు పంపుతావా?" అని హేళనచేసి గంతులేసేవాళ్లు. లోకంలో ఏమారుమూలనైనా ఆనందమూ, శాంతీ దొరుకుతయ్యేమో నని ఎవరి అదృష్టాన్ని వారు ప్రయత్నించుకుంటూంటేగా— రాఘవయ్య ఇక ఆ ప్రయత్నంలోంచికూడా విరమించవలసిన కాలం వచ్చిందని యీ హేళనలకు అర్థం!

ఇదివరకు మానుముఖం పడుతూన్న అతని గాయం మళ్లీ సాగింది. పూర్వంలాగు కాకుండా అది ఇంక ఏ ఇతరమందుకూ సాధ్యపడనంత త్వరితగతిలో పెద్దదవసాగింది.

అతని మనశ్శాంతి పూర్తిగా హరించబడ్డది. బాబును చూసినప్పుడల్లా— పరాయిసొమ్మును దొంగిలించుకు వచ్చి దాంతో ఆనందాన్ని అనుభవిస్తూండే సామాన్య మానవహృదయం పడే వేదన అతన్ని బాధిస్తూ వస్తోంది. మొదట్లో ఏ దత్తపుత్రుడైతే తనకు మనశ్శాంతిని ఇవ్వగలిగాడో, వాడే అతని భయానికి కారణమయ్యాడు.

శరీరదారుఢ్యం బాగా తగ్గిన యీ యీడులో మానసికంగాకూడా ఒక పిడుగుదెబ్బను భరించటం

అతనికి అతీతమైంది. దీంతో అతను మంచానపడ్డాడు. రోజురోజుకూ అతని వ్యాధి పెరగజొచ్చింది. డాక్టరు వచ్చి మందిచ్చాడు. ఒక సాయంత్రం జ్వరం చాలా తీవ్రరూపం దాల్చి ప్రమాదంచేసింది. కాని అతన్ని మృత్యువుమాత్రం దరిజేర లేదు. డాక్టరు చెప్పినట్టు అది పక్షవాతానికి మొదటిమెట్టు!

జ్వరం పదిహేను లంకణాలతో జారింది. ఈ సారి బతకటంలోకూడా రాఘవయ్య ఏ ఆశాజ్యోతినీ చూడలేకపోయ్యాడు. ఇంతవరకూ తనమీద కత్తికట్టిన విధికి ఇంకా తనపైన కసి తీరలేదనే అతని అభిప్రాయం!

ఆనాటినుంచీ రాఘవయ్య మంచం వదలలేదు. ఏదో తింటూ, గాలి పీలుస్తూ, పిచ్చిఆలోచనలతో బాధ పడుతూ ఇరవై నాలుగేసి గంటల రోజుల్ని బరువుగా గడపసాగాడు.

సంసారం బాగా చితికిపోయింది. అతనికి లోకంలో ఉన్నదల్లా రెండెకరాల భూమి. ఇదివరకు సంపాయించింది సరిగ్గా ఆకాలంలో పొట్టగడిచేందుకే సరిపడీ సరిపడకుండా పోయింది. మరీ రెండుసంవత్సరాలనుంచీ అతను తన పొలంవైపుకూడా చూడలేదు. పొలంచేసేవాడికికూడా అతనిమీద దయలేదు. సమయం దొరుకుతే నెత్తిన చెయ్యిపెడదామనే రకంమనుష్యుల్లో అతను జీవయాత్ర గడపవలసివచ్చింది.

ఈకష్టకాలంలో తన పలుకుబడిమీదనైతేనేం, తనకున్న యీ కొద్దిఆస్తివల్లనయితేనేం కొద్దికొద్దిగా వడ్డీలమీద డబ్బు అప్పుకు తెచ్చాడు. ఇక అప్పుకూడా దొరికేట్టు లేదు. ఒక్క సత్ప్రవర్తనే లోకంలో డబ్బు ఇప్పించగలిగేదైతే ప్రతివాళ్లూ హాయిగా ముందుగా దీని సంపాదనకే బయలుదేరేవారు! మరీ అతను మంచాన పడ్డప్పటినుంచీ అప్పులవాళ్లు ఇంటిచుట్టూ తిరగటం మొదలెట్టారు. మృత్యువనేది తను వరించే వ్యక్తికేకాక పైవాళ్లకుకూడా కాస్త భయంకరరూపాన్నే చూపుతూంటుందికాబోలు!

తనకు మందులూ, సంసారం గడవటమూ మొదలైన ఖర్చులన్నీ తను చివరిసారి భూలోకవాయువును పీల్చేదాకా తప్పనివే! తనకున్న రెండుఎకరాల భూమీ అనుభవించేందుకు ఇంకోతరంవాళ్లుకూడా లేరు. అథవా ఆసొమ్ము ఏమున్నా మిగులుతే బాబే దాన్ని తీసుకుంటాడు. ఈ ఆలోచనతో అతను తన భూమిని అమ్మేందుకు నిర్ణయించుకున్నాడు. భార్యకూడా గత్యంతరం లేకపోవటంవల్ల దీనికేమీ అడ్డు చెప్పలేదు.

బాబు వెళ్లి భూమి అమ్ముకువచ్చాడు. కొంత సొమ్ముతో ఇదివరకు రాఘవయ్య చేసిన బాకీలు తీరినై. ఏళ్లావున్నా వట్టి సత్ప్రవర్తనకోసమే బతికి కూర్చున్నవాడికి ఇవేమీ తప్పనివి అయినై. మిగతా సొమ్ము ఇంటిఖర్చులకింద వాడేందుకు ఉంచారు. ఇదికూడా అయిపోయ్యాక లోకంలో ఇంకేం చేసి జీవించాలనే సమస్య రాఘవయ్యకు రాలేదు. ఏరోజుకారోజే బతకటమనేది సమస్యగా అతని జీవితంలో రావటమే దీనికి కారణం.

ఒక నెల గడిచాక రాఘవయ్యకు ఇంకోవ్యాధి కూడా ప్రారంభమైంది. డాక్టరు దీన్ని క్షయగా సూచించి, గాలిమార్పటం అవసరమని చెప్పాడు. ఈ విషయంమీద ఆదంపతులమధ్య కొద్ది చర్చకూడా జరిగింది. చావసిద్ధమైన తనకు ఇదొక బాధ కాదనీ, అనవసరంగా ఉన్న డబ్బు కాస్తా ఇప్పుడు ఖర్చుచేసుకుంటే తాము లోకంలో నిరాధారులవుతామనీ రాఘవయ్య చెప్పాడు. ఇందుకు భార్య మొదట ఆటంకాలు చెప్పినా, తరువాత ఒప్పుకోక తప్పిందికాదు.

ఈవ్యాధితో పెదనాన్న మంచాన పడ్డాక, బాబు అతనికి చేసే సపర్యకూడా ఎక్కువైంది. ఆ రోగిష్టిమంచంపక్కనే కూర్చొని ఎప్పుడూ ఏదో చదువుకుంటూ, మధ్యమధ్య పెదనాన్న అవస్థను జాలిగా ఆలోచించుకుంటూ, లోకంలోని బాధనంతట్నీ ఈప్రదేశంలోనే చూస్తూన్నట్టు భావిస్తూండేవాడు. డాక్టరుదగ్గరకు వెళ్లి మందు తేవటమూ, సకాలానికి పెదనాన్నచేత మందు తాగించటమూ, ఈగలు పైన వాలి పెదనాన్నను చీకాకుపరచకుండా విసరటమూ — మొదలైన పనుల్లో అతను ఎన్నడూ అశ్రద్ధ చూపలేదు.

ఈ రకంగా రాఘవయ్యకు భరించరానిదైంది. బాబుముఖంలోకి చూసి, "ఇలాటి కొడుకు నాకుండ రాదా? ఏడి స్థానంలోనే సూర్యం వుంటే నేనెంత ఆనందించేవాణ్ణి! లోకమూ, విధీ నన్ను విడిచినా – నాదగ్గరేముందని, ఏ ప్రతిఫలాన్ని ఆశించి బాబు నా సేవకు సిద్ధమయ్యాడు?"—ఎప్పుడూ ఇదే ఆలోచనతో గడిపేవాడు.

ఒకనాడు బాబు పెద్దమ్మతో అన్నాడు: "అయితే, పెద్దమ్మా! ఎవరో పెదనాన్నను తిడుతూంటే విన్నాను. సూర్యాన్ని దేశాలమీదికి తరిమాడని వాళ్లు విమర్శించుకుంటున్నారు..."

ఆమె వెంటనే మాటలధోరణిని తప్పించాలని చూసింది. బాబుకూడా ఆవిషయాన్ని మళ్లీ తరచలేదు. ఈ ప్రసంగంమాత్రం రాఘవయ్యచెవిన పడ్డది. తన గాయం ఇక మానుముఖం పట్టటం కల్ల! గతించిన బాధావహమైన ఆ విషయాలన్నింటినీ తను మరిచినా, మరిచిపోగలిగినా –లోకం తనకు జ్ఞాపకంచేస్తూంటుంది. అందువల్లనే తనది తప్పుకాదనే మాటను అంతరాత్మతో ఎంత ఘోరంగా పోరాడినా తను నమ్మలేక పోతున్నాడు. ఏనాటికైనా సూర్యమే యీ ఇంటి గుమ్మ మెక్కితే - తను లేచివెళ్లి వాణ్ణి ప్రార్థిస్తాడు- ఈ ఒక్కతప్పునూ క్షమించమని! బలహీనుడికి న్యాయాన్ని సంపాయించగల కన్నీరయినా తనకు ఆసమయంలో సహాయాన్ని చెయ్యలేకపోతుందా?

## 2

ఒకనాడు అన్నపూర్ణపేర ఉత్తరం వొకటి వచ్చింది. అంతవరకూ ఆమెజీవితంలో ఆమె పేరున ఉత్తరం ఎప్పుడూ రాలేదు. ఏదో గాభరాగా బాబుచేతి కిచ్చి చదవమంది.

అతను ఉత్తరం విప్పి, పైనుంచి కిందికొకసారి చూసి, "సూర్యం రాశాడు" అన్నాడు.

రాఘవయ్య మంచంలో లేచి కూర్చున్నాడు. ఆమె చెవులు రిక్కించింది. ఇద్దరూ ఒక్కసారి ఆశ్చర్యంతో "ఊఁ" అని మూలిగారు.

"ఏం రాశాడూ?" అంది తల్లి ఆత్రుతతో.

"చదువు" అన్నాడు రాఘవయ్య.

బాబు చదవ నారంభించాడు —

"ప్రియమైన అమ్మా!

ఇప్పుడు నేను మెడ్రాస్ చేరుకున్నాను. ఈమూడుసంవత్సరాల్లోని రోజులూ ఎల్లా గడిచెవొ్యో నే నిప్పుడు రాయలేను....కాని ఇప్పటికి కాని నాకు రోజులు కలిసిరాలేదు. ఇక్కడ ఒక ఫిలింకంపెనీలో మంచి ఉద్యోగాన్ని సంపాయించాను. ఎప్పుడో ఒకనాడు నీదగ్గరికి వస్తాను.

—సూర్యం"

"అంతేనా? ఇంకేమీ లేదా?" అన్నాడు రాఘవయ్య.

"అంతే!"

"ఇట్లా ఇవ్వు" అని ఉత్తరం తీసుకొని దృష్టి నంతట్నీ కేంద్రీకరించి చూశాడు. అతను విన్నదాని కన్న ఎక్కువేమీ ఆ ఉత్తరంలో లేదు.

తనను గూర్చి వా డేమీ రాయలేదన్నమాట! ఉత్తరంకూడా తల్లిపేరనే రాశాడు. తనను మరిచి పొయ్యాడు కాబోలు! ఔను-మూడు సంవత్సరాలు వాడు పడ్డ బాధలకు కారణమైన తననుగూర్చి ఆలోచించేందుకైనా వాడికి మనస్సు ఒప్పుతుందా?... కాదు–అలా ఎప్పటికీ కాదు. తనంటే వాడికి పంచప్రాణాలూను. చిన్నతనంలో జబ్బుచేస్తుందని చిరుతిండ్లకు తల్లి అడ్డంపడ్డా తనుమాత్రం చాటుగా వాడికి అన్నీ కొనిపెట్టటాన్ని వాడు తేలిగ్గా మరిచిపోయి వుండడు. తనకు వాడు ఎన్నడూ అన్యాయం చెయ్యడు. తను శిక్షించివున్నా సరే — ఇవ్వాళ కాకున్నా, రేపైనా తన కౌగిలికోసం వాడు ఆత్రుత పడకపోడు.

ఈ చివరి ఆలోచనతో అతనికి మూడేళ్లనుంచీ కరువైన మనశ్శాంతి కొద్దిగా లభించింది. రెండు నిమిషాలపాటు అతని ముసలిముఖంలోని ముడతలన్నీ మాయమయినై. లోకం ఇంకా జీవించతగ్గ దనే ఆశ

నొకటి అతనిలో కలిగింది. ఈ ఉత్తరం ఇంట్లోకి కొత్త ఆనందాన్ని తోడితెచ్చింది. తల్లికికూడా పట్టరాని ఆనందమైంది. ఇంట్లో ఒక చిన్న విందులాగు భోజనా లయినై. రాఘవయ్యకు వ్యాధి మొదటి నుంచీ రుచించని భోజనం యీనాడు చాలా రుచికరంగా వుంది. విధితోడి ఆటరంగంలో ఇదివరకు తను ఎన్నిసార్లు ఓడిపోయినా యీచివరిసారి గెలిచి, తన కొడుకును తెచ్చుకోగలిగా డన్నమాట!

కొడుకుమీద అతనికి కొత్తఆశలు బయలుదేరినై. వాడు...తన నిష్ప్రయోజక సంతానం సంపాదనలో పడ్డాడు! ఎలాగైతేనేం,అభివృద్ధిలోకి వచ్చాడు. తనకు కావలసింది అదే! ఈకొడుకువల్ల తను సర్వనాశన మయ్యానని ఒక నాడు తను తలిచింది పొరపాటు!తనెంత ఖర్చుపెడితేనేం? ఎంత బాధపడితేనేం? ఈనాడు యీకొడుకును చూస్తే ఎంత తృప్తి కలిగింది! జీవితంలో ఇంతవరకూ తను పడ్డ కష్టాల కన్నింటికీ యీ ఆనందం ఒక ప్రతిఫలమేమో? గడిచిన రోజులే మంచివనే అభిప్రాయపడుతూ వచ్చిన రాఘవయ్య యీనాడు ఇంకా ముందున్న రోజుల్లోనే ఎక్కువ సౌఖ్యం వుందనే నమ్మకానికి దిగాడు.

ఇకముందు అందరి తండ్రులలాగు తనూ గౌరవంగా తలెత్తుకు తిరుగుతాడు. ఒకనాడు వాడు తన యీ పాతఇంటికే వస్తాడు. వాడి సంస్కారమూ, లోకందృష్టిలో వాడికున్న గౌరవమర్యాదలూ అన్నీ తనకుకూడా వర్తిస్తయ్. ఈ ఇల్లు — యీపూరిపాకే మేడౌతుంది. వాడికి త్వరగా పెళ్లిచేసి, మనమణ్ని కూడా ఎత్తుకుతిరిగే అవకాశం తనకు వెంటనే వస్తుంది. తను ఆజీవితంకోసమే వేచియూర్చొని అందాకా బతికి ఉంటాడు...తన కొడుకుసంపాదనను తినటంలో తనకు కలిగే తృప్తి అతని ఊహాప్రపంచంకూడా దాటిపోయింది. ఏకొడుకుకోసం తను ఇంతవరకూ దుఃఖబాష్పాల్ని రాల్చాడో, ఆకొడుకు ఇప్పటినుంచి తన ఆనంద బాష్పాలకు కారకు డయ్యాడు!

అన్నపూర్ణ అప్పుడే వెళ్లి యీసంగతి పేటంతా చెప్పివచ్చింది. ఆమె తనకు కలిగిన ఆనందంలోని కొంతభాగాన్ని — అవసర మున్నా లేకున్నా—ఇతర ప్రజలకుకూడా పంచాలని చూసింది. అదే ఆమె తృప్తికూడా!

ఆనాడు బాబుచేత ఉత్తరం రాయించింది. అందులో తండ్రిరుగ్మతనుగూర్చి పేర్కొంది. ఇంటి పరిస్థితుల్నిగూర్చి రాయటమా, మానటమా అనే చర్చ వచ్చింది.

“అవన్నీ ఇప్పుడు రాసి వాడి మనస్సు పాడు చెయ్యటం దేనికి?” అన్నాడు రాఘవయ్య.

“ఏదో మంచి ఉద్యోగం సంపాయించా నని రాశాడుగా! ఏమైనా డబ్బు పంపమని అడుగుదాం” అంది భార్య.

“వాడికి అక్కడ ఎన్ని ఖర్చు లుంటయ్యో! పట్టణవాసమాయె! అయినా, వాడిదగ్గరుంటే పంపక పోతాడా? అనవసరంగా మనం రాయటం దేనికి?” కష్టాల్లో పడి వాడు సంపాయించిన లోకానుభవాన్నీ, విజ్ఞానాన్నీ, సంస్కారాన్నీ రాఘవయ్య వేసిన అంచనా అదీ!

“వాడేమన్నా పరాయివాడా — రాస్తే యేం?”

“ఎలాగో రోజులు గడుస్తున్నయ్ గా — ఇప్పుడేంవద్దు”

చివరకు ఆసంగతేమీ రాయకుండానే ఉత్తరం ముగిసింది.

ఒక వారం గడిచాక సూర్యందగ్గర్నుంచి జవాబు వచ్చింది. ఇందులోకూడా తండ్రిమాట ఎత్తలేదు. అసలు ఆవిషయాన్ని తను చదవనట్టే నటించాడు. తల్లి క్షేమాన్ని మాత్రం అడిగాడు. ఎప్పుడో వస్తాననే రాశాడు. కాని ఎప్పుడో నిర్ణయించలేదు...అంతకన్న ఆ ఉత్తరాన్నిగూర్చి తెలుసుకోదగ్గ విశేషాలు లేవు.

ఈ ఉత్తరంతో రాఘవయ్యఅంతరాత్మ మానవుడి శక్తికి మించినంతగా తిరుగుబాటు చేసింది. అతను యీమధ్య కొత్తగా నిర్మించుకున్న గాలిమేడలు పునాదుల్తోసహా పడిపోయినై. జీవితం క్షణక్షణానికీ ఊసరవిల్లిలాగు రంగుల్ని మార్చుకోవటం అతనికి కొత్త కాదుకాని — ఆ అనుభవాన్ని మాత్రం అందరు మానవు

ల్లాగే అతనూ జీవితంలో ఏవిధంగానూ ఉపయోగించుకో లేకపోతున్నాడు.

వాడు తనను క్షమించటం ఇక సంభవంకాదు! తనలాంటి ద్రోహిని ఎలా క్షమిస్తాడు ? వాడికి కన్నతల్లి తప్ప యీ ప్రపంచంలో ఇంకొక ఆత్మబంధువు లేడు. తను వాణ్ని దయకోసం ప్రార్థించటంకూడా వృథా ప్రయాసే! తనను ఇదివరకు మృత్యుదేవత కరుణించింది-మళ్లీ ఘోరతరకష్టాల్ని అనుభవించేందుకే!

ఈ ఉత్తరాన్నిగూర్చి ఎక్కువ చర్చ జరగలేదు. రాఘవయ్యముఖంలో అప్రయత్నంగా ఏర్పడ్డ వెలవెలపాటును బలవంతాన ఆపుకున్నాడు. చీకటి పడ్డాక హృదయంలో దాగని ఆరాటమంతా కన్నీటి రూపాన బైటపడ్డది.

౨

ఆరోజునుంచే రాఘవయ్యవ్యాధి మితిమీరింది. అది యీ ప్రపంచంలోని ఏమందులకూ లొంగేది కాదన్నట్టుంది. తనకు అవసానదశ చాలాదగ్గర్లోనే వుందనే నిశ్చయ మొకటి రాఘవయ్యను పీడించసాగింది.

అన్నపూర్ణకు ఆత్రుత ఎక్కువైంది. బాబు చేత మళ్లీ ఉత్తరం రాయించింది — "... నాన్న చాలా ప్రమాదస్థితిలో ఉన్నాడు. మందులక్కూడా ఇబ్బంది పడుతున్నాం. నువ్వొకసారి వచ్చివెళ్లు—" యీ మాటల్నే అనేకరకాలుగా రాయించింది. దీనికి జవాబుగా తనకు చాలా పను లున్నయ్యనీ, ఇప్పట్లో రాలేననీ, సాధ్యమైనంత త్వరలో వచ్చేందుకు ప్రయత్నిస్తాననీ ఉత్తరం వచ్చింది. ఈ మాట మళ్లీ రాఘవయ్యఆశాజ్యోతిని రేపింది. కాని, యీసారి ఆ ఆశను ధరించేందుకు అతనిలో శక్తి లేకపోయింది. జీవితంలోని సౌఖ్యదినా లేమున్నా లున్నా, ప్రకృతి మాత్రం దయచూపకపోవటం మానవమాత్రుడైన రాఘవయ్యపట్లకూడా మిథ్యకాలేదు.

రాఘవయ్య యీ జీవితానికంతకూ ఇక ఒక్క కోర్కెనుమాత్రం మిగుల్చుకున్నాడు. ఇక యీవిషాద నాటకంనుంచి తను విరమించటమే ఆ తుదికోర్కె!

అటు కొడుకుకానీ, ఇటు తండ్రికానీ యీ శిక్ష పడటమే సూర్యం జీవితంలోని కొత్తమెట్లను ఎగబాకేందుకు వచ్చిన అవకాశమని తలచలేకపోయ్యారు.

మరి రెండు రోజులకు దగ్గుతోపాటే రాఘవయ్య రక్తంకూడా వదలసాగాడు. ఈసారి కొడుకును రమ్మని ప్రాధేయపడుతూ ఆమె ఉత్తరం రాయించింది. వాడు వస్తాడనే ధైర్యాన్ని భర్తకు ఎన్నోసార్లు చెప్తోంది. కాని అతనుమాత్రం విని, నవ్వి ఊరుకోసాగాడు.

ఈ ఉత్తరానికి జవాబు రాలేదు. ఆమె ఆత్రుత హెచ్చుకాజొచ్చింది. బాబు తన శక్తివంచన లేకుండా సపర్యలు చెయ్యసాగాడు.

అయిదోనాటికి ఇక బ్రతుకుతా ననే ఆశ లేకుండానే రాఘవయ్య అస్తమయంకోసం ఎదురుచూడసాగాడు. "వాడు వస్తాడు" అని భార్య అన్న మాట ఎక్కడో వినిపిస్తూన్న రాఘవయ్యకు నిజంగా చద్దామనే పాడు ఉద్దేశం మాయమవసాగింది. కాని కోర్కెలన్నీ తీరటమంటూ మానవజీవితంలో ఉంటే ప్రతివాడూ ముందు ఆయుస్సుకోసం దేవులాడేవాడు!

ఆ సాయంత్రానికి డాక్టరు ఆశలు వదులుకున్నాడు. భార్య ఏడుస్తూ కూచుంది. సాయంత్రం సూర్యాస్తమయం కాకపూర్వమే రాఘవయ్య యీలోక కష్టసుఖాలనుంచి విరమించాడు.

పేటలోనివా రంతా వరసాగ్గా వచ్చి, ఎవరికి తోచిన సద్గుణాల్ని వారు రాఘవయ్యకు అంటగట్టి రాఘవయ్యను మాటల్లో మాత్రం ఒక ఆదర్శప్రాయమైన వ్యక్తిగా సత్కరించింది. బతికి శత్రువైన రాఘవయ్య చచ్చి మిత్రు డయ్యాడు!

ఆమె ఏడ్చి ఏడ్చి "నాయనా! వారు పోయ్యారని టెలిగ్రా మివ్వు" అంది. బాబు వెళ్లి టెలిగ్రాం ఇచ్చి వచ్చాడు.

ఈ టెలిగ్రాంకు తెల్లారుతూండగా జవాబు వచ్చింది. అది టెలిగ్రాఫ్మనిఆర్డరుతో సహా. టెలి

గ్రాంలో "తండ్రిగారి కర్మలకు" అని మాత్రం వుంది.

"డబ్బు ఎంత?" అంది ఆమె.

"నూటయాభై."

ఆమె మండిపడ్డది: "జీవితంలో ఇన్ని కష్టాల్ని అనుభవించాక—బతికిఉండి గడిపిన రోజులు చచ్చాక గడవకపోతయ్యా? కొన్నికోట్ల మృతశరీరాల్ని తన గర్భంలో దాచుకున్న భూమాతకు ఈ ఒక్క శవమూ ఎక్కువ కాదుగా! వాడి చిన్నతనమంతా వాడి దుర్వ్యసనాలకుగాను నేనుచాటుచాటుగా డబ్బిచ్చాను. నా నగల్నికూడా ఇచ్చాను. మళ్లీ ఆ డబ్బు వాడిస్తాడనికాదు! వాడి డబ్బుకోసమే నే నిక్కడ–యీ శవం దగ్గిర కూర్చోలేదు. బాబూ! నాకు వాడి సహాయం ఇదేగా? మనిఆర్డరు తిప్పి పంపెయ్. ఆడబ్బును తీసుకుంటే వారి ఆత్మకూడా దుఃఖిస్తుంది."

పోస్టుబంట్రోతు తన మామూలుకోసం ఒక నిమిషం చూచి, నిరాశ చేసికొని వెళ్లిపోయాడు.

బాబుమాత్రం నిట్టూర్చి అన్నాడు: "పెద్దమ్మా! మాకూ కాస్తో కూస్తో వుంది. దానిమీద బతకలేక పోము. నన్ను యీరెండు సంవత్సరాలూ కడుపులో పెట్టుకుని కాపాడావు. ఇక నీ జీవితాంతంవరకూ నిన్ను నేను పెంచుకుంటాను."

ఆమెకు ఆశ ఒక పెద్దకెరటంలాగు ఎదురైంది. ఈ పాపభూయిష్ఠప్రపంచంలో జీవితంలో ఆమెకు ఒక్క కృతజ్ఞుడుమాత్రం కనిపించాడు.

"ఇంకా ఇక్కడ నీకేముంది పెద్దమ్మా? రేపే మావూరు వెళ్లిపోదాం" అన్నాడు బాబు.

అంత దుఃఖంలోనూ, సంతోషంతో ఒణికే కంఠంతో, బాబుతల నిమురుతూ ఆమె అంది: "సరే–నాయనా!"



# హిందూ వివాహపు చట్టము

= శ్రీ కొమాండూరు శఠకోపాచార్యులు =

బ్రిటిషువారు మన దేశమును పాలించుట కారంభించినతరువాత మన న్యాయశాస్త్రములో కొన్ని మార్పులు చేయుచు కంట్రాక్టు, క్రయము, తణఖాలు, క్రిమినలు నేరములు ఇత్యాదులనుగూర్చి చట్టములను జేసినారు. కాని వ్యక్తిజీవితమునకు సంబంధించిన వివాహము, దత్తత, వారసత్వము మున్నగువానినిగూర్చి చట్టము లేర్పరచలేదు. అందుకు పూర్వపుధర్మశాస్త్రములను, ఆచారములను కోర్టువారు ఆధారపఱచుకొని కొన్నితీర్పులను జేయుచున్నారు. ఇప్పుడు చాలవరకీవిషయము లన్నిటికిని హైకోర్టుప్రీవీకౌన్సిలుల తీర్పులే ఆధారముగా నున్నవి. ఈ విషయములలో హిందువులకు హిందూ ధర్మశాస్త్రములును, ముస్లిములకు వారి శాస్త్రములును ప్రమాణ మని యెంచబడుచున్నది.

హిందూధర్మశాస్త్రములను అర్థముచెప్పి అన్వయించుటలో కోర్టులు పొరబడుటయు కలదు. అందువలన కొన్ని నిబంధనలు మారిపోవుట సంభవించినది. ఇందునుగూర్చి ఇదివరలో (౧౯౩౮ సం. - భావ ఆషాఢ, శ్రావణ, భాద్రపద భారతి సంచికలలో) కొంత పరిశీలించినాను. 'హిందూలా - స్త్రీల హక్కులు' అను ఆవ్యాసములో స్త్రీలకు జరిగిన అన్యాయమునుబట్టి వాని సవరణకై చేయబడిన కొన్ని సూచనలు న్యాయమైనవని, దరిమిలాను ప్రభుత్వమువారు **Hindu Wemens Property Act** (హిందూస్త్రీల ఆస్తి చట్టము) అను చట్టము చేయుటవల్ల స్పష్టమయినది. మరియు అందులో సూచించినట్లు వివాహాదుల విషయములోను స్త్రీల కన్యాయము కలుగుచున్నదని గుర్తింపబడినది. మొత్తముమీద హిందూలాలో నిప్పటి సంఘక్షేమమునిమిత్తము సవరణలు జరిగించి, ఒక సంపూర్ణమగు హిందూలాచట్టము చేయుట యవసరమని చాలమంది ధీమంతులు గుర్తించి, ఆందోళన చేయుచున్నారు. అందుమీదట ప్రభుత్వమువా రావిషయమును పరిశీలించి 'శిఫారసు'లను జేయు మని ఒక యుపసంఘము నేర్పరిచినారు. ఇది శ్రీ బి. నరసింగరావుగారి యధ్యక్షతలో నున్నందున 'రావుకమిటీ' యనబడుచున్నది. ఈ హిందూలాసంస్కరణకమిటీవారిటీవల 'హిందూ వివాహము' లనుగూర్చి కొన్ని సూచనలను జేయుచు, ఆ సూచనలనుగూర్చి ప్రజలు తమ 'యభిప్రాయమును తెలుపవలె ననియు, అందునుబట్టి మిగతా వివాహ విషయములనుగూర్చియు సమగ్రమగు చట్టమున కవసరమగు సూచనలను జేయుదు మనియు పత్రికలలో ప్రకటించినారు.* గజెట్టులోగూడ వారిబిల్లులో నొకభాగము ప్రచురించినారు. ఇందలి ముఖ్యసూచనలను గూర్చి ప్రజలదృష్టి నాకర్షించి, అందలి సమస్యల పరిష్కారమవసరమని తెలుపుటే యీ వ్యాసపు ముఖ్యోద్దేశము. స్త్రీలకు సంబంధించిన ముఖ్యసూత్రములనుగూర్చి సవరణ యవసర మని పైన చెప్పిన ౧౯౩౮ సం. పు భారతిలోని వ్యాసము శాస్త్రప్రమాణములతో చూపబడినది. వాటి నిక్కడ మరల చెప్పనవసరము లేదు. ఇంతవరకు ప్రచురితమయిన 'రావుకమిటీ' వారి రిపోర్టులోని ముఖ్యసూచనలు నాలుగు :

౧. బహుభార్యాత్వము కూడదు.

౨. రిజిస్ట్రరుచర్యద్వారాకూడా వివాహము జరిగించుట.

3. సగోత్ర వివాహములు చెల్లుట.

౪. వర్ణాంతరవివాహములనుగూర్చి నిరోధములు తొలగించుట.

---

* ౬-౬-౧౯౪౭ తేదీ ఆంధ్రపత్రికలోని ౫-వ పుట 3, ౪ కాలములలో ప్రచురితమయిన వార్తను జూడుడు.

## బహుభార్యాత్వము

ఇప్పుడు సాధారణముగా హిందువులలో ఏకపత్నీత్వమే కలదు. కాని, పురుషు డెప్పుడైనను ఎట్టి కారణములు తెలుపకయే మరొక స్త్రీని పెండ్లియాడుదునని మొదటిభార్యను, వారి తల్లిదండ్రులను బెదిరించుటయు, కొందరట్లు వివాహముచేసుకొని ప్రథమభార్యనన్యాయముగ విసర్జించుటయు చూచుచున్నాము. భార్య భర్తవల్ల తానెట్టి బాధ లొందుచున్నను మరల పెండ్లియాడగూడదు. వితంతువైనను పునర్వివాహమునకు హిందూసంఘ మనుకూలముగ లేదు. తక్కిన నాగరికదేశా లన్నిటిలోను ఏకపత్నీత్వమే అమలులో నున్నది. మనదేశములోగూడ క్రైస్తవులలో పురుషులును భార్యయుండగా మరల వివాహమాడగూడదు. అట్లు పెండ్లిచేసుకొన్నను అది చెల్లదు సరికదా, అతడు ఇండియన్ పీనల్ కోడ్ప్రకారము దండనకు పాత్రు డగును. వాడు సరియగు ప్రబలకారణము లుంటే కోర్టుద్వారా డైవర్సు (విడాకులు) పొందవలెను. అపిమ్మట వారిలో పురుషుడు, స్త్రీ కూడ తమ కిష్టులగువారిని పెండ్లియాడవచ్చును.

మహమ్మదీయులలో పురుషుడు నలుగురు స్త్రీలను వివాహమాడవచ్చును కాని, క్రియలో వారిలోను బహుభార్యాత్వము చాల అరుదు. వారిలో వివాహకాలమందే భర్త భార్యకు కొంతమహర్ సొమ్ము నిచ్చుటకు బాధ్యుడగును. మరియు, ఆమె కొన్ని సందర్భములలో కోర్టుకు వెళ్లకుండనే భర్తతో 'తలాక్' అనగా విడాకులు పొంది, అతనితో నిమిత్తములేకుండ తన కిష్టుడగు నితరుని పెండ్లియాడవచ్చును.

ఇట్లే బౌద్ధస్త్రీలకును మనలో లేని కొన్ని హక్కులు కలవు.

కనుక, ఇతరమతముల స్త్రీలకు హిందూస్త్రీలకన్న వివాహవిషయములో నిపు డెక్కువ స్వేచ్ఛ గలదు. అందువల్ల కొందరు హిందూస్త్రీలు—ముఖ్యముగ వితంతువులు—స్వమతము విడచి, క్రైస్తవులలో, ముస్లిములలో యగుట కలదు. తరుచు బెంగాలు పంజాబులలో నిట్టివి సాంఘికకలహములకు, రక్తపాతములకు కూడ కారణ మగుచున్నవి. అయినను, ప్రస్తుతపు హిందూవివాహపద్ధతి శిష్టాచారసిద్ధమగునేకాక, శ్రుతిస్మృతివిహితమని మనలో చాలమంది చెప్పుచున్నారు. ఆచారము దేశకాలములనుబట్టి సంఘమునకు క్షేమకరముగా మారవలె నని ధర్మశాస్త్రములలోను చెప్పబడియున్నది.

మన హిందూవివాహములకు స్మృతులే ముఖ్యాధారములు. వానిలో ముఖ్యమయినది మనుస్మృతి. దీనిలో పురుషు డెట్టి కారణము తెలుపకుండ భార్యను విడచి యింకొకతెను పెండ్లిచేసుకోవచ్చు ననియు, స్త్రీలు విధవలైనను మరల పెండ్లి యాడగూడ దనియు చెప్పలేదు. స్త్రీ గొడ్రాలు, రోగగ్రస్తురాలు మున్నగు లోపములు గలదైతే, ఆమెకు తగు వసతు లేర్పరిచియు, ఆమెఅనుమతిని బొందియు పురుషుడు మరల వివాహమాడవచ్చునని చెప్పియున్న సంగతి నిజమే. [1]ఈకారికలు పురుషులకే లాభకరములు. కాని ఆచరణలో ఈకారణముల రుజువుకూడ లేకుండను, ఆమె కాధివేదనిక మీయకుండనే, పురుషులు మరల పెండ్లాడుట, అట్లు చేతుమని అత్తవారిని, భార్యను బెదిరించుట కలదు. సంఘములో పురుషులే ప్రబలులు. వారు స్మృతులలో స్త్రీలకనుకూలమగు కారికలు వ్యర్థమగునట్లు చేయుచున్నారు. ఉదా: భర్త పోయినను, దేశాంతరగతుడైనను, నష్టుడైనను, భ్రష్టుడైనను, నపుంసకుడైనను స్త్రీకి పునర్వివాహము చేయవలెనని [2]స్మృతిలో నున్నను, సంఘ మందుకు వ్యతిరేకమే. 'నాతిచరామి' మున్నగు వాక్యములతో వివాహవిధిలో దంపతులు పరస్పరము బాధ్యత గల్గి, భార్య పతివ్రతగను, భర్త యేకపత్నీకుడుగను

---

1. సురాపీ వ్యాధితా ధూర్తా వంధ్యార్థఘ్న్యప్రియంవదా, స్త్రీప్రసూ శ్చాధివేత్తవ్యా పురుషద్వేషిణీ తథా. అధివిన్నాతు భర్తవ్యా మహ దేనో ఽన్యథా భవేత్, యత్రానుకూలం దంపత్యోః త్రివర్గస్తత్ర వర్ధతే. (యాజ్ఞవల్క్యస్మృతి)

2. నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ, పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే.

ఉండుటయే సామాన్యముగ నుండదగునని స్మృతికారుల భావముగ దోచును.3

బహుపత్నీత్వము సంఘమునకు హానికర మని యంతగా చెప్పనక్కరలేదు. సవతుల కయ్యము కొట్లాటలు,పురుషులు భార్యను బెదరించి చిక్కులుపెట్టుట, మొదటి భార్యకు దాంపత్యసౌఖ్యము లేకుండుటేకాక తరుచు మనోవృత్తిహక్కును లేకుండ, పుట్టింటికి భర్తకుటుంబమునకు భారముగ నెంచబడుటచే ఒకప్పు డాత్మహత్య జరుగుటయు సంభవించుచున్నది. హీనకులములకన్న శ్రీమంతుల 'గౌరవకుటుంబము'ల లోనే యీబాధ హెచ్చుగ నున్నది. కొన్ని జమీందారీకుటుంబములలో బహుపత్నీత్వము సంప్రదాయమగుచున్నది. ఇప్పటి రాజులకు నిజమైన రాజత్వము పోయినను ఇట్టి దుష్టసంప్రదాయముమాత్రము మిగిలినది. ఇట్టిఘోరకుటుంబ స్త్రీల బాధలు వెల్లడికాకున్నను చాల శోకకరము లనుట కెట్టి సందేహమును లేదు.

స్త్రీలు గౌరవింపబడు కులములే వర్ధిల్లును, స్త్రీజాతిని హీనపరచి బాధించు సంఘ మంతయు నశించి తీరు నని మనుస్మృతిలోను చెప్పబడినది. 4 స్త్రీల గుణములు, దేహమనస్సులు నెట్లుండునో వారి వంశీయులందరు నట్లే యుండుట సహజముకదా!

మన దేశములో పూర్వము మహాభారతయుద్ధకాలములో లక్షలకొలది పురుషులు హెచ్చుగ మరణించగా, జనాభాలో స్త్రీల సంఖ్య హెచ్చియుండెనట. అట్టి సందర్భములో పురుషులకు బహుభార్యాత్వమున కనుమతి నిచ్చుటలో నర్థమున్నది. ప్రస్తుత మా స్థితి పూర్తిగ మారినదని నేటి ప్రభుత్వమువారు తయారు చేయించిన జనాభాలెక్కలవల్ల స్పష్టమగుచున్నది. మరియు లక్షలకొలది వితంతుహిందూస్త్రీలు ఆమరణము బ్రహ్మచారిణులై యుందురు. కనుక వివాహమునకు సిద్ధమగు హిందూస్త్రీల సంఖ్య అట్టిపురుషుల సంఖ్యకన్న తక్కువయేకదా. అట్టిస్థితిలో పురుషు డేకకాలమం దొకభార్యనే కలిగియుండవలె నను శాసన ముండుట సంఘమునకు క్షేమకరమే.

భర్త మరణించినప్పుడేకాక, ఆతడు నష్టుడు, భ్రష్టుడు, సన్యాసి, నపుంసకుడు అయినప్పుడును అతని భార్య మరొక పురుషుని వివాహముచేసుకొన వచ్చునని మనుస్మృతి, పరాశరస్మృతికూడ విధించుచున్నవి. వితంతువులకే పునర్వివాహ మంగీకరించని మన యిప్పటి సంఘాభిప్రాయము తక్కిన పరిస్థితులలో స్త్రీల కట్టి యవకాశ మీయకుండుట సహజమే. కాని స్త్రీలు, పురుషులుగూడ అట్టి ప్రత్యేక పరిస్థితులు కలిగినప్పుడుమాత్రము తాము పునర్వివాహము చేసుకొనవచ్చుననియు చట్టములో నిబంధన చేర్చుట మంచిది. అందుకు ప్రజాభిప్రాయము సుముఖ మైనప్పుడే అది అమలుజరుగును.

## రిజిస్టరు వివాహములు

కమిటీవారి రెండవ సూచన వివాహపు రిజిస్ట్రీకి సంబంధించినది. క్రైస్తవాదులలోను, ముస్లిములలోను జరుగువివాహములు పెండ్లిసమయమం దేప్రత్యేకపు రిజిస్ట్రారుయొద్దనో, 'కాజీ' యొద్దనో సాక్షి నిదర్శనములతో సహా పుస్తకములలో లిఖింపబడును. హిందువులలో వివాహములు కర్మకాండద్వారా మాత్రమే జరుగును కనుక అందుకు స్థిరమైన లిఖిత నిదర్శన ముండదు. ఇందువల్ల, ఒకప్పుడు లౌకికముగా చిక్కులు కలుగవచ్చును. ప్రస్తుతము బీదలును తమ యింట్లవివాహములకు బంధువులను విశేషముగా రప్పించి విశేషప్రకటన గలిగింతురు. కనుక గౌరవకుటుంబములలో నంతగా తగవు లుండకపోయినను, చాకలి, ఈడిగ, మాల, మాదిగ – ఇట్టిజాతులలో కొందరు దంపతులుగ కాపురము చేయువారు నిజముగ వివాహితులో కారో, వారిసంతానము ఔరసపుత్రులో లేక ఉంచుకొన్న స్త్రీకి పుట్టినవారో కోర్టులలో

3. అన్యోన్యస్యావ్యభిచారో భవే దామరణాంతికః, ఏష ధర్మః సమాసేన జ్ఞేయః స్త్రీపుంసయోః పరః. (మనుస్మృతి ౯–౧౦౧)

4. యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః యత్రైతాస్తునపూజ్యంతే సర్వాస్తత్రాఽఫలాఃక్రియాః, శోచంతి జామయో యత్ర వినశ్య త్యాశు తత్కులం, నశోచంతి తు యత్రైతాః వర్ధతే తద్ధి సర్వదా. (మనుస్మృతి. 3 – ౫౬,౫౭)

తేలుట కష్టమగుచున్నది. ఉభయపక్షములుమాజువాణీ సాక్ష్యమునే పెట్టుటలో తరుచు అబద్ధపు సాక్ష్యము హెచ్చును. మరియూ ఈ కులములలో ఇద్దరు భార్యలుండుటేకాక, మారుమనుము పద్ధతియు ఆచారముగ నములుజరుగుచున్నది. అసలు వివాహమునకే లిఖితము లేనప్పుడు, వారిలో లిఖితము లేకుండనే వివాహవిచ్ఛేదమును జరుగుచుండును. సరే. కాని, క్రమప్రకారము విడాకులు జరిగితేనే ఆభార్య చేసుకొను పునర్వివాహము చెల్లి, దాంపత్యపుహక్కు లేర్పడును. అందునుబట్టి వారల ఆస్తిసంక్రమణము జరుగవలె. కనుక, తరుచు ఒకస్త్రీ నిజమైన భార్యయా, భర్తతో క్రమముగ విడాకులు జరిగినదా, ఆమెమారుమనుము క్రమమయినదా—ఇట్టి ప్రశ్నలు తరుచు సివిలుక్రిమినలుకోర్టులలో వచ్చుచున్నవి. వాటి పరిష్కారము కష్టమగుచున్నది. అందువల్ల వివాహము కొద్దిఫీజుతో రిజిస్టరుచేయించుకొనుటవల్ల యథార్థనిదర్శనము దొరకగలదు. చిరకాలమునుండి సంప్రదాయముగ వచ్చు కర్మకాండను వదలుకొనక్కరలేదు. దానిని యథావిధిగ చేసుకొన్నను రిజిస్టరుకూడ చేసుకొనుట మంచిది. స్థితిమంతులు కానివారు ఇప్పటివలె ప్రచురణకై విశేషపు వ్యయప్రయాసలపాలు కాకుండ నిరాడంబరముగ ఏకరాత్రి వివాహములు నిశ్చింతతో చేసుకోవచ్చును. ఇందువల్ల పెండ్లి యజమానుల కెంతియో ఖర్చుతోబాటు శ్రమయు కలసివచ్చును. ప్రతిపెండ్లియు రిజిస్టరు చేసి తీరవలెనని నిర్బంధ ముండదు. కాని, రిజిస్ట్రేషను చర్య వివాహము జరిగినట్లు నిరాక్షేపణయగు సులభనిదర్శనముగ నుండును. కర్మకాండ యథావిధిగ జరిగినట్లు తగు రుజువు లేకపోయినను బాధ యుండదు; వివాహమునకు రిజిస్టరీ యున్నప్పుడు వారిలో విడాకులు జరిగినప్పుడు దానికిని రిజిస్టరీ జరుగుట యవసరము.

లేకుంటే, ఆ వివాహసంబంధ మమలులో నున్నదో, లేదో యని సందేహము కలుగును. రిజిస్టరుపద్ధతివల్ల మోసమునకు అవకాశము తగ్గును.

## సగోత్రవివాహములు

పూర్వము సమష్టి కుటుంబపద్ధతియే విశేషముగా అమలులో నుండెను. తరుచు సపిండులు, ఒకే గోత్రము వారును ఒకే కుటుంబమువలె గట్టి అనుబంధము గలిగి ఒకే చోట కాపురముండుచుండిరి. ఆకాలములో ఒకేగోత్రపు వారి సంఖ్యయు చాల తక్కువయై, వారు తరుచు సమీపబంధువులుగ నుండేవారు. శతాబ్దులు గడచి పరిస్థితియంతయు మారినది. ఆచారమును కొంతవరకు శాస్త్రవిధులకు భిన్నముగ మారినది. తల్లి వైపునను అయిదుతరములకు సపిండసంబంధము గల కన్యను పెండ్లి చేసికొనకూడదని స్మృతులలో చెప్పినారు.[5] కాని, వాటిలో సమీపసంబంధములగు మేనరికము, ఎదురు మేనరికము—ఇట్టి పెండ్లిండ్లును మన ప్రాంతములలో ధారాళముగ జరుగుచున్నవి. మేనగోడలిని గూడ కొందరు పెండ్లాడుట కలదు. వారల సంబంధము వారి తాతవద్దనే, అనగా మూడవ తరములోగానే కలియును. కనుక ఇది సమీప సపిండత్వ మనుటకు సందేహము లేదు. అయినను ఆపెండ్లి శాస్త్రీయముగనే భావింతుము. కాని బంధుత్వ మేమియు తెలియనంతటి దూరమైనను ఒకేగోత్ర మయినంతనే వివాహము మానుచున్నారు. అందువల్ల అనుకూలవివాహములు దొరకుట కష్టమగుచున్నది. సగోత్రులలో వివాహము కూడదని ధర్మశాస్త్రములో చెప్పియున్నారు. కాని, ఇక్కడ సగోత్రులనగా ప్రత్యక్షముగ ఆయాతరముల సంబంధము తెలియబడినవారే అని నిర్ణయించవలెను. యాజ్ఞవల్క్య స్మృతియు, దాని వ్యాఖ్యానమగు మితాక్షరయునే ఇట్టి విషయములలోను, ఆస్తి సంక్రమించు హక్కులలోను జనులలోను, ఇప్పటి బ్రిటిషుపాలితమగు కోర్టులలోను పరమప్రమాణముగ నంగీకరింపబడుచున్నవి. వీనిలో వారసత్వపు సందర్భములో "పత్నీ దుహితరశ్చైవ ...తత్సుతో గోత్రజో" అను స్మృతికారికను వ్యాఖ్యానము చేయుటలో[6] విజ్ఞానేశ్వరుల్వారు తమ మితాక్షరలో జన్మసంబంధమును, వారల పేరులు తెలియ

---

5. అరోగిణీం భ్రాతృమతీం అసమానార్ష గోత్రజాం, పంచమా త్సప్తమా దూర్ధ్వం మాతృతః పితృత స్తథా. (యాజ్ఞ. ఆచార. ౫3.)

6. తేషా మభావే సమానోదకానాం ధనసంబంధః, తేచ సపిండానా ముపరి సప్త వేదితవ్యాః జన్మనామావధిశా వా...(మితాక్షర)

బడినవారు అని వ్యాఖ్యానించినారు. మరికొన్ని స్మృతులలోను సగోత్రశబ్దము నట్లుపయోగించినారు. కనుక స్పష్టముగ తరముల సంబంధము తెలియనివారు, బంధుత్వ మున్నట్లు తెలియబడినవారు ఏకగోత్ర ప్రవరలు కలిగియున్నను పరస్పరము వివాహములు చేసుకోవచ్చునని నియమ మేర్పరుపదగునని తోచును. వర్ణాంతర వివాహము లప్పుడు జరుగుచుండినట్లు మాత్రము చాల నిదర్శనములు కలవు. ఇట్టి సంకరవివాహములవల్ల కలిగిన జనులకు వేర్వేరుగ నిషాదులు మొదలగు పేరులు స్మృతులలో చెప్పబడినవి. మరియు, ఈ వర్ణాంతర వివాహములను రెండుగ విభజించినారు—అనులోమ ప్రతిలోమము లని. పైవర్ణపు పురుషుడు క్రిందివర్ణపు స్త్రీని చేసుకొనునది అనులోమవివాహము (ఉదా: బ్రాహ్మణుడు క్షత్రియవైశ్య శూద్రకులాలలో నొక స్త్రీని వివాహమాడినపుడు). క్రిందికులపు పురుషుడు పైకులపు స్త్రీని పెండ్లియాడినప్పుడు ప్రతిలోమ వివాహము. వీనిలో అనులోమవివాహమును సవ్యమని స్మృతికారు లొప్పుకొన్నారు. ప్రతిలోమ వివాహములు అనుచితము లని చెప్పబడినది.[7] అయినను, ఏవర్ణమువారైనను సవర్ణులనే, అనగా తమ వర్ణపు వారినే పెండ్లియాడుట ప్రశస్త మని స్మృతికారుల యభిప్రాయము.[8] అసవర్ణుల, అనగా భిన్నవర్ణముల వారి వివాహములవల్ల కలిగిన కొమాళ్ల పేరులు, వారి వారసత్వపు హక్కులు కూడ స్మృతికారులు చెప్పియున్నారు. మరియు కొందరు హీనజాతిస్త్రీలు ఉత్తమజాతిపురుషులను వివాహమాడి తాము పూజ్యత నొంది రనియు చెప్పబడినది.[9] ఇదిగాక, వ్యాస పరాశరాది మహర్షులను బ్రాహ్మణులైనను వారి తల్లులు, భార్యలు వేరుకులమువా రయినట్లు పురాణ నిదర్శనము లున్నవి.[10] ఈ జాతిభేదములు జన్మనుబట్టి యేర్పడి స్థిరముగ నుండుట ప్రస్తుతపు ఆచారమయినను మహాభారతాదుల కాలములో కొంతవరకైనను గుణప్రధానముగ నుండి, జాతిలో మార్పులు సాధ్య మను భావము నుండినట్లు కనబడును.[11] బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యమునుగూర్చి చాల కఠినియమములు మను స్మృతిలో చెప్పబడినవి. కాని, అందులోను, కొంత కాలమునకు మారవచ్చు నని చెప్పియున్నారు.[12] ఈ కాలమందు వర్ణాంతరవివాహము లాచరణలో లేని మాట నిజము. యథార్థమున కొకేవర్ణములోని ఆయా శాఖలమధ్యను వివాహములు చాల అరుదుగనే జరుగు

---

7. యాజ్ఞవల్క్య స్మృతి ౯౦–౯౧ లపైన మితాక్షరవ్యాఖ్యానమును చూడుడు.

8. "ఉద్వహేత ద్విజో భార్యాం
సవర్ణాం లక్షణాన్వితామ్." (మను. 3-౪.)

9. "అక్షమాలా వసిష్ఠేన
సంయుక్తాఽధమయోనిజా,
శారంగీ మందపాలేన
జగామాభ్యర్హణీయతామ్.
ఏతా శ్చాన్యాశ్చ లోకేఽస్మిన్
అపకృష్టప్రసూతయః,
ఉత్కర్షం యోషితః ప్రాప్తాః
స్వైఃస్వైః భర్తృగుణై శ్శుభైః"
(మను. ౯-౨౩, ౨౪)

10. "జాతో వ్యాసస్తు కైవర్త్యాః,
శ్వపాక్యాస్తు పరాశరః,
బహవోఽన్యేపి విప్రత్వం
ప్రాప్తాయే పూర్వ మద్విజాః"
(మహాభారతం, అరణ్యపర్వం)

11. "శూద్రోఽపి శీలసంపన్నో
గుణవాన్ బ్రాహ్మణో భవేత్,
బ్రాహ్మణోఽపిక్రియాహీనః
శూద్రాత్ప్రత్యవరో భవేత్"
(భారతం, అరణ్యపర్వం)

"నయోని ర్నాపి సంస్కారః
నశ్రుతం నచ సంతతిః,
కారణాని ద్విజత్వస్య
వృత్త మేవతు కారణం"
(భారతం, అనుశాసనికపర్వం)

12. "శూద్రో బ్రాహ్మణతా మేతి
బ్రాహ్మణశ్చాపి శూద్రతామ్,
క్షత్రియా జ్జాత మేవంతు
విద్యా ద్వైశ్యం త థైవచ."
(మను. ౧౦-౬౫.)

చున్నవి. అందు కిప్పు డట్టి నిషేధమును లేదు. ఇప్పటి హిందూలా ప్రకారమును సవర్ణులలో శాఖాంతరవివాహము (ఉదా: వైష్ణవులకుస్మార్తులకుమధ్యను, కాపులకు కమ్మవారికిమధ్యను) సర్వవిధములను చెల్లును.[13] ఈకలియుగములో వర్ణాంతర వివాహములను మరికొన్ని పూర్వాచారములతోబాటు బుద్ధిమంతులు నిషేధించినా రని కొన్ని పురాణములలో చెప్పబడియున్నది. నిజమే. కాని శాఖాంతరవివాహముల కట్టి నిషేధము చెప్పలేదు. కనుక, ఇప్పుడు వర్ణాంతర వివాహములు చేసుకోవచ్చు నని ప్రభుత్వమువారు చట్టముచేసినను, ఇప్పటి సాంఘిక పరిస్థితిలో విశేషముగ నట్టి వివాహములు జరుగ వని మనము భావింపవచ్చును.

ఆయావర్ణములవారికి స్మృతులలో చెప్పిన ప్రత్యేకవృత్తులు, గుణములు నీకాలములో పాటింపబడుట లేదు. పూర్వపు పరిస్థితులు మారి క్రొత్త పరిస్థితు లేర్పడినవి. శూద్రు లధ్యాపకులుగను, బ్రాహ్మణులు వ్యవసాయకులుగ నుండుట కలదు. ఎందరో క్షత్రియులు స్వదేశస్వరాజ్యరక్షణను మరచి పరరాజ్యమందు తమ భక్తిని ప్రకటించుచున్నారు. వైశ్యులతోబాటు అన్నిజాతులవారును వివిధరీతుల వ్యాపారము చేయుచున్నారు. అన్నికులములవారు, అన్నిజాతులవారు పరదేశీయప్రభుత్వముక్రింద సేవకవృత్తి చేయుటకు సిద్ధపడుటేకాక, అందుకు తీవ్రముగ పోటీచేయుచున్నారు. సంఘస్థితి యిట్లు మారి, స్వేచ్ఛాభావము వ్యాపించుకొలదిని కొద్దిమంది వర్ణాంతరవివాహము చేసుకొందలచుట సహజము. అట్టి వివాహములు హిందూలాప్రకారము చెల్లవు. అనగా ప్రతిలోమ వివాహములేకాక అనులోమవివాహములును చెల్లవని స్పష్టముగ మన కోర్టులలో చాలసారులు తీర్పుచేయబడినది. ముఖ్యముగ కులాచారములను పాటింపక యువతీవివాహములను జేసుకొను సంస్కర్తలగు బ్రాహ్మసామాజికులు, ఆర్యసామాజికులు వర్ణాంతరవివాహములను జేసుకొనుటకు కాక్షేపణ లేదు. అట్టి వివాహములు చెల్లుటకై ౧౮౭౨-వ సం. లో 'స్పెషల్ మారేజి ఆక్టు' అనుపేర నొక చట్టమును భారత ప్రభుత్వమువారు చేసిరి.[15] కాని, దానిక్రింద పెండ్లియాడువారు వివాహము రిజిస్టరు చేసుకొని తీరవలెను. మరియు వారు ఆసమయమందు తాము హిందూ, క్రైస్తవ, ముస్లిము, బౌద్ధాదిమతములలో దేనికిని జెందమని

---

ఆపస్తంబ ధర్మసూత్రములలో నింకను స్పష్టముగ వర్ణపరిణామము స్థాపింపబడినది.

" శూద్రయోనౌహి జాతస్య
సద్గుణానుపతిష్ఠతః,
వైశ్యత్వం లభతే బ్రహ్మన్
క్షత్రియత్వం తథైవచ.
ఆర్జవే వర్తమానస్య
బ్రాహ్మణ్య మభిజాయతే "

13. ఆలిండియా రిపోర్టరు ౧౯౩౬ ప్రీవీకౌన్సిలు ౧౯౮ పుట కేసు చూడుడు. ఈకేసు వివరములు విచిత్రమయినవి. ఇది ఒకవైశ్యకుటుంబపుదట. ఇందులో నొక డొక భార్యను విసర్జించి మరియొకతెను చేపట్టెను. ఆ మొదటిభార్య శాఖాంతరీయుడగు మరొక పురుషుని పెండ్లియాడెను. కనుక, ఇందులో మారుమనుమకు వారిలో కులాచారమున్నదా, రెండవ వివాహము జరిగిన సంగతివాస్తవమేనా? ఇట్టిప్రశ్నలును కోర్టువిచారణలో వచ్చినవి. ఏకపత్నీత్వము, వివాహపు రిజిస్టరీయు అవసరము లనియు ఇందలి వృత్తాంతములవల్ల సూచితము.

14. ఆలిండియా రిపోర్టరు ౧౯౪౧ మద్రాసు ౨౧౩=౨౪౩ లా వీక్లీ ౬౯౩ పుట తీర్పు చూడుడు. జ. సోమయ్యగారి కేసులో ప్రమాణములను విపులముగ చర్చించినారు. ఒక చిత్రము. ఈ కేసులోనిసాక్ష్య నిదర్శనమునుబట్టి ౧-వ వాదికి జానకిరామమూర్తితో వివాహముకాలేదని జ. సోమయ్యగారెంచిరి. వివాహము జరిగినట్లు రెండవజడ్జి పాండురంగరావుగారు భావించిరి. కనుక మూజువానీ సాక్ష్యముకన్న రిజిస్టరు చేయుట మంచి దని తేలుచున్నది.

15. ౧౮౯౮ సం॥ న 3 రు ఆక్టు. శ్రీ సరోజిని నాయుడు మున్నగువారి వివాహములు దీనిప్రకారము జరిగినవి.

ప్రకటించుకోవలెను. ఇందు క్రింద కొందరు వర్ణాంతరీయులను పెండ్లియాడిరి. కాని, తాము హిందువులమే కామని బహిరంగముగ నట్లు ప్రకటించుకొనుట హిందువులకు మనస్కరించదు. అట్లు చేయ కొందరు బ్రాహ్మసామాజికు లెట్లో సమ్మతించినను, ఆర్యసామాజికులు హిందువులుగ నుండియే వర్ణాంతర వివాహము జరిగించుకొనుట కవకాశము కావలెనని యాందోళనచేసినారు. తుద కొకచట్టమా ప్రకారము ౧౯౩౭-వ సం. లో సవరింపబడినది.[16] ఈ సవరణ ఆర్యసామాజికులకు కొంత తృప్తి కలిగించినది. వేరుకులముల హిందువులు పెండ్లియాడుటకు స్వమతము విడువ నక్కరలేదు; నిజమే. తక్కిన మరి కొందరు హిందువుల కంతటితో సంతుష్టి కాలేదు. ఈ యాక్టుప్రకారము వివాహము చేసుకొనువారు తరువాత ఇండియన్ డైవర్సు ఆక్టుప్రకారము వివాహ విచ్ఛేదము పొంది, మరియొకరిని పెండ్లియాడుట కధికారమున్నది.[17] ఇట్లు విడాకులకు వీలుండు షరతుకు లోబడి వివాహము చేసుకొనుట హిందూభావములకు వ్యతిరిక్తము. మరియు, ఈ సవరణచట్టము ప్రకారమును ఈ యాక్టుక్రింద దంపతులనువారు దత్తతచేసుకో కూడదు (౨౮-వ సెక్షను). ఇంతేకాక, వీరు తాము హిందువులమే అని ప్రకటించుకొన్నను, వీరి ఆస్తి వారసత్వము హిందూ లాప్రకారము జరుగక, ఇండియను సక్సెషను ఆక్టులో విధించిన ప్రకారమే జరుగవలె నను షరతు కలదు. ఇదియు చాలమంది హిందువుల మనోభావములకు భిన్నము. కనుక, ఇట్టి బాధకములు లేకుండ వేరువేరుకులములవారు పరస్పరప్రేమచే నాకర్షితులై వివాహ మాడదలచినప్పుడు ఆ సంబంధము వారి హిందూసంప్రదాయములకు లోబడి, అనగా వారి వివాహితజీవిత మంతయు నిలిచియుండునట్లును, హిందూలావారసత్వము వర్తించునట్లును పెండ్లియాడుట కవకాశము కావలె నని కొందరు కోరుచున్నారు. ఇట్టి యవకాశము నిచ్చుటవలన హిందూసంఘమునకు నష్టమేమియు లేదు. ఇందువల్ల వర్ణద్వేషపు వైకల్యము తగ్గి, ఆయావర్ణములవారి మధ్య కొంత సుముఖత యేర్పడవచ్చును.

ఇట్లు, మొత్తముమీద ఈ 'రావుకమిటీ' వారింతవరకు ప్రచురించిన సూచనలు ఆచరణీయములు, హిందూసంఘమునకు క్షేమకరములుగ నున్నట్లు తోచుచున్నది. ఇందునుగూర్చి మహాజనులు తమ యభిప్రాయమును ప్రభుత్వమునకు వెల్లడిగా తెలుపవలసియున్నది. వివాహవిషయములోను, ఇంకను వారసత్వము, దత్తత వగైరాలనుగూర్చియు ఇంకను చాల సవరణలు కావలసియున్నది. అన్ని విషయములకు కలిపి ఒకే విపులమగు హిందూలాచట్ట మేర్పడుట మంచిది. కనుక, రావుకమిటీవారు మిగతా అంశములనుగూర్చియు తమ సూచనలను వెంటనే చేయవలెనని వారిని ప్రజలు తొందరచేయవలసియున్నది.

---

16. అందుకై ౧౯౩౭ సం॥ సె ౩౦ రు అక్టు ప్రకారము ౧౯౫౪-వ సం. అక్టులో కొన్ని కొత్త మాటలు, కొన్ని కొత్త సెక్షనులును చేర్చబడినవి.

17. ౧౯౫౪-వ సం॥ సె ౩ రు అక్టులో ౧౫-వ సెక్షను చూడుడు.



# దౌర్బల్యము

= శ్రీ సానిపిని జోగిరాజుచౌదరి =

పెంచితి నిన్నినాళ్లు కడుప్రేముడి నే కొరతేనిలేక, న
న్నుంచితి నీనిలింపనగరోజ్జ్వలచైత్ర సుశోభితావనిన్
నించితి నీవు నాహృదిని నిర్మలరాగ సుధారసంబులన్
వంచన జేసితే! తుదకు వ్యర్థపుత్రోవలద్రోచి యీగతిన్.

తలపయి మోపినట్టి బలితమ్మగు భారము మోసికొంచు, లో
కుల తరహాల నమ్మి యవి కుట్రలటం చెరుగంగలేక, యే
నలసటజెంది యీబరు వొకంతన దించి భుజమ్ము మార్చగా
కలకల నవ్వె లోక మదిగాంచితి, తోడనె క్రుంగితిన్ ప్రభూ.

మోవదరంబుగాని పెనుమోపుగ కష్టము లెంచికూర్చి, న
న్నీవిధి క్రుంగదీసి కడునీరసపెట్టి తితిక్షలేని దుః
ఖావహు జేసినాడ విక కాలుని రాకకు వేచియుంటి, నా
జీవిత మంతకంతకును చీకటిదారుల జోపితే ప్రభూ.

నా కిపు డీప్రపంచమున నాయనువారలు లేనెలేరు, చీ
కా కయిపోయె నాబ్రతుకు, కారణ మిట్టిదటంచు జెప్పగా
నాకవకాశమేది? మది నాటె నెదో గత జన్మస్వప్న; మెం
దాకను వ్రేల్చె దీప్రళయదారుణపావకకీలలన్ ప్రభూ.

ఏవిధినైన నీయసువు లెన్నడొ వీడుట తథ్య మందుచే
చావున కేడ్వ, నన్నిటుల చచ్చియు చావనియట్టి ఘోరదుః
ఖావిలకీలలందు నుసిగాగనొనర్చి మదీయభస్మమున్
ఈవె లలాటమందు ధరియించెద వెంతకఠోరమూర్తివో!

రెక్కలెదిగిన నాకు నీఒక్కగూటి-వాసమేలని, గూటికావలనయున్న
పలురకమ్ముల మాధురీఫలరసమ్ము-లానవలతును కాని, కాలూనలేను.

---

# కలగూరగంప

## చీనా దేశంలో స్నానమందిరపు చిత్రాలు

ఇప్పటి చీనా-జపాను యుద్ధం సాగిన తరువాతనే- 'లూయీ ఋష్' అనే దొర చీనా 'స్నాన మందిరాల'లోని వైచిత్ర్యాలను పరికించి, 'జపాన్ టైమ్సు' పత్రికలో స్వీయాభిప్రాయాలను ఇట్లా వెల్లడించినాడు :

“చీనా దేశీయులంటే నా కెంతో అభిమానం. అయినా, వారి శుచిత్వాన్ని గురించి మాత్రం ఎక్కువ అనుకూలముగ చెప్పలేను. వారు అరుదుగా వళ్లు తడుపుకునేవాళ్లలో లెక్కకు వస్తారంటే అతిశయోక్తి కాదు.

షాంఘై మొదలయిన బస్తీలలోని స్నాన మందిరాలను చూచుకుంటూ వచ్చా. చచా అనిపించింది. ఈ విముఖతవల్లనే — 'ట్సినాన్'లోని ప్రసిద్ధ స్నాన మందిరం చూచివద్దామని ఒక జపాన్ మిత్రుడు పిలిచేసరికి, మనసు లేని మనువుగా అంగీకారం తెలుపవలసి వచ్చింది.

సరి-దీర్ఘమయిన ప్రయాణం సాగించి, ఆయాసంతో రెయిలు దిగి, 'ట్సినాన్'పట్టణంలో కాలు పెట్టాము.

స్నానం చేయుటలో ఈపట్టణమున అనుభవించి ఆనందించినట్టి మహాభోగం జన్మలో మరెక్కడా అనుభవించి ఉండలేదని అన్నాడు మిత్రుడు. ఆ స్నానమందిరాలను గురించిన స్తుతివచనాల్ని-అందులోనూ ఒక జపనీయుని నోటినుండి వెలువడిన వంటే, ఏదో ఆకర్షణ ఉండితీరాలని వూహించుకున్నా.

చివరకు అతడు చెప్పినదంతా అక్షరాలా నిజమే అయింది. 'ట్సినాన్'నగరాన వెలకొన్న ఆ సుప్రసిద్ధమందిరానికి 'మింగ్ ట్సు చిన్' స్నానమందిరమని పేరు. ఉన్నమాట చెప్పొద్దూ—అదే కైలాసమనిపించింది నామట్టుకి నాకు.

ఒక బ్రహ్మాండమయిన ఆస్పత్రివంటి దివ్యభవనం. దాన్ని పరివేష్టించి రామణీయకమైన ఆరామం. మందిరం ప్రవేశిస్తావుంటే...వందలూ వేలూ నవుకర్లు వచ్చి అతిథుల్ని ఆహ్వానించి అతి ఆప్యాయంగా తోడ్కొని పోతారు. “తమరు ఏ తరగతికి వెళతారండీ?” అని చెప్పి ఎంతో వినయంగా అడిగి తెలుసుకుంటారు.

అక్కడి స్నానవిధానం ముఖ్యమయిన నాల్గు తరగతులు. ఇవి కాలవశంలో చిక్కకొనివున్న జనసామాన్యానికి. కాలాన్ని వశపరుచుకోగల్గిన మహాభోగులు శ్రీమంతులకోసం మరిరెండు పెద్దతరగతులు ఏర్పడి వున్నాయి. మేము సామాన్యపు ఫస్టుక్లాసుకు పోతామన్నాము. దీని రేటు 3 షిల్లింగుల ౬ పెన్సులు.

మొదటి అంతస్తు: పెద్ద నడవలో — సుధాధవళమగు కుషన్లతో అమర్చబడి, పరమసుందరములయిన బెంచీలు చుట్టూతా తీర్చివున్నాయి అక్కడ జపాన్ సైనికులు దర్జాగా పొగ పీలుస్తూ నీలిమేఘాలలో లీనమయ్యేట్టు రింగురింగులు వదుల్తున్నారు.

రెండో అంతస్తులో మూడు, నాల్గు తరగతులు: తెల్ల జుబ్బాలు తొడుక్కున్న బాలురు — చైనీయుల పెద్దలకూ, జపానీస్ సార్జెంట్ మేజర్లకూ, కార్పొరల్సుకూ తేనీటి పానీయాలు అందిస్తున్నారు.

అక్కడినించి దిగి, మాకు నిర్ణీతమయిన తరగతికి వచ్చేసరికి—'సంఘం' అనే క్లాసు మావెంపు రవంత కసువాయిలోనే వెళ్ళగినట్టు తోచింది. కల్నల్సు, కప్తానులు, లెఫ్టినెంటు జనరల్సు-ఇత్యాది ముత్తాలన్నీ ఇక్కడ తారసపడ్డవి.

ముగ్గురకు సరిపడే ఒక ప్రయివేటు గదిలోకి మాకు పరిచారకులు దారిచూపించారు. దాన్లో మూడు ఆరమ్-చేర్సు (చేతులు ఆనుకునే కుర్చీలు), గిరగిర తిరిగే ఒక పెద్ద కుర్చీ, మేజా, ఒక అందాల తివాసీ, ఉమియుటకు గాను తళతళ మెరిసే ఒక యిత్తడిపాత్ర–ఇవీ కన్నులపండువుగా అక్కడ ఉన్నవి. గోడలు నలుపక్కలా చట్రాలుకట్టిన చిత్రపటాలతో అలంకృతాలై, చూపుమాత్రాన మానవహృదయాన్ని ఆకట్టుతున్నవి.

ఆటనుండి ఒక స్ప్రింగ్ తలుపు తెరిచేసరికి — స్నానపుగదికి దారి. ఈగదిలో, యూరపియన్ స్టయిల్ లో ఇరువురకు తగిన చక్కటి ఇరు వున్నది. రెండు 'షవర్లు' (నీటిజల్లుతో స్నానంచేసే పరికరాలు) ఉన్నవి. ఆప్రదేశపుసౌందర్యము ఇట్టిదీ అని చెప్ప నలవి కాదు.

మేము వళ్లు తోముకుంటూవుండగా ఇద్దరు పరిచారకులు మమ్మల్ని కనిపెట్టి చూస్తూ●ండిరి. తదుపరి, వారు లోనికి వచ్చేశారు. మాకు కీలుకీలూ నొక్కారు. భుజాలు, వీపు, తొడలు, పిక్కలు—సమస్త అవయవాలూ సాంగోపాంగంగా మాలీసుచేసి వళ్లు పండులా తోమినారు. ఉండీ వుడిగీ వాళ్లు వెచ్చ వెచ్చటి నీళ్లు పోసి శరీరాన్ని మాలీష్ చేస్తూవుంటే "ఆహో, ఇంతకు మించిన ఇహలోకసౌఖ్యం లేదు కాబోలు, జన్మ ధన్య మయిం" దనుకున్నాము.

కొంతసే పయినతరవాత–సరే, స్నానం అయిపోయిందికదా అని అనుకుని ఆరమ్–చేర్ లో కూలబడబోయినా. కాని, నామిత్రుడు వెంటనే నన్ను అటకాయించి – "'అకాటూరి' చేయించుకోవద్దా మనం?" అన్నాడు.

"ఇదేమిట్రా భగవాన్! – ఈపేరు ఎన్నడూ విననే లేదే" అని గతుక్కుమన్నా.

నేనట్లా నివ్వెరపడటం గమనించి అతడు "ఓయి పక్షీ, రావోయి చూడువుగాని తమాషా" అంటూ "అది చేయించుకోని జన్మ యెందుకూ..." అని మందలించాడు.

"సరే" నని తలవూపా.

నాలాగ్గనే మీరూ అబ్బురపడక తప్పదు—ఈ 'అకాటూరి' అంటే యేమిటా అని. ఆసంగతే యిప్పుడు చెప్పబోయేది: 'అకాటూరి' అనగా ఎర్రటి పిట్ట అని అర్థమట. దాన్ని బట్టి తయారయిన స్నానవిధానం యిది. ఇది చేయించుకున్న తరవాత, వారు కనిపెట్టిన విధానానికి ఈపేరు సరిపోయిం దనుకున్నా.

అదేదో వస్తువ పెట్టి, సుమారు యిరవై నిమిషాల సేపు శరీరం మర్దించేసరికి—ఇక చూచుకోనాయనా, ఎర్రరంగులో వుండే రకరకాలు యావత్తూ—ఇంతకు ముందు కని విని యెరుగనివి—ఒంటిపైన వెలియజొచ్చాయి. హాయి చెంది కుర్చీలో పడ్డా. బాగా వొక ఘంట విస్మృత స్మృతి వచ్చి, ఒక గ్లాసెడు 'బీర్' పుచ్చుకున్నా. ఆసమయంలో–శారీరకంగా, మానసికంగా, ఆత్మీయకంగా మేం పొందిన బ్రహ్మానందం చెప్పటానికి మాటలు చాలవు.

ఆ స్నానమందిరంలో మేము నాలు గ్గంటలపాటు వుండి, రాజభోగ్యమయిన విందు ఆరగించాము.

ఇటువంటి భవనాలలో చైనీయులు అదే పనిగా రేయింబవళ్లు ఉండిపోతూ వుంటారట.

సాధారణంగా చీనా దేశస్థులకు వళ్లు తోలుచుకుందామనే సంకల్పం ఏ పుష్కరానికో గాని కల్గదట. కాని, తప్పిదారి చికాకు పుట్టిందంటేమటుకి ఇటువంటి మందిరాలకు యాత్రగా వచ్చి హాయిగా స్నానం చేసుకుపోతారట.

జపనీయులకు మోస్తరుగా చైనీయులకూడా స్నానం నిత్యకృత్యాలలో ఒకటయి వుంటే ఇంతటి భోగ్యమయిన విలాసమందిరాల సృష్టికి సావకాశం ఉండేది కాదనే చెప్పవచ్చు.

నిరుపేద అయిన జపనీయునికి ౫ సెన్లు, అనగా సుమారు ౪ పెన్నీలు వెచ్చిస్తే మహాభోగ్యమయిన స్నానం లభిస్తుంది. పై చెప్పిన విధాన చైనాస్నానమందిరంలో ఒక్కసారి వ్యయించే సొమ్ము పెట్టి, అంతటి భోగంతోనూ జపనీయుడు ఒకపక్షంరోజులు స్నానభాగ్యం పొందగలడన్నమాట.

చీనా 'స్నానమందిరం'లో స్నానంచేయడం అపరూపవిలాసయుతమైన మహాభోగాల్లో ఒకటి."

ముద్దా విశ్వనాథం.

## మేధావియా, మేధావిరుద్రుడా ?

జూనునెల 'జీవన' (కన్నడ మాసపత్రిక)లో నొకరు 'జిజ్ఞాస' అను మకుటముతో నొకలేఖను ప్రచురించియున్నారు. విషయము యావజ్జనవేద్యమగుటవల్ల దాని సారము నీదిగువ నుదాహరించుచున్నాము:

మేధావియని సంస్కృతవాఙ్మయమున నొక ఆలంకారికుడు పొడసూపుచున్నాడు. అతడు భరతుని కంటె అర్వాచీనుడు; 1భామహునికంటె ప్రాచీనుడు.

భామహుడు, రుద్రటుని 'కావ్యాలంకారము' నకు వ్యాఖ్యానములను వ్రాసిన వల్లభదేవుడు, నేమిసాధువు, 'కావ్యమీమాంసా' కర్తయైన రాజశేఖరుడు— వీరందరును ఇతనిపేరును తమతమ గ్రంథములలో పేర్కొనియున్నారు.

ఉపమాదోషములు ఏడని మేధావి చెప్పినట్లు భామహుడు తన 'కావ్యాలంకారము'లో ఇతనిపేరు రెండుసార్లు స్మరించియున్నాడు.2

మేధావి రుద్రుని మతముప్రకారముగా ఉపమాదోషములు ఏడు, శబ్దవిభాగములు నాలుగు అని నేమిసాధు నిరూపించినాడు.3

మేధావిరుద్రుడు పుట్టుగ్రుడ్డు కవియని రాజశేఖరుని కావ్యమీమాంసవల్ల తెలియుచున్నది.

కాని, పైన ఉల్లేఖించిన వాక్యములనుబట్టి ఒక సంశయము కలుగుచున్నది. మేధావిరుద్రుడు, మేధావి అనునవి రెండును ఒక్కనిపేర్లేనా, లేక ఇద్దరును భిన్నభిన్నవ్యక్తులా? అథవా, మేధావి వేరే, రుద్రుడు వేరేనా? ఇది నిజముగా ఆలోచింపవలసినసంగతి. రుద్రభట్టు అనునతడు 'శృంగారతిలక'మనుగ్రంథమును రచించినాడు కాని ఆగ్రంథములోని విషయములను పరిశీలించినచో అది అలంకారశాస్త్రమునకు సంబంధించినదిగా కనబడదు. భర్తృహరి, ధర్మకీర్తి అనువారిని సంగ్రహముగా, సౌలభ్యమునకై హరి, కీర్తి అని పేర్కొనుచున్నట్లే ఈ మేధావిరుద్రునినికూడ భామహుడు సంగ్రహముగా మేధావియని సంగ్రహముగా పేర్కొనియున్నట్లే తోచుచున్నది.

మేధావిరచించిన గ్రంథము లేదియు మన కిప్పటివరకు దొరకలేదు.

---

1. భరతుడు చెప్పినవి నాలుగే అలంకారములు. ఉపమాలంకారమును భరతుడు చెప్పినాడు కాని దాని దోషముల విచారణ అతని గ్రంథములలో కానరాదు. ఈపనిని అతనితర్వాత వచ్చినవారు చేసిరి.

2. "త ఏవ ఉపమాదోషా
స్సప్త మేధావినోదితాః"
(కావ్యాలంకార. 2.40)

"యథాసంఖ్యమథోత్ప్రేక్షా
మలంకార ద్వయం విదుః,
సంఖ్యాన మితి మేధావి
నోత్ప్రేక్షాభిహితా క్వచిత్."
(అదే. 2-88)

3. సప్తోపమాదోషాః...తదేతన్నిరస్తం
ఏతా ఏవ చత్వార శ్శబ్దవిధా ఇతి యేషాం సమ్యక్ మతం తత్ర తేషు నామాదిషు మధ్యే మేధావి రుద్రప్రభృతిభిః కర్మప్రవచనీయానోక్తాభవేయుః.
(రుద్రటుని కావ్యాలంకారమునకు నమిసాధు వ్యాఖ్యానము).

———o———



# విమర్శనము

## ౧. ఆనువంశికము - వాహకులు

గ్రంథకర్త: బి. వి. రమణారావుగారు. వెల ఒక అణా. ౩౪ పుటలు.

సాధారణముగా తలిదండ్రుల గుణాలూ, లక్షణాలూ, భౌతికంగా అనేకములైన పోలికలూ వారి వారి సంతానములో గల్గడం మనం ప్రత్యక్షంగా చూస్తూవున్న సంగతే. ఇది ఎందువల్ల, ఏకారణాలచేత ఎక్కువతక్కువ పరిమాణాల్లో సంతానమందు గలుగుతూవుండేదీ విజ్ఞానసహితముగా ఈ చిన్న గ్రంథములో వివరింపబడినది.

## ౨. సుభాష్‌చంద్రబోసు

ఇది బోసు జీవితచరిత్రము. మొదటినుండి కలకత్తాలో మాయమైపోయినంతవరకూగల ఈమహావీరుని చరిత్రము సంక్షిప్తముగ వర్ణింపబడినది. వెల ఒక అణా.

## 3. బమ్మెర పోతన

గ్రంథకర్త: కవితావిశారద శ్రీ పంతము అంజనేయకవిగారు. వెల ఒక అణా. ౪౨ పుటలు.

పోతన జీవితముతోబాటు, ఈయనవ్రాసిన గ్రంథములనుండియు, ఇతరుల గ్రంథములనుండియు ఉదాహరణపద్యములను గైకొని, మరికొన్ని చాటువులనుగూడ దీసికొని ఈయననుగురించిన విషయము లనేకము లిందు పొందుపరుపబడినవి. కాళిదాసు, తెనాలి రామలింగని వృత్తాంతములమాదిరి ఈయన జీవనచరిత్రమును వెల్లడించుకథలుకూడ మనోరంజకములుగ నుండి ముందుముందు చదువుటకు ప్రేరేపించుచుండును.

## ౪. ఖాది

సంపాదకుడు: వెల్దుర్తి మాణిక్యరావుగారు. వెల ఒకఅణా, ౪౨ పుటలు.

ఇది ఖద్దరునుగూర్చిన చిన్నగ్రంథము. ఇదివరకటి సమాచారమెట్లా వున్నప్పటికీ ప్రస్తుతము నానాటికిని యుద్ధపుత్రాళ్లలో బిగుసుకొనిపోతూవున్న మనకు ఇది ఎంత ఆవశ్యకమో, ఇందు స్ఫుటముగా గోచరమగును. ఖద్దరును అపరిమితముగా పెంపొందించుటను గూర్చి మహాత్మాగాంధీ, నెహ్రూ మొదలగువారిచ్చిన ఉపన్యాసములును, కీ. శే. హైదరీ మున్నగు ప్రఖ్యాత రాజకీయవేత్తల అభిప్రాయములును ఇందు గలవు. ఆఖరున ఖద్దరుఉత్పత్తి, వినిమయములకు చెందిన కొన్ని లెక్కలును చేర్చబడినవి.

## ౫. దేవుడు : ఉన్నతనియంత

## ( God-The Super Dictator)

ఎన్ని పాశ్చాత్యశాస్త్రగ్రంథములనో పఠించిన పిమ్మట ఈ గ్రంథకర్త బి. కె. నారాయణ్ దేవునియెడల తనకుగల్గిన అభిప్రాయములను నిష్కపటముగ నిందు వెల్లడించియున్నాడు. కాని వీరి కృషి యంతయు విదేశీయగ్రంథపఠనమందే యైనట్లు గన్పట్టుచున్నది. దేవుడొక డున్నాడనే నమ్మకములేనివారుమాత్రమేకాక ఆస్తికులుగూడ వీరి యభిప్రాయములను సంగ్రహముగ తెలిసికొనవలెనన్న దీనిని చదువవచ్చును. వెల రు. ౦-౪-౦; ఆంధ్రపబ్లిషింగ్ కంపెనీ మెంబరులకు రు. ౦-౨-౦ లు మాత్రమే.

## ౭. విద్యావిషయకవివాదము (హైదరాబాదు)

## (Education Muddle in Hyderabad.)

నైజాంగారిరాజ్యములో ఎటువంటిపద్ధతులపై విద్యను గరపవలెననెడి విషయమై అనేకసంవత్సరములుగ వాదవివాదములు జరుగుచున్నవి. ఈతగాదాను పరిష్కరించుటకు ఒకకమీషను నేర్పరచియు, తుదకు ప్రభుత్వమువారి ఇచ్ఛానుసారముగ నొకవిధానమును పరిష్కరించియుండిరి. కాని ఆ విధానము దేశీయులగు వారికి ఉపకరించక పరిపాలకులకుమాత్రమే పనికివచ్చుననియు, అందుచే ఈపద్ధతులను మార్చి ప్రజలకు హితకరములైన పద్ధతులను నెలకొల్పవలయుననియు నిందు సప్రమాణముగ వాదింపబడియున్నది. వెల రు. ౦-౮-౦, మెంబర్లకు రు. ౦-౨-౦.

౫, ౬ నెంబర్ల గ్రంథములు ఇంగ్లీషుభాషలో వ్రాయబడినవి.

పై ఆరుగ్రంథములకును ప్రకాశకులు: ఆంధ్ర పబ్లిషింగ్ కంపెనీ, సుల్తాన్ బజారు, హైదరాబాదు (దక్కన్.)

---

## కృషి

ఇది క్రొత్తగా బయలుదేరిన మాసపత్రికయొక్క మొదటిసంపుటపు మొదటిసంచిక. సంపాదకుడు: కె. వేమనరెడ్డిగారు, అనపర్తి, తూర్పుగోదావరిజిల్లా. పారిశ్రామిక, వాణిజ్య, వైజ్ఞానిక సంబంధివిషయములకు ప్రాధాన్యమిచ్చున దగుటచే, ఇందునిమిత్తము జీవితము ధారపోసి కీర్తిశేషులైన శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి జీవితసంగ్రహముగల వ్యాసముతో ప్రారంభమవుతుంది. పింగాణీ, కాగితముల పరిశ్రమలకు చెందిన రెండువ్యాసములు వాటి పుట్టుపూర్వోత్తరముల తెలుపు సంక్షిప్తచరిత్రలతో లిఖింపబడియున్నవి. ఆంధ్రదేశపునాకాపరిశ్రమను, ఆంధ్రదేశపు ఖనిజసంపత్తిని వెల్లడించు రెండు మంచిరచనలు గలవు. మాల్టు తయారుచేసుకొను పద్ధతి, మరికొన్ని రసాయనపు మందులు చేసుకొనువిధానము లిందు వర్ణింపబడియున్నవి. ఆఖరున ఆర్. కె. యన్. గజపతిరాజుగారు లిఖించిన ఇంగ్లీషువ్యాసములో ప్రభుత్వముయొక్క ప్రోత్సాహమును, సహాయమును లేకుండుటచేతనే మనము పారిశ్రామికముగ వెనుకబడియున్నామను భూతార్థము చక్కగ ప్రకటింపబడినది.

సాలుచందా రు. ౩-౦-౦. విడిప్రతిక రు. ౦-౪-౦.

---

## నీ కోసం

రచయిత: శ్రీ పన్యాల రంగనాథరావుగారు.
ప్రకాశకులు: శారదాపబ్లిషింగ్ హౌస్, అనకాపల్లి.
ధర ౬ అణాలు.

సాహిత్యక్షేత్రం అంతా ఓకుక్కి దున్ని విడుద్దామనే రంగనాథరావు రాసిన పెద్దకథ ఇది. అద్దెకున్న కుర్రాడు ఇంటివారి అమ్మాయిని చెట్టపట్టడం కథ. నాయికానాయకులకు తదితర ప్రపంచంఅంతా సహాయం చేస్తుంది ఇక్కడ. అపురూపమైన ఈవిషయాన్ని అతికి, నాయికానాయకుల మనస్తత్వంవల్ల ప్రణయం ఆగడం, నసపడం ఇందులో విశేషం. ఇందులో ఇంటిఆసామికి శ్రీ కొడవటిగంటి కుటుంబరావు 'నీకేంకావాలి'లో 'పెత్తండ్రి' తండ్రి. రంగనాథరావులోని కుటుంబరావు ఎప్పుడు సెలవు తీసుకుంటాడా అనిపించింది ఈ 'నీకోసం'లో

జ. రు.

---

## ఓరుగల్లుకోట

గ్రంథకర్తలు: శ్రీ శ్రీనివాససోదరులు, శతావధానులు, పవరుపేట, ఏలూరు. పుటలు సుమారు ౯౨. వెల ౪ అణాలు.

నైజామురాజ్యములోని వరంగల్లుయొక్క ప్రాచీనచరిత్రను కండ్లకుకట్టి చూపుచున్న ఒక పద్యకావ్యమిది. కాకతినృపతులనాటి వరంగల్లువైభవము ఈ పద్యకావ్యములో అచ్చొత్తినట్లుగా రూపొందినదనవచ్చును. పద్యధార దానికితోడయి చదువుటకు హాయినిచ్చుచున్నది. ఇటువంటి చరిత్రకావ్యములకు ఆంధ్రులు నిజముగా తగిన ఆదరప్రోత్సాహముల నిచ్చినచో తమజాతికే మేలుచేసినవారగుదురు.

---

## సైతాన్ జపాన్

రచయిత: అగ్నిహోత్రుడు. చిత్రాంగి కార్యాలయము (అండర్సన్ వీథి, మద్రాసు)వారు ప్రచురించినది. జపానువారు ఈ సంగ్రామములో గావించుచున్న సైతానుచేష్టలన్నియు సవిస్తరముగా తెలుపబడియున్నవి. కొన్ని చిత్రములుగూడ గలవు. వెల 2 అణాలు.

## పల్లెటూరు

రచయిత: యడ్లపల్లి దేవయ్యచౌదరిగారు, చింతలపూడి, పొన్నూరుపోస్టు, గుంటూరుజిల్లా. వెల రు. ౦-౮-౦.

చిన్న పద్యగ్రంథము. పల్లెటూళ్లు అందలి రైతుల జీవితమును కనుగొనుట కిది చక్కని చిత్రము. ముఖ్యముగా ఆధునిక నాగరికత వ్యాపించని పూర్వకాలమున రైతులవ్యవస్థ ఎట్లుండినదియు, ఇప్పుడేలాగు పరివర్తన మందినదియు తెలిసికొనగోరువారల కిది మంచి ఉపయోగకరమైన గ్రంథము. ఇందలి నాలుగవ వీథిలోని హరిజనవాడ వర్ణనము మహచింతాజనకంగా వున్నది.

## దివ్యజ్యోతి

రచయిత: విద్వాన్ చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, బోర్డుహైస్కూలు, పొన్నేరి. వెల రు. ౦-౧౨-౦.

అర్జునుడు బోయకులమున కన్నడుగా జన్మించి ఈశ్వరభక్తుడై స్వకీయనేత్రముల నూడబెరికి మహాదేవున కర్పించి తనభక్తిపారమ్యాన్ని లోకమునకు వెల్లడించుకొన్న ఇతివృత్తము నాటకరూపమున వ్రాయబడినది.

# గ్రంథస్వీకారము

## వీరశైవ మహాత్ములు

పండిత శ్రీకాశీనాథశాస్త్రిగారి కన్నడకృతికి అనువాదము. అనువాదకులు: మఠం సిద్ధవీరయ్యగారు. వెల ౮ అణాలు.

## సంక్షిప్త శివపూజావిధి

సంపాదకులు: పండిత చిదిరెమఠము వీరభద్ర శర్మగారు. వెల ౨ అణాలు.

## బ్రహ్మమీమాంసాసూత్ర-శ్రీకరభాష్యమ్

శ్రీపతిపండితాచార్యప్రణీతము. సంస్కృతభాషామయము. పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారిచే పరిష్కరింపబడినది. వెల ౧౨ అణాలు.

పైగూడు గ్రంథములకును ప్రకాశకులు: శివధర్మ గ్రంథమాల, [illegible], సజ్జన్‌లాల్ వీథి, సికిందరాబాదు, దక్కను.

## నేటి జపాను

రచయిత: కొత్తపల్లి సుబ్బరామయ్యగారు ప్రకాశకులు: సంస్కృతి గ్రంథమండలి, వంగల్ బిల్డింగ్సు, పెరంబూరు పోస్టు, మద్రాసు. వెల అణాలు.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.



ర క్షా క ర ం డ ము

[చిత్రకారుడు : శ్రీ తేజోమూర్తుల కేశవరావు]